# భారతి

మాసపత్రిక

★

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)

★

ఏప్రిల్ 1973

సంపుటము : 50 : సంచిక : 4 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1973



**14 - 4 - 73**

దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 35 వ పుణ్యవర్ధంతి

శివముల్ తత్వముల్ పరవశించిన వేళ, అనర్ఘ ధర్మముల్
శివములు చేతలై పరిమళించిన వేళ, రసాత్మ భావముల్
శివములు గీతికల్ మధుర శీధువు లందినవేళ తెల్గునన్
ప్రవరము శైవతేజము శుభాకృతి వెల్గిన వెల్గు వెల్గులై.

# భవభూతి ర్విశిష్యతే

శ్రీ శనగన నరసింహస్వామి

కలిగిన గుండెతో వణకు గంటము నెట్టెటులో కరంబునన్
నిలుపుచు కన్గవన్ దొనకు నీరము రెప్పల నప్పళించుచున్
పలికితివేమొ భూమిజ ప్రవాసకథన్; పఠియించు వేళలన్
జలజల కోష్ణ బాష్పములు జారు రసజ్ఞుల నేత్రవీథులన్.

జానకియున్న నీ హృదయ పద్మమునందు వసించు దైవ మ
మ్మానిని గూర్చి పౌరజన మండలి పల్కిన హేయ వాక్యముల్
పూని వచింపలేక మదిపొక్కుచు నీవు వహించు నట్టి స
న్మౌనము నెంచినన్ సుకవి మండన! గుండెలు బ్రద్దలయ్యెడిన్.

అగ్నియటంచు పల్కెద రహో! పలుమారు విశుద్ధి సేయ నా
అగ్ని యెవండు మా తనయ అచ్చపు శీలమునంచు అగ్నియే
సిగ్గిలగా ననెన్ జనకశేఖరు డీదృశ సూక్తులందు నీ
పగ్గకు సాటిరారు కవి భాసుడు వ్యాసుడు కాళిదాసుడున్.

పరమ పవిత్ర శీలమున బ్రహ్మమునీంద్రుల గేస్తురాండ్ర నే
మరవగ జేయజాలు జనమాన్య ధరాజ కఠోర గర్భ ని
ర్భర వనికేగు ఘట్టమును వ్రాయు నెడన్ పుటపాకమై మదిన్
తరచిన దుఃఖమెట్లు దిగద్రావితివో కరుణా స్ఫురన్మతీ!

ఉత్తర రామరూపక మహత్తమ మా రచనమ్ము సర్వ లో
కోత్తర మన్య దుర్లభ మహో యనుచున్ దలయూచి; వాణికిన్
గ్రొత్త విలాస సంపదలు గూర్చిన నేర్పరి కాళిదాసుడే
చిత్తము పొంగి మెచ్చెనని చెప్పుదు రెంతటి ధన్యజీవివో!

కలుషములన్ గరంచి జనకాండము శుద్ధ మొనర్చు గౌతమీ
సలిలము వోలె పూతమగు సత్కవితన్ పచరించు నీవు మా
తెలుగు పొలంబు గన్న కవి దేవుడ వంచు నెరింగినంత మ
త్పులకిత భావబర్హిణ 'మపూర్వ గతిన్ పురివిప్పి యాడెడిన్,

ధర నరజన్మమెత్తి సుకృతంబునకున్ చెలి యౌచు; జానకీ
వర చరితంబు రీతి ననవద్యము పావనమున్ గభీరమున్
కరుణ రసాశ్రయంబును జగద్ధితమైన భవత్ కవిత్వమున్
పరవశతన్ పఠింపగల భాగ్యము నా కొదవెన్ తరించితిన్.

వాసవు డాసనంబు దిగివచ్చి యెదుర్కొనెనే, విలాసి వి
న్యాసము మీర నచ్చరలు హారతు లెత్తిరె, గారవించిరే
వ్యాసుడు వామలూరుజు, డవార్య ముదంబున కౌగిలించిరే
భాసుడు కాళిదాసుడు సుపర్వపురిన్ నిను గాంచి, సత్కవీ!

తరులను కూర్మిబంధుల విధాన వరింతువు జంతు సంతతిన్
చిరసఖు లట్లు నెంతువు; భజింతువు భక్తి ధరావనీ సరి
ద్గిరులను దేవతాత్మల మతిన్; మునివాటికలన్ దలంచి మై
మరచి నుతింతు వీవు కవిమాతృడవే భవభూతి! సువ్రతీ!

గిరిఝరోభయతటీ పరివర్ధిత తపోవ
నోదితోద్గ్రథము నాదరించి —
దండకానంత కాంతార నిర్జన జన
స్థాన దుర్గమవీథి సంచరించి —
రామభద్రాంఘ్రి ముద్రామోద పులకిత
పంచవటీ వాటి పాదమ్రాని —
వనధరావృత మాల్యవత్ ప్రస్రవణ చిత్ర
కూటోపలశ్రేణి కొలువు దీరి —

విపుల గోదావరీతీర సుమపరాగ
విశద సైకత వీథుల విశ్రమించి
సుఖమొ దుఃఖమొ తెలియని శుద్ధమైన
ఏ మహానందమున కంఠ మెత్తినావొ!

శిలలు కూడను రోదించు—చీలిపోవు
వజ్ర హృదయము కూడ—పుష్పముల కంటె
మెత్తనౌ భావుక ప్రజాచిత్తము లిక
కరగి నీరగు టరుదె నీ కరుణ కృతికి!

పాలసంద్రము వంటి నీ భావవీథి
కదలి వచ్చిన పీయూష కలశమౌట
శ్రీ మదుత్తర రామచరిత్ర రసిక
రాట్ విబుధ పంక్తి కమృత పారణము కాదె!

# తెలుగు నాటకము

## శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

(గత సంచిక తరువాయి)

ఇప్పుడిప్పుడు పలువురు నాటకములందు పాత్రౌచితింబట్టి గ్రామ్య—అనఁగా తెనుఁగునం బాకృతమని చెప్పఁదగిన భేదములను గూర్చుచున్నారు. కాని కూర్పనివియు పెక్కుకలవు. నిజముగా కవి ప్రతిభ గల వాఁడేని, అతనికి తొలి ప్రయత్నముననే ఆయా పాత్రకు తగిన తెలుఁగు, సంస్కృతమో అనఁగా వ్యాకృతమో, ప్రాకృతమో అనఁగా గ్రామ్యమో—ఔచితింబట్టి తనంతటనే కుదురుకొనవలయును. సంస్కృతము ఇడవలసిన యెడను ఉద్ధతునికి భాష ఉద్ధతముగను, ఉదాత్తునికి ఉదాత్తముగాను భేదములు నిర్వహింపఁబడ వలయును. షేక్సుపియరుం గూర్చి తజ్ఞులు చెప్పిన యీ మెప్పుం గనఁదగును.

"The Variety of Shakespeare's style its daring transitions from gay to grave, from sublime to familiar, are quite evident. All sides of human character are reflected in his style. Who has not-felt the marvellous variety of his style, the unflogging ear with which he passes from one style to another in obedience to the mood or character of the speaker.? From the pure Colloquial, the cynical brutality of Iago to the fiery indignation of Emilia at the close, from the moving wail of Desdemona to the passionate anguish and the no less passionate anguish and the no less passionate repentance of Othello, he seems to sweep the whole scale in which human baseness and human nobility can find utterance."

ఇట్టి భేదములు గీర్వాణ మహాకవుల నాటకములం గన వగును. కావుననే భాషా ప్రయోగముం గూర్చి భరత సూత్రములం దొడంగి సాహిత్య దర్పణకారాది యాచార్యుల యనుశాసనముల వఱకును ఎంత యుపదేశము గలదు! ఎంత యుపదేశమున్నను, కవికి ప్రతిభ—శక్తి—చాలకున్న సరియగు నాటకము పుట్టదు. భాషితములందు భాషౌచితియేకాక వక్త్రౌచితియు పాటింపఁబడ వలయును. ప్రతిభచే అన్నియు తమంతటనే కుదురుకొనును. తెలుఁగున నేఁడు ఈ సర్వము యొక్కయు నిర్వాహము శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి నాటకములందక్క మఱెందును అగపడదు. ఉదాహరణములు వలయునన్న గ్రంథము అతిగా పెరిఁగి పోవును.

శాకుంతలమున కణ్వభాషితము ప్రతిముక్కయు ఋష్యుచితము—

'దిష్ట్యా ధూమాకులిత దృష్టే
రపి, యజమానస్య
పావక ఏవ ఆహుతిః పతితాః
వత్సే, సుశిష్య పరిద—
త్తేన విద్యా, అశోచనీ యాసి
సంవృత్తా. అద్యైవ
ఋషి రక్షితాం త్వాం భర్తుః
సకాశం విసృజామి.'

ప్రతాపరుద్రీయమున విద్యానాథ వాక్యము.

'నా హృదయము జగన్మిథ్యాత్వ రాద్ధాంత నిశాంతం బయ్యు నిట వపాహవిః పిండంబు వోలె పేలవతా భాజనంబయినది.'

యుగంధరమంత్రి వాక్యము— 'బేతాళరావుకు ఆ మాట చాలును, పెద్దసెట్టికి ఆ చీటి చాలును. పడుగు వేయుట క్షణము. పేక వేయుటకు మాసములు. నేను లేనప్పుడుగదా పట్టినాఁడు. నేను ఎట్లు లేకపోదునో చూచును గాక. వీఁడా నారాజాను హరించువాఁడు? పాతాళం బందుఁగావీ ప్రళయ పవన గభజాంబు

నంద్వైనఁగానీ......చేత న్నేనంది కొందుఁణా......సింహా పీఠాన నుంతున్...ఢిల్లీ పురీశుం...నా ఖైదిగా గట్టి తెత్తున్!'

భరతముని నాటక భాషితములను పాత్ర జాతికిని దేశమునకును తగిన యేసలును అక్షర వికృతులను కవి యూహింపఁదగుననియు హితవు చెప్పినాఁడు.

> 'గఙ్గాసాగరమధ్యేతు యే
> దేశాః సంప్రకీర్తితాః
> ఏకార బహులాం తేషు భాషాం
> తజ్ఞః ప్రయోజ యేత్.
> విన్ధ్య సాగరమధ్యే తు యే దేశాః
> స్మృతి మాగతాః
> నకార బహుళాం తేషు భాషాం
> తజ్జ్ఞః ప్రయోజ యేత్
> ................ ...............
> ... ..........................
> ఏవం భాషా విధానం తు
> కర్తవ్యం నాటకాశ్రయమ్.
> అత్ర నోక్తాం మయా యచ్చ
> లోకా ద్గ్రాహ్యం బుధై స్తు తత్.

'లోకా ద్గ్రాహ్యమ్'— లక్షణాత్ వ్యాకరణాత్ అనలేదు గదా! ఇందువలన బర్బరాది భిన్నములైన యీ దేశభాషలెల్ల గ్రామ్యములనియు, లక్షణ హీనము లనియు, వీనిని చక్కఁగా నెఱింగిన వారు అట్లే ప్రయోగింపవలయుననియు, ఎఱుంగనివారు శౌర సేనిని ఉక్త ప్రకారముగ మార్చుకోవలయునని నా దేశము. ఈ మర్యాదచే ఆంధ్ర రూపకములయందును గ్రామ్య భేదములం బ్రయోగించుట యావశ్యక మనియు అందులకు లోకమే ప్రమాణము గాని లక్షణ గ్రంథములు అనావశ్యకములనియు జాత్యాది భేదములను గ్రామ్య భాషా భేదములచే నిర్వహించుట అత్యంతావశ్యకమనియు స్పష్టముగదా—' వే. వేం. గ్రామ్య భాషా ప్రయోగ నిబంధనము.

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి నాటకములందు భాషకు పాత్రౌచితీ నిర్వాహము లెస్సగా చేయఁబడినది. నీచులకు తురక చాకి మంగలి జాలరి మాదిగమాల మొదలగు వారికి తగిన భేదములు ప్రయుక్తములు. దాన హాస్యము కలుగువనికాని వస్తువు తేలికపడునని కాని ప్రజలు భయపడుదురేమో అని 'ప్రౌఢ జనైక వేద్య రసంబగు ప్రతాపరుద్రీయము' అని తామె ఒండెడ విశేషించినారు.

తెలుఁగు నాటకమున పాత్రోచితముగా సంస్కృతపుఁ దెలుఁగును ప్రాకృతంపుఁ దెలుఁగును నానా భేదములతో ప్రయోగింపవలయును. ఇందులకు కొంత వఱకు పాత్రల గుణశీలములును పరికింపఁదగును. ప్రతాపరుద్రీయమున తురకల కందఱికిని, జనాను మొదలు సుల్తాను వఱకు ఏకవిధ గ్రామ్యమే ప్రయుక్తము. అందుల కారణము సుల్తాను 'అన్ని కోమా రుద్రి సిపాయికి చంపితక్కు. ఎక్కనవాడే' యంటూ. వల్ఖాను ఖూనీ బచేసి ఢిల్లీ సింహాసన మపహరించు నటు. 'అందర్కి చంపడాన్కి తయ్యార్. సుల్తాన్కి కూడ చంపడాన్కి తయ్యార్. ఇదరు నాకు ఏలాగో దొర్కారు భాయ్.' అని జోస్య మడుగును. బొబ్బిలి యుద్ధ నాటకమున హైదర్జంగు ప్రభృతులకు ఇట్టి తురుష్క గ్రామ్యమే ప్రయోగించియు, గోల్కొండ నవాబునకును సేనాని రాయబారి హుసేన్ ఖానుకును పరాసు బూసీ దొరకును సంస్కృతము ప్రయోగించుట వారిని ఉదాత్తులుగా ఉత్తమ పాత్రలుగా సభ్యులుగా తాము నిర్వహించినందున ఇది చిత్తమున కెక్కుటకై శ్రీ శాస్త్రులవారు ఇట్లన్నారు. ఆంగ్ల భారత చక్రవర్తి పంచమజార్జి నాయకముగాను సప్తమ యెడ్వర్డు నాయకముగాను ఆంధ్రమున నాటకము రచింపం దలంపేని వారికి దుష్యంత పురూరవః ప్రతాపరుద్రుల కిడిన సుసంస్కృతాంధ్రమును ఇడవలదా' అని. మహాకవి విశాఖదత్తుఁడు ముద్రారాక్షసమున పార్వతీయ రాజునకు పర్వతేశ్వరుని కొమారునికి మలయకేతునకు, తొలుత చాణక్య మిత్రమై పిదప రాక్షసునికి ప్రాపును చంద్రగుప్తునికి ఉద్దియునైన ప్రతినాయకునికి 'మ్లేచ్ఛునికి' చంద్రగుప్త చక్రవర్తి కిడినంతటి మంచి సంస్కృతమే ఉంచినాఁడు. షేక్స్పియరు గ్రీన్‌రోప్ మొదలగు దేశాల కథల వారికి యథోచితాంగముగ నిడఁడా? మఱియు ఈ భరత కారికాల యుద్ధారముం గనుఁడు.

> 'ధీరోద్ధతే ధీ రలవితే ధీరోదాత్తే తథైవ చ
> ధీరప్రశాన్తే చ తథా పాఠ్యం యోజ్యం తు
> సంస్కృతమ్

ఏ షా మేవ తు సర్వేషాం నాట్యకానాం ప్రయోగజమ్
కర్తె రవ్యప దేశేన ప్రాకృతం తు ప్రయోజయేత్
ఐశ్వర్యేణ ప్రమత్తస్య ఐశ్వర్యేణ ప్లుతస్య చ
దారిద్ర్యేణ ప్రమత్తస్య దారిద్ర్యేణ ప్లుతస్య చ
ఉత్తమ స్యాపి బ్ర ః ప్రాకృతం సంప్రయోజ
యేత్.'

అను మొదలగు సలహాలు ఆ మహాకవులకు భరత మునను ఇంకను ఆకరమునందును నిజప్రతిభయందును ఎన్నెన్ని కలవో! (ఈ యుద్ధారమున ఓపికపట్టి సాధుసాతమును బరోడా కాశీ బొంబాయి భరతనాట్య ప్రతులంజూచి, అభినవ భారతిం బరికించి నిర్ణ యించుకొనఁదగును. ఇట దిక్ప్రదర్శనముగా ఉదా హృతము.)

పెక్కు ఆంధ్ర నాటకములతో పాటల పెల్లి దము గలదు. పద్యములయు పెల్లిదము గలదు. కాళి దాస శ్రీహర్షులం బోని నిపుణులకుం దప్ప ఎందు ఎవరికి పాట యిడవలయునో ఎందు ఎవరికి పద్య మిడవలయునో తెలియునా? రంగాన పాటం గూర్చి భరతముని యను శాసనము—

'యత్రాభినేయం గీతం స్యాత్
తత్రవాద్యం నయోజ యేత్' అని.

(గీతం ఇతి గీయమానం వాక్యం అభినేయం స్వాక్మాభి ముఖ్యం అఙ్గసామ్యం నేయం. తతో హేతోః తస్యైవ ప్రాధాన్యాత్ తస్మిన్కాలే అవనద్ధవాద్యం తదాచ్ఛాదన కారీ భవతీతి స్వాతన్త్ర్యేణ నయోజ యేత్—అభినవ భారతి—)

వాద్యము భాషితము సామాజికుల చెవిం బడు టకు ఆటంకము. నేను సామాజికుఁడనుగా నుండి నా ప్రక్కనున్న రసిక ప్రకాండులను వాద్యయుక్త పాటం గోరువారిని అడిగి యరసితిని—'బాబూ, రంగాన ఇపుడు ఉచ్చరితమగుచుండున దేమి?' అని. ఫలానా మాటలని తెలియుట లేదు గాని, ఏమో రాగము వినంబడుచున్నది.' అన్నారు. మఱి యట్టి దానికి ఆటలో స్థానమేల? దాన రంజనమేమి? మఱి నాటకాన పద్యములనైనను పాడ నగునా, రంజ మునకై?

కాళిదాస శ్రీహర్షాదులు తమ నాటకముల నందందు పాటల నిడి యున్నారు. వానికి వానియందు ప్రధాన స్థానమే కల్పించియున్నారు. శాకుంతలము నటి పాట.

'ఈ సీసి చుంబిదాఇ భమరేహి' ఇత్యాది. దానిని విని సూత్రి 'సాధు గీతమ్! అహో రాగబద్ధ చిత్త వృత్తి రాలిఖిత ఇవ సర్వతో రఙ్గః......

'త వాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః...'

ఈ మెచ్చుకోలుచేత రంగాన ఎంత మధుర మైన పాటను కాళిదాసు అపేక్షించినాఁడో తెలియఁ దగును. మఱియు అందె (V) 1 హంసపదిక పాటనుం గూర్చియు—

'అహిణవ మహులోలుపో తుమం
తహం పరిచుంబిఅ చూఅమంజరిం'

ఇత్యాది. దానిని రాచవగల్లలో మెలఁగు దాజవయ స్యుఁడు, పాట రసమును చక్కగా నెఱిఁగినవాఁడో విదూషకుఁడు వర్ణించినాఁడు.

'భో వయస్య, సఙ్గీత శాలాన్తరే అవధానం దేహి. కల విశుద్ధాయాః గీతేః స్వర సంయోగః శ్రూయతే. జానే తత్ర భవతీ హంసపదికా వర్ణ పరిచయం కరోతీతి.

దానినే రాజును వర్ణించినాఁడు.

'అహో! రాగపరీవాహి గీతిః'

రాగదపు వెల్లువగా నున్నదని.

మాళవికలోను ఒక పాట మాళవిక ఛలికాభి నయమునకైన వస్తువు మువ్వ క్షేత్రయ్య పదముం బోనిది.

'దుల్లహో పిఓ, తస్సిం
భవ హిఅఅ ణిరాసం' ఇత్యాది.

ఆ యాటపాటచే ఛలికము ఫలించినది. పృథ్వీ భాగమున మేజువాణిలో మద్దెల గలదు. మఱి దాని యారంభమునకు పూర్వమే నిర్వాద్యముగా 'ఉపగాన మున' సభకు పాట వినవ వలయును.

ప్రియదర్శికలో ఆరణ్యక వీణపాట —
'అహిణవ రాఅఖిత్తా
మహుఅరియా వామఏణ కామేణ' ఇత్యాది.

దీనిని 'అహో గీతం' అని వత్సరాజు మెచ్చుకొన్నాడు.

విక్రమోర్వశీలో విరహోన్మత్త పురూరవుని పిచ్చి యాటపాటలు—

పరహు అ మహుర పలావిణి కాన్తి
ణన్దణవణ సచ్ఛన్ద భమన్తి—ఇత్యాది.

పై పాట లన్నియు రాగంపు వెల్లువలె. మఱి పిచ్చివానిపాట పిచ్చిగంతులకు తగియున్నది దీనికిని తోడు మద్దెలదెబ్బ లేదు. అన్నియు 'పాట' అను నుపక్రమముతో ప్రసక్తించినవే.

వీనింబట్టే నాటకములందు తక్కిన పద్యములను ప్రకరణమునకు భావమునకు తగిన రాగమున నిర్వాద్యముగాను ఉచిత సాత్త్వి కాద్యభి నయముతోను పాడిన లెస్సగా నుండునని తజ్జ్ఞుల యుపదేశముచే పాడుట తొడంగఁబడి అది యాచారమైనది. అయినను నాటకాన పద్యము పాడుటయు తనంతట ఒక కళ యనందగును. పద్యభావమునకు వక్తకు తగిన రాగము నిర్ణయించి, ఆ రాగము యెత్తుగడయు విన్యాసములు ముగింపెను. కేవలము పద్యార్థమునకు సదృశము చేయవలయును. ఘనరాగములు శంకరాభరణము భైరవి తోడి కాంభోజి మొదలైనవి. అన్ని భావములకు పనికి వచ్చును, తగినట్లు అమర్చుకొనందగును. ముఖారి సావేరి నాదరామక్రియ ప్రభృతులు శోకస్ఫురణకు. బెదరింపు దెప్పట మొదలగుదానికి అఠాణా యొండు ఎత్తుగడ, కానడా యేని. యదుకుల కాంభోజి ఆనందభైరవి కల్యాణి దేవ గాంధారి మొదలైనవన్నియు విచారించి అవలంబింపందగినవే. గాన విద్వాంసులు ఆర్యకుడి కోనేరిరాజపురం పుష్పవనం చెంబైయాదులు కచ్చేరి యంతమున కర్ణామృత ముకుందమాలాది — శ్లోకములం బాడుదురు కాని, శ్లోకమునకై రాగముం బాడరు. అట్లుగాక వారి పాండితి కౌశలములకు సదృశముగా ఆ శ్లోకములను అర్థానుగుణముగాను భావానుగుణముగాను, తమ పాట వానికి వ్యాఖ్య యగునట్లు నుంగా బాడిన అది యొకయెత్తును తక్కిన కచ్చేరియంతయు నొక యెత్తునుం గాదా, ఈ మార్గమున రంజనము ఉత్తమ మనందగినది అనుభవరూఢమై యుండఁగా మఱి కొంకును ఆక్షేపణయు ఏల? ఇట్టి భాషిత పద్యముల పాటయు పాట పద్యముల పాటయు లెస్సయ యనందగును. తక్కిన దానిని నిషేధింపఁదగును.

మఱి నారద కబీర్ థాన్సే నాగుల పాటలు ఆటవస్తువునం జేరనివి నాటకకవి ఏ ఘట్టము కోసము వ్రాయనివి రంగాన పనికిరావు. వానికి ఆయా నాటకాలలో స్థానము లేదు. నారదుఁడు అప్రయోగని వీణను, శిశువుల యాట వస్తువుం బోని దానిని బుజాన వ్రేలాడించుకొను టెందులకు? తన నోటి పాట దానికి సాహిత్యాను గానమా? నాగసరగాఁడు నడచుచు దానిని వాయించునట్లు వీణెనుగూడ నేల నడచుచు మీటు నెగురుచు వాయింపనగునా? నారదుఁడు నోటనుం బాడువాఁడా? కాళిదాసు నారదుఁడు విక్రమోర్వశీలో నిర్వీణముగా నిర్గానముగాను, మేఘము లేని మెఱుపుల మొత్తమైన తనుకాంతితోదిగి ఇంద్రు సందేశమును పురూరవునికి అందిచ్చినాఁడు. మాఘుఁడు మహాకవి కృష్ణుని సన్నిధికి నారదునిమింటినుండి యిట్టి వర్ణనలకుం దగిన వానింగానే దింపెను గాని, ఆయనతో గాలికి ఊరకే స్వరములం బలుకుచుండు తీగెలతోడి మహతి వీణెనుం గూడ చెప్పెను. మఱి యాయన పాట ప్రస్తావముగాని దాని పాట ప్రస్తావముగాని లేదు. మఱియు నారదుఁడు వీణెపాటకు ప్రసిద్ధుఁడా నోటిపాటకు ప్రసిద్ధుఁడా? మఱి యీ నాటకాలవారు ఆయనను నోటం బాడింతురే కాని వీణెపాటం బాడింపరే. అదిగో నారదుని వీణె ధ్వని యనరు. కృష్ణుని లీలలవలె నారదుని పాటయు మానుసులకు అనుకరణమునకు అందునది గాదు. నారద కబీరాదివేషులు ఆ 'యభినవారి బిరుద విరాజితులు' బిరుదులం గోసివేసిన అనామకులై యదుంగుదురు. మిథ్యాకీర్తిని చీకటి కమ్మను.

ఆచార్యులు పలుదెఱంగుల రూపకములను అంత కన్నను ఎక్కువ సంఖ్యగల యుపరూపకములను చెప్పియున్నారు. అన్నిటికిని సంస్కృతమున ఒకప్పుడు లక్ష్యములు ఉదాహరణములు ఉండెనేమో. ఇప్పుడు ఎన్నింటికో ఉదాహరణములు లేవు. ఉపరూపకములకు లేవుగదా, దశవిధ రూపకములలో నయితము ఎన్నింటికో లక్ష్యములు లేవు. అన్నిటిలోను శ్లాఘ్యతమము అన్న నాటకమున శృంగారమే కాని వీరమే కాని ఒక్కటే ప్రధానరసము కాఁదగును. తక్కిన

వ్వెన్ని అంగములే. అలవోక ప్రస్తావములందును, నాటకము ప్రసక్తింపనప్పుడును అభినవభారతిలో 'తతోఽపి శృఙ్గార వీరయోః సర్వత్ర రఞ్జక పరమ పుమర్థతా ప్రకర్షా దుపక్షేపః.' భరత–?. పుట–222; 'కుర్యా దనన్తరం చారీ మితి. తేన శృఙ్గార రస ప్రధానం వీర రసప్రధానం వా దేవద్విజస్తోత్రోద్దేశ శ్లోకం పఠేత్.' భరత–? పుట–250. అని ఆ రెంటి యనివారిత స్మరణ కలదు. ఇతర రూపకములలో ఇతర రసముల యంగిత అందందు లేకపోలేదు, మఱి యా యుత్తమ మున కథాసంవిధానమందు ఆ యితర రసములకు ప్రాధాన్యము అనుచితమని చిత్తతత్త్వ పరిశీలన పూర్వకమైన హితవు చెప్పఁబడినది. మఱి శాంతమను రసాంతరము, శమము స్థాయిగాఁగలది ఎట్టి నాటకమునకును అనుచితమని చెప్పఁబడినది. కావున కరుణ ప్రధానమును హరిశ్చంద్ర నాటకమును శాంతము ప్రధానమగు రామదాస నందనారులునుఁ ఏపాటివో ఎఱుంగఁదగును. శాకుంతలమున కణ్వుఁడు శమి యైనను అత్యంత పుత్రికా స్నేహముచేతను మృగము లందఱియు తరు గుల్మలతాదుల యందఱియు ప్రేమ చేతను తద్వియోగవిక్లబతచేతను ఉత్తమ రసాలంబమై 'తత్రాపి చ చతుర్థోంఽకః' అన్న శాకుంతల కీర్తికి కారణమైనాఁడు. నందనారు నారద కబీరు రామదాస విరాగులు శుద్ధశాంతులు ఆయనకు సాటి కారు. మఱియు ప్రబోధ చంద్రోదయ సంకల్ప సూర్యోదయాదులయందు దాని వారు శాంతమన్నను, నిజముగా శాంతము గాదు, వానియందు వీరమే రసమని నిర్ణయించి నారు. శాంతకరుణములు చప్పగా నుండును. అంతలో మోహము మొత్తును. రామదాస విరాగులకు జైలులో భక్త్యున్మాదమున 'కృతి' 'కీర్తన' 'యష్టపది'–ఆ కవికిని నాటకవస్తువునకుం జెందనివి తప్ప, మఱి యేమున్నది?

గ్రీకు ఆంగ్లాది హూణనాటకములలో 'కామెడీ'– శృంగార–హాస్యాది ప్రచురము లలితమనియు తేలిక యనియు, 'ట్రాజెడీ' నాయకాది వధాంతమైనను వీరాది రసఘనమనియు ప్రసిద్ధిం జెప్పుదురు. రామ రాజ్య పతన సారంగధరాదులు నాయక మరణముం జెప్పి లక్షణసేతువును తెగఁగొట్టినవి అవి యేపాటివో పోనిండు. కరుణ విప్రలంభ ప్రధానములు రసవదుత్తమములు అని పేరుగన్న ఉత్తర శాకుంతలము (V, VI, VII అంకములు) ఉత్తర రామచరితము, స్వప్నవాసవదత్తము, తాపసవత్సరాజము, ఉత్తర మాలతీ మాధవము, నాగానందము, వేంకటరాయ శాస్త్రుల వారి బొబ్బిలియుద్ధము మొదలైనవి కడపటి నిముసమున రవంతలో చావు తప్పి శుభముం గన్నవి యైనను ట్రాజెడీ రసఘనతా సమగ్రములె యగును.

ఆచార్యులు అంకమున రంగాన ఇవి ప్రదర్శింపరానివి అని నిషేధించి యున్నారు—దూరమునుండి పిలుచుట; (కడు దూరమార్గములు), చంపుట, యుద్ధము, రాజ్యవిప్లవము. వివాహము, భోజనము, శాపము, మల విసర్జనము, చావు, రతము, దంతచ్ఛేద్యము, నఖచ్ఛేద్యము, అట్టి లజ్జాకరము ఇంక నేదేనియు, నిద్ర, అధరపానాదికము, నగరాదుల ముట్టడి, స్నానమాడుట, మైపూఁతం బూసికొనుట— అను నివి. నాటకము రసప్రధానము, ఆనందమునకై చూడఁబడునది. దూరమునుండి పిలుచుట కేకవేయుట అసభ్యము గదా. దూరపుదారులు నడచుట యన్నను అదియు అశక్యము, అసభ్యము, రసహీనము, శుష్కము. (అట్టిది సినీమాలలో సులువును చూడఁదగియు నైనది) చంపుట కంటికి వెక్కసము, దానిని ఎవరు చూడఁగలరు? దీనిని ధనవ్యయము చేసికొని చూడవత్తురా? యుద్ధమును భయంకరము బీభత్సము, చూపను చూడను అశక్యము. (అదియు సినీమాలలో అలవిపడును.) రాజ్యదేశ విప్లవములును విరసములు రంగాన ఇముడ్పఁజాలనివియు. వివాహమును భోజనమును దర్శనీయములు గావు, వృథాకాలహరణములు, నీరసములు. శాపము—తిట్టుటయేని తత్కార్యము చచ్చుటో కాలిపోవుటో మఱియు నెట్టిదో— ఇది కూడమి ప్రత్యక్షమే కదా. మలవిసర్జన మరణరతములు చూపఁదగనివగుట ప్రత్యక్షమే. దంతక్షత నఖక్షత చుంబన కామాలింగనాదికములు చూపఱకు లజ్జాకరములు, అందఱి యెదుట అవి చేయువారు సిగ్గుమాలిన వారని ప్రకటమగును. స్నానము వస్త్రధారణము అర్ధపూర్ణ నగ్నతలం జూపునది ఎంత లజ్జాకరము! అందేమి రసము? చూపఱు దానిం జూతురా? ఒక విద్యానాథుఁడు రంగాన యథావిధిగా వస్త్రధారణము చేయఁబోయి, అది చేఁజు జాఱఁగా నగ్నుఁడై

సిగ్గుపడి సిగ్గుగొలిపెను. కాళిదాస శ్రీహర్ష భవ భూత్యాదులు సంభోగ శృంగారమును జెప్పినను నాయికా నాయకులు ఒండొరులం దాఁకనుం గూడఁ దాఁకనీక ఎంత సుకుమారముగా ఎంత నాజూకుగా, ఎంత నాజూకుగా, ఎంత యుదాత్తముగా మఱి యదెంత రసవంతముగా చెప్పినారు!

ఇపుడు నాటకమున స్త్రీలే స్త్రీ పాత్రములు ధరింపవలయుననుట ఉపదేశింపఁబడుచున్నది. అను ష్ఠానమును అరంభమగుచున్నది. కాళిదాస భవ భూత్యాదుల కాలమున నటకుటుంబములు— సూత్రధారుఁడు వాని భార్య, వానియన్న వాని మేనమామ —యన్నట్లు నాటకము లాడుచుండిరి. భవభూతి యంతర్నాటిక యుత్తర చరితమును అప్సరసలు ఆడిరి. (అందు పురుష పాత్రలేదు.) విక్రమోర్వశీయమున లక్ష్మీ స్వయంవర నాటకమును అప్సరసలు ఆడిరి. మఱి మన యాంధ్రమున పాతకాలమున ఏదో యొక భోగము వారి సభలో తప్ప—అందు స్త్రీలే పురుష పాత్రలం బూను చుండిరి. తక్కిన వానిలో పురుషులే స్త్రీ వేషములం దాల్చుచుండిరి. అందు పలువురు ఏ స్త్రీయు తనతో సాటిగా అభినయింపఁజాల దన్నంత నేర్పులో, ఎల్ల స్త్రీలకును దర్శనీయముగా అభిన యించుచుండిరి. జగ్గరాజు శ్రీనివాసాచార్య రంగసామి స్థానము నరసింహాదులకు ఈడుగా ఆ వేషాలు వేయ గల స్త్రీలు ఏరీ? ఒకని భార్య వేఱొకని భార్య వేషము వేయుట, ఈడువచ్చిన కన్యలు విశృంఖలముగా ఎవని కెవనికో భార్య వేషము వేయుట చిత్తమునకు ఇంతంత యనరాని వెగటు కలిగించును. ఆ మార్గ మునకు మన యాచారములు దూరము. గొప్ప రాణులు అసూర్యం పశ్యలట! మఱి నేడు ప్రౌఢల పెండ్లి, విధవల పెండ్లి, మాఱుమనువులు, విడా కులు ఇట్టివి బలిసి మన దేశము మఱి యిలలో ఎందును లేని మహామహిమగల పాతివ్రత్యమను దానికి ఏక లక్ష్యమై ఏకభూమి యైనట్టిది, సీతా శకుంతలా దమయంతీ చంద్రమత్యరుంధత్యాదులకు ఒక్కచోటె నెలవైనట్టిది, ఎలిజబెత్ మేరీయాని మార్గరెట్టు ఒల్లిలకును ఆ బేగములకును ఈ బీబీలకును ఏక భూమి యైనపుడు అవియు ఎట్లు బలియునో, ఇపుడందందు అంకురములు పుట్టుచున్నవి.

నాటకమునకు కవి ప్రతిభ తొలి యక్కఱ. కవి కులగురువు, కాళిదాసు తన మూఁడు నాటకము లందును ప్రరోచనాంగముగా మొదట కవినే విశే షించును. మాళవికలో

'పారి— భావం తావత్ ప్రథిత యశసాం భాస సౌమిల్లి కవి పుత్రాదీనాం ప్రబన్ధా నతిక్రమ్య. వర్త మానకవేః కాళిదాసస్య క్రియాయాం కుతః పరిషదో బహుమానః?

సూత్ర—అయి వివేక విశ్రాన్త మభిహితమ్.పశ్య—

పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్.
సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే
మూఢః పరప్రత్యయ నేయ బుద్ధిః.' అని.

అట్లే విక్రమోర్వశిలోను

సూత్ర—మారిష, బహు శస్తు పరిషదా పూర్వేషా కవీనాం దృష్టః ప్రయోగబన్ధః సోఽహ మద్య విక్ర మోర్వశీయం నామ అపూర్వం నాటకం ప్రయోక్ష్యే ..........................

ప్రణయిషు వా దాక్షిణ్యా
దథవా సద్వస్తు పురుష బహుమానాత్
శృణుత మనోభి రవహితైః
క్రియా మిమాం కాళిదాసస్య.

అట్లే శాకుంతలమునను—

సూత్ర—అభిరూప భూయిష్ఠా పరిష దియమ్. అద్య ఖలు కాళిదాసగ్రథిత వస్తునా అభిజ్ఞాన శాకున్తల నామ నాటకే ఉపస్థాతవ్యమ్ అస్మాభిః. తత్ప్రతి పాత్ర మాధీయతాం యత్నః.

నటి— సువిహిత ప్రయోగ తయా ఆర్యస్య న కిమపి పరిహీయతే.

భవభూతియు పదవాక్య ప్రమాణ పారీణుఁడు' వశ్యవాక్కు అన్నాఁడు.

'య ప్రౌఢత్వ ముదారతా చ
వచసాం య చ్చార్థతో గౌరవమ్
తచ్చే దస్తి, త దేవ గమకం
పాణ్డిత్య వైదగ్ధ్యయోః' అని.

దీని నెల్ల సమాహరించి నిజవ్యాఖ్యానముగా శ్రీహర్షుఁడు తన మూఁడు నాటకములందు ప్రరోచ నాంగముగా ఈ యొక్క శ్లోకమునే చెప్పినాడు.

శ్రీహర్షో నిపుణః కవిః, పరిష
ద ప్యేషా గుణగ్రాహిణీ,
లోకే హారి చ వత్సరాజ చరితం,
నాట్యే చ దక్షా వయమ్.
వస్త్వేకైక మ పీహ వాఞ్ఛిత
ఫలప్రాప్తేః పదం, కిం పునర్
మద్భాగ్యోప చయా దయం
సముదితః సర్వో గుణానాం గణః.

నాటక నట తత్ప్రయోగ పరిశీలనమున మూఁటను అట్లు సవిస్తృతముగా చెప్పిన ఈ శ్లోక మందు ఒక క్రమము వివక్షితమని తలంపఁ దగును. కాళిదాసును మూఁటను మొదట తన్నుంగూర్చియే పలికినాఁడు. 'నాటకాన్తం హి సాహిత్యమ్.' అనియు, 'కావ్యేషు నాటకం రమ్యం'అనియు, సన్దర్భేషు దశ రూపకం శ్రేయః అనియు నిట్లి పొగడ్తగన్న కావ్య విశేషమగు నాటకము రచించుటకు కవికి అసాధారణ ప్రతిభ కావలయును. పావుగంటయో అరగంటయో పట్టుపాటి యొక రసవత్సన్నివేశమును గూర్చి దానిని నాణెమగు భాషితములతో నిర్వహించుట కరము కష్టము. ఆతీఱున ఒక నాటకమును రచియింప వలయు నన్న అది యెంత పని! కావుననే హర్షుఁడు కవిని 'నిపుణః' అని విశేషించినాఁడు. ముద్రారాక్షస నాటకము ఒక యద్భుతమైన రచన. దాని కవి నాటక కర్తను ఇట్లు విశేషించినాఁడు.

కావ్యోపక్షేప మాదౌ తను మపి
రచయన్, తస్య విస్తార మిచ్ఛన్
బీజానాం గర్భితానాం ఫల
మతి గహనం గూఢ ముద్భేద యం శ్చ
కుర్వాణ బుద్ధ్యా విమర్శం ప్రసృత
మపి పునః సంహరణ్ కార్య జాతం
కర్తా వా నాటకానా మిమ మనుభవతి
క్లేశ మస్మద్విధో వా.

కావున ఇందు తొలి యక్కఱ కవి ప్రతిభయను పరుసవేది. దాన బంగారమై పోయిన దానికి ఇకను దానికి తఱివెనయు మెఱుఁగును రత్నఘటితతయు పరిషదితి వృత్తనటన మేలుముల వలన ఉత్తమాభరణత్వము సేకుఱును.

కాళిదాసు ప్రేక్షకులను ఆర్యమిశ్రులు అనును, అభిరూపులు అనును, విద్వాంసులు అనును. అట్లే భవభూతియు. నిపుణ హర్షుని నాటకముల ప్రేక్షకులు తదీయ సామంతరాజులు ఇదంతయు ప్రరోచనాంగముగా చెప్పఁబడినదైనను అందు తద్గుణగ్రాహితా సహృదయతాది లెస్సగా సూచింపఁబడినదని యెంచఁదగును. ఇఁక వారు గ్రహించిన కథలు అతిమనోహరములు. తరువాత నటుల ప్రస్తావము. వారు శాకుంతలమున 'సువిహిత ప్రయోగులు.' వారు కాళిదాసునకు మిత్రులు కాఁబోలు. భవభూతినటులును భవభూతికి ఎంతయు సుహృత్తులు. ఆ కవులు సొంతముగా వారి యొద్దికలనుంగూడ (rehearsals) చూచియుందు రేమో. హర్షుని నటులు నాట్యమున 'దక్షులు.' మఱి వారి నేర్పున కొదువ యుండునా?

అయినను నటుఁడనఁగా ఏ పాటి? వారు సొంతమును శిక్షితమునైన అభినయ నైపుణి కలిగియుండ వలసినదే. కాళిదాస భవభూతులకు తమ నాటకము లాడు నటులయందు ఎంతేని కూరిమి. వారు వానిని ఎంతో చక్కఁగా ప్రయోగించినవారే. అయినను ఆచార్యు లెల్ల 'నటునికి రసానుభవము లేదు, కేవలము అభినయము మాత్రమే. ఒకవేళ వ్యుత్పత్తి రసానుభూతులు కలిగిన ఆ నటుఁడు ఆ పాటి సహృదయుఁడగును. సహృదయత వేఱు నటత వేఱు.?' అని అన్నారు. అది యెక్కువగాఁ గలిగిన వైమఱచి తనకు నేర్పిన, తాను నేర్చిన యభినయమున పొరపాటునుం జేయు నేమో. నటులయందు స్వభావము చేతనే తారతమ్యములుండును. అర్హతా భేదము లుండును.

'పాత్ర విశేషే న్యస్తం గుణాన్తరం
వ్రజతి శిల్ప మాధాతుః
జలమివ సముద్ర శుక్తౌ
ముక్తా ఫలతాం పయోదస్య.'

అనియు,

'యద్య ద్భావిక ముపదిశ్యతే మయా తస్యై
తత్తద్విశేష కరణాత్ ప్రత్యుపదిశ తీవ మే బాలా.'

అనియు అన్నాఁడు కాళిదాసు. కవి నటుఁడు నగుట నాటక సంవిధాన కల్పనలో మెఱుఁగునకు కారణమని కొందఱనుట చాల పొరపాటు. సంవిధానము కేవలము కవి ప్రతిభకు గోచరము. రామరాజపతన సారంగధరాదులలో నటులు సంవిధానమును దిద్దుటకును భాషి తము లల్లుటకును పూనుకొనుట అనధికారి కార్యము. అట్లు వారిచే దిద్దువడు కవులు వారేపాటి? అయా నటులు తమ ప్రాధాన్యమును ఆ యాటలలో కవి కూర్చిన యంగాంగముల యానుపూర్వ్యమును చెఱిచి స్థాపించుకొను ప్రయత్నమగును. శాకుంతల మాలతీ తాపస వత్స రాజాది నాటకములలో కవులు ఆ నాయకుల చిత్తమున ఉడికించి వెరవించిన భావముల పెల్లును చిలుకుడు కడలి పెనుకొండములం బోలిన వానిని ఎంతటి నటుఁడును పూర్ణముగా అభినయముచే ఒప్పింప నేరండని రసిక విమర్శక నిపుణుఁడు చార్ల్స లాంబ్ చెప్పినాఁడు. 'గ్యారెక్కు'గారి కడ నటు వాతని మహాకవి షేక్స్పియరుతో సమీకరించిన పొగడిక వ్రాతనుచూచి ఎంతయు అతృప్తి కోపములు చెందినాఁడు. అన్నాఁడు —

"What connexion that absolute mastery over the heart and soul of man which a great dramatic poet possesses has with those low tricks upon the eye and ear, which a player by observing a few general effects which some common Passion as grief, anger etc Usually has upon the gestures and exterior can so easily compass?" అని.

అది యుండుఁగాక. మఱి యారసికుఁడు నాటక ప్రయోగములఁ జూచు వేదురు ఎంతయుం గలవాఁడే. నటులను మెచ్చ నేర్చిన వాఁడే. మఱి నటుని కవితో, మహానటునే తాను సాక్షాద్దేవుఁడే యగునని యారాధించు మహాకవి షేక్స్పియరుతో పోటి చేసినందులకు కినిసినాఁడు, అంతే. ఆంధ్రమున గ్రాహ్యవాగ్రగణియైన కృష్ణాపత్రికాధిపతి నిజ సంపాదకీయ వ్యాసమున సర్కారులం బ్రసిద్ధిగన్న అది నట శిఖామణి ఈమని లక్ష్మణస్వామిని తలంపించి మఱపించి మించి పఠాన్ రుస్తుం నటన పోటీలో అగ్రబహుమానముం బొందెనన్న మాటం బురస్కరించుకొని 'రంగోద్ధారక' బిరుదమును ఒడిచికొన్నవాఁడు నెల్లూరి నాగరాజరావు. అతడు 1927 ఆగస్టులో నెల్లూర ప్రతాపరుద్రీయమున యుగంధరవేసము నాడెను. నాఁటి ప్రతాపునింగూర్చి 'రాజు పనికిరాఁడు; లావణికమునకు వలయునవి ఏవియు వేషభాషాచేష్టాగుణములు సొంతము లేని ఎరవులేని ఇంచుకయు లేవు' అని సొడు విమర్శింపఁబడెను. అట్లే ఆ సంవత్సరమే అక్టోబరునెలలో తెనాలివారు గోవిందరాజుల సుబ్బారావు బృందము నెల్లూరఁ బ్రతాపరుద్రీయముం బ్రయోగించిరి. ఆ యాటలోని రాజుంగూర్చియు 'రాజు మొగాన తెలివి యగపడలేదు. నిద్రింపను మేల్కనను నివ్వెఱపడను తెలియను సిపాయీల నదలింపను వశీకరింపను ఆ ధీరుని యుదాత్తతకు అనుగుణముగా మఱి యేమి చేయనుం జాలఁడుగదా...'నమస్కరించుటకైన చేతులు లేవ'ని నోటం జెప్పుకునే చేతులతో ఎగిరియెగిరి నమస్కరించుట విడువఁడాయెనే' అని విమర్శింపబడెను. రా జగపడు ప్రధాన 'రంగము' కొన్ని నిమిషములది ఆ నాటకమున ఇది యొక్కటే. మఱి ప్రతాపుఁడు ఇట్లు దేబెవడి కొఱగాకపోయిన తరువాత ఆతనికై ఆ యుగంధరుని స్వాగతము. 'నేను లేనప్పుడు గదా పట్టినాఁడు. నేను ఎట్లు లేకపోదునో చూచునుఁ గాక. నా రాజును వీఁడా హరించువాఁడు! 'పితాళ బందుఁగానీ' అను పలుకులందును ప్రతిజ్ఞాదికమందును భావంపు ముప్పిరి భక్తి ప్రేమలవలని భాష్పము శత్రువంచనకైన కోపము, తత్ప్రతీకారావష్టంభము చక్కఁగా అభినీతమగునేనియు, రాజు నాయ నర్హతచే ఆ కొఱగాని వానికోసమా ఈ మంత్రియు ఇతఁడు ఇంత సేయుటయును అని అంగి యంగముల యననురూపత చేత ఎంత వైరస్యము చిత్తమునకుం దోఁచును? ఆ యైదు నిమిషాల తన ప్రతాపరుద్రతచే తనడాలు ముందు వెనుకలకు పది యంకములకుం బర్వించి యుగంధరు నేర్పు నెదురు సూచునట్లు చేయగలవాఁడు శ్రీ వేంకటరాయశాస్త్రుల వారిశిష్యుఁడు నెల్లూరి కందాడ దొరసామి బి. ఏ. ఒక్కఁడే. పేరాయ వేసానను, అంతకన్నను పెట్టి వేసానను నటుని శిల్ప ప్రతిభకు అనంతమైన యవకాశము గలదు. కాని నిష్ప్రతిభుఁడును ఆ చాఁకి కూతలను వెట్టికూతలను గుడ్డిపాఠముగా వల్లించి రంగాన గడగడ దొరలించినను ఒకపాటి వెలితిలేని రసము పుట్టనే పుట్టును. అదే 'శ్రీ హర్షో నిపుణః కవిః' అను దానియందలి రహస్యము. మఱి యుగంధర నాగ

రాజరావు 'ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్—మూడే నెల్లాకు పటుకపోతాన్' అనుచు ప్రవేశించి ఒకనాటి సాయంకాలము మొదలుకొని నిశీథము వఱకును జరిగిన కథ మాత్రమే 'ఏకరంగము' అభినీతమగు చుండఁగా, ఆ రాత్రి వంతుకై గస్తువచ్చిన సిపాయీలు 'సిడ్కీ యిప్పట్కీ ఖానా నహి. మనం యేస్తొ రెండూ తూర్లు తిన్నాం. మూడో తూర్కీ షోకలి వుంది.' అని యను చుండఁగానే, 'రోజ్‌రోజ్‌కా తప్తాగు లేని' యూ వెత్తివాఁడు 'మూడే నెల్లాకు' అన్న కుక్కను అర్చుకొనకయే 'రెండే నెల్లాకు' అనియు, అదియు ఆఱకుండఁగానే 'ఒకే నెలాకు' అనియు, అంతట అట్లే 'మూడే 'రోజుల్కు' అనియు మార్చి మార్చి పాడుట ఆ! ఆ! అదేమి స్వాతంత్ర్యము!...నట మాత్రులు ఎందులకు మహత్కృతులను ఇట్లు దూషించుట! ఆ నాఁడు ఆ గోవింద రాజుల సుబ్బారావును ఈ గొప్పతప్పును— తాను స్వతంత్రముగా వ్రమసిన ఈ చమత్కారమును ఎగిరి యెగిరి పలికినవాఁడే. ఆటలోలేని 'ఆరే నెల్లాకు'ను కూడ చేర్చినాఁడే! ఉష నాటకములలో మందాకినీ ప్రాసాదమున క్రొత్తదంపతుల యేకాంత గోష్ఠిలో అనిరుద్ధవేషమున వారసామయ్యంగారు ఉష 'బుగ్గలప్పై ముద్దులిడ బీఁకఁగా, శ్రీ వేదము శాస్త్రుల వారు ఆ లజ్జాకరాశ్లీలమునకు కరము కుపితులైరి. ఒక్కముద్దును కాళిదాసు శాకుంతలమున ఎంత నేర్పుగా చెప్పించినాఁడు! మహత్కృతులందు ఇట్టి నిపుణం మన్ననట చాపలము, స్వాతంత్ర్యము ఎవనికిని గూడదు.

షేక్స్పియరు మహాకవి ఆ కాలమున తాను నటుఁడుగాను ప్రసిద్ధి గన్నవాఁడట. అట్లని నాయక పాత్రము గ్రహించినవాఁడుగాఁడు. తన యాకారానియవస్థకు అనుగుణముగా ఎందేని ఏదేని వేసము గొనును. హామ్లెట్ అను నాటకమున 'ప్రేత (=Ghost)'—హామ్లెటు నాయన—వేషము వేసెనఁట. 'అజాయు లైకిట్‌లో' ఒక శిథిలావయములతో వణకుచు ఊఁగులాడుచు ముందు ముసలివాని వేషమువేసి చాలం బోడుగు గడ్డముతోడి తన్ను మఱి యిరువురి ప్రావున వలసిన చోటికి మోయించుకొనెనఁట. హామ్లెటు నాటకమున అతఁడు నటులకుఁ జేసిన నటన రహస్యముల యుపదేశము ప్రసిద్ధము. ఇవి కూడును ఇవి కూడవు అని వాగంగాభినయ ప్రకారముల దిద్దుపాట్లు చక్కఁగా బోధించెను. ఆ మహాసీయుఁడు ఆ ప్రతిభయు గల వాఁడు. అతని నటన నైపుణి తరువాత కొన్ని శతాబ్దులవఱకు నటనాటక ప్రపంచమున స్మరింపఁబడు చుండెనఁట.

నట్టువులలో పుట్టువుచేతనే శక్తిభేదము ప్రకృతి భేదము, ఉత్తమ మధ్యమాధమ పరిగణనమునకుం గారణమైనది, కలదు. నటన ఒజ్జనమున అలవడుటయు మెఱుఁగెక్కుటయు కలిగి యున్నను పుట్టువు వలని ప్రతిభయు అర్హతయు అంతటికి మూలమున నుండిన ఆ నటుని నటన మఱియు మెఱుఁగెక్కును.

### ఒక దుష్యంతుడు - సరస్వతి రంగస్వామి

(నెల్లూరు—1926—ఫిబ్రవరి—2)

ఆహా తలఁచుకొన్న వ్రైమఱపు గలుగుచున్నది. ఆ వేఁట యురవడింపు ఆయాశ్రమ ప్రవేశపు వినయము, శుద్ధాంత దుర్లభ వపుర్దర్శన విస్మృతి, ఆ ముని కన్నెలతోడి గోష్ఠి కౌశలము, మనఃసంగాది భావముల దండితనము, తన గజ సైనికుల వృత్తాంతమునకైన చిరాకును ఎచ్చరికయు, నాయికాగత చిత్తతచే చోటు గదలం గాళ్ళాడని తమకమును వెగటును ఒక్కటొక్కటియు అనన్య దృశముగ ఎట్లు చూపించితివయ్యా! 'నే నెఱుఁగన్ విరించి యొకనిన్...' అనునప్పటి తన్మయగునా అను పేరాసను కన్నుల నెట్లలము కొంటివి! నాయికను కలసికొన్న విరిపానుపు సంభోగ శృంగారమును, ఆషాఢీ రుస్తుముల వీథి జట్కాహాలా గ్రామ్యత సోఁకనీక, పున్నెంబుగా ఎట్లు పోషించితివి! నాయికను అవ్వ తోడ్కొని పోయినప్పటి నైరాశ్యము తోడి నీ చింత, ఉత్తరీయపు జాఱుపాటుతోడి ముఖ భావ పౌష్కల్యముచే రవివర్మ చిత్రగతముం బోనిదానిచే చూపఱ

చిత్తమును విటువలె నాచి కొంటివి! 'మంచిరాపుఁ గాంచి' మొదలయిన కలుగనున్న నాయికా సమాగమము వలని వ్యాకులపాటును సమర్థించి భావప్రకటన నైపుణికి అవకాశము గల్పించి అందఱిని తయ్యారు చేయునది ఎంత చక్కఁగా నిర్వాహము గన్నది. ఆ నిరాకరణ సమయమందలి నీ చిత్తంపు దోదూయమానత మొగాన అట్లు తాండవించి నట్టిది ఇతరులకు అనుకరింప నగునా? తరువాతి యాపశ్చాత్తాప ఖేదమున నీతోడ ద్రష్టలును పోలినవారే! 'కోరికను నే వదలితిన్' అను దానిం బాడుచు అభినయించుచు అట్లు ఆస అస్రము డగ్గుత్తికలతో ఇదె యెదురనే యున్నావే! ఆ సచలమ్మైన నీ చేష్టితమును భావమును అచలమ్మైన బొమ్మలో రవివర్మయు వ్రాయనేరఁడు పో!

ఆ జింకమీఁది పద్యమును, పూలకోఁతయు చివురు గిల్లులును ఆనవాలుగా నాయికను వెదకుచుం బోయిన యా పద్యములు, 'అశ్రమంబు శాంతము' 'ఎఱుఁగుదును తపోవీర్యంబు' అనునవియు, 'ఎడపక యొందు రెండడఁగులే' అని నాయిక భావములం గనిపట్టిన పద్యము, 'కులమును మలినము సేయన్' అను చిరాకు పద్యమును 'నాకు బుద్ధి మఱపో' అను దోదూయ మానచిత్తత పద్యమును — ఇంకను ఎన్నింటిని లెక్కింతును! ఇంకను నా చెవులలో వినంబడుచునే యున్నవి. అహో ఏమి శయ్య ఏమి గమనము. ఎక్కడి కాకువు ఎట్టి భావస్ఫూర్తి! పుష్ప వనమయ్యెను పాటకచ్చేరియే సంజీవరావు ప్లాటు కచ్చేరియే!



# చావంటే భయమెందుకు?

## శ్రీ వసంతరావు వేంకటరావు

చావంటే భయమెందుకు?
చావంటే రూపు మార్పు!
పుట్టి పెరిగి పారి పారి
ముదిమికి భయ మొందినట్టి
ముసలి యేరు వాపోయెను:

''నా బ్రతుకిక ముగియవచ్చె,
నా అంతం సమీపించె.
కొండలలో, చరియలలో
దుందుడుకుగ గంతి నట్టి
మైళ్ళు మైళ్ళు పారినట్టి
మైమరచిన జీవితమ్ము
మరణ ముఖం బొచున్నది.''

ఏరు కార్చుచుండిన క
న్నీరు సాగరమున జొచ్చె
నిలకడ లేనట్టి యేరు
నిరతము ప్రవహించు చుండు.

మునిగి నప్పుడున్న నీరు
మునిగి లేవ కదిలిపోవు.
సతతము ప్రవహించు యేరు
శాశ్వతమను నమ్మికతో
పుట్టి పారునదికి పేరు
పెట్టి పిలుచు కొందుము కద!

*　　*　　*

నరుని జీవ శరీరాలు
నది వంటివె చూడ చూడ.
అవిచ్ఛిన్న పరివర్తన
మనకు వాటి సహజధర్మ,
మొక క్షణమున నున్నట్లు మ
రొక్క క్షణము నం దుండవు.
అయినా శాశ్వత మనుకొని
ఆదరించి పేరిస్తాం.

*　　*　　*

నది సముద్రమందు కలిసె
నది జీవిత మంతరించె.
నీరు నీటిలో కలియగ
పేరొకటే మాసిపోయె;
ఏటి నీటి చుక్కలలో
ఎట్టిమార్పు కలుగ దాయె.
వ్యష్టిగా భ్రమించిన నది
వ్యక్తిత్వము రూపుమాసె.
సాగరమే నది మూలం,
సాగరాన్ని నది చేరెను.
నది సాగరమున కలియగ
నది పే రొక్కటె పోయెను.

*　　*　　*

శతసహస్ర కరుడు దయా
సాగరుండు సాగర జల
ముద్ధరింప రూపుమారి
లాఘవమై మేఘాలై
రయమున దరువెక్కి మరల
వర్షముగా నవతరించి
నది రూపం దాల్చి మైళ్ళు
చెదరక ప్రవహించి, తుదకు
మూలమైన సాగర క
ల్లోల మునం జేరిపోవు.

చావంటే భయమెందుకు?
చావంటే రూపు మార్పు!

# కొబ్బరిచెట్టు కూలిపోయింది

"ఊర్వశి"

రావి చెట్టు క్రింద అలజడి రేగింది. మూట ముల్లెతో వేచిఉన్న కామయ్యసెట్టి కుటుంబం ఆత్రంగా రోడ్డుమీదికి చూచింది. వాళ్ళ అలజడికి కొద్దిగ వెనుకగా వచ్చేచేరింది. సన్నాయి నొక్కులు.

చెట్టుక్రింది టీ దుఖాణంలో బల్లమీద నిద్రపోతున్న గన్నిగాడు ఉలుక్కుపడి బస్సువైపు పరుగెత్తాడు.

టీ గ్లాసులో పంచదార కలుపుతూ బస్సుకేసి ఆత్రంగా చూచింది రత్తాలు. వీరయ్య బస్సు దిగలేదు.

'ఇయ్యాళ కూడ నాయిన రానేదు.' నిట్టూర్చి జారిపోయే ఆమె పైటవేపు చూచే గన్నిగాడి చూపులకు చీదరించుకుంటూ. వాడికి టీ గ్లాసు నందించి వాకిలివైపు పరుగెత్తింది రత్తాలు. బస్సు కదల బోతూంటే చూరు పట్టుకుని వంగి కదిలే బస్సువైపు చూచింది రత్తాలు. రత్తాలునుచూచి కదిలే బస్సులో నుండి కండక్టరు 'మీ అయ్య పట్నంలో కనిపించాడు .. రేపొద్దు ఒస్తాన్నాడు......రైట్' అంటూ రత్తాలుకి వార్తను విసిరి డ్రైవరుకి ఆజ్ఞను జారీ చేశాడు. సన్నాయి నొక్కులు ముందుకు కదిలింది.

సెట్టికుటుంబం బస్సు ఎక్కడంతో రావి చెట్టుక్రింద చపటా చిన్నబోయింది. చూరు పట్టుకుని వంగి నిల్చున్న రత్తాలు శరీర లావణ్యాన్ని తనివితీర అవలోకిస్తున్న గన్నిగాడు రత్తాలు గల్లాపెట్టె దగ్గరకు రావటంలో సర్దుకొని పదిపైసల నాణెంను చేతికందించాలని తాపత్రయపడి అందించలేక బల్ల మీదుంచి బండి దగ్గరకు పరుగెత్తాడు. ఖాళీబండి ఊళ్ళోకి కదిలిపోయింది.

రావిచెటు కొమ్మలు ఎందుకో ఊగుతున్నాయి. ఆకులు రెపరెపలాడుతున్నాయి. దూరా నున్న కొండల మీద మేఘాలు గుంపులు గుంపులుగా కదిలి వస్తున్నాయి. ఆకాశమంతా బూడిద రంగులో ఉంది. అయిదు గంటలవేళ అయినప్పటికి చీకటి త్వరగా ముసురుకో సాగింది. ఈశాన్యంనుండి వీచే గాలులకు రావి చెట్టుతోపాటు రోడ్డుకు అటు యిటు ఉన్న చెట్లు అదో మాదిరిగా ఊగుతున్నాయి.'

ప్రతీరోజు వీచే మాదిరిగా లేదు గాలి. అదో తరహాగా ఉంది. వీచినప్పుడల్లా గుక్కపెట్టి ఏడుస్తోంది. అంతలోనే జోకొట్టబడినట్టు ఊరుకుంటోంది. గాలివీస్తాంటే వెదురు చువ్వల్ని గాలితో ఆడిస్తే వచ్చేధ్వని గుర్తుకొస్తున్నది. అప్పుడప్పుడు.

సన్నగ వానపడ సాగింది.

హోటలు ముందు చెట్లాకులు రెమ్మలు పడ సాగినయి.

గాలి వీచినప్పుడల్లా చిరుచలి ఒంటిని వణికిస్తోంది. వానచినుకులు అంతలోనే ఆగిపోయాయి. గాలి నోరు మూసికుంది. వెనువెంటనే పెద్దపెద్ద వర్షపు చినుకులతో గాలి ఏడ్పు ప్రారంభించింది.

రత్తాలుకి వాతావరణం అర్థం కాకుండ ఉంది. హోటలుముందు సైకిలు ఆగటంతో వంగి రోడ్డుమీదకు చూస్తున్న రత్తాలు దారి తొలగి లోపలికి వచ్చింది. గన్నిగాడు కూని రాగం తీస్తూ రావి చెట్టుక్రింద గ్లాసులు కడగటంలో నిమగ్నుడయ్యాడు.

కండువాతో ముఖం తుడుచుకుంటూ పొడవైన శరీరాన్నివంచి లోపలికి అడుగుపెడుతూ 'ఈరయ్యా!' అంటూ కేకేశాడు మంగయ్య.

'బాబుగారూ! టీ సెయ్యమంటారా?' అడిగిం రత్తాలు రాయ్యి ముందు నిల్చుని.

'ఆ! ఆ! సెయ్యి! సెయ్యి! మీ నాయిన లేడా! ఇయ్యాళ నీ ఉన్నవు?' అడిగాడు మంగయ్య.

'పట్నం ఎల్లినాడు బాబూ! ఇంకా రానేదు'

సమాధాన మిచ్చింది రత్తాలు టీ డికాక్షన్ గ్లాసులో పోసి మరుగుతున్న పాలవైపు చూస్తూ.

'దసరా పండక్కొచ్చి అమావాశ్యదాక ఈడనే ఉన్నట్టున్నవు? మీవోడు మళ్ళా దెబ్బలాట దీసి నడా? ఏంటికత?'

'ఏదో లే అయ్యా! ఇదిగో టీయా' అందించింది రత్తాలు.

సముద్రంలో తుపాను రేగిందట. నీ కెరికా? ఈయాళ మనేపు గూడ వస్తదంట. ఆ గాలి ఇన్నవు కదూ! అని తుపాను గాలే. అయితే నంటి కుఱ్ఱాడితో ఈ అడవిలో రేత్రి ఉంటవా?...ఎందుకూ? మా ఇంటికి పోరా! మాయమ్మంది. రేత్రి అయినాక పొలొత్తువు గాని ఈ రేత్రి మరి మీ నాయ నేటి వస్తడు.'

రత్తాలుకు తెలుసు తనమీద అతని కెందు కంత అభిమాన మో.

'ఎందుకులే బాబూ! అయ్య రేత్రి ఒస్తడు కద! అయ్యకు కూడెట్టాల్న.'

'ఏటో నీ బెమ...అసలు మీ అయ్యకు బుద్ధి లేదే! కాపోతే పైసలొస్తయని ఊరికి మైలు దూరాన్న ఒ పేలెడ్తడా? పోనీ ఈడ మర్నాలుగ్గడిసె లుండయూ అంటే అయ్యా లేవు. బస్సుల్దార్న ఉంది. పైసలొస్తయి. అదీ ఆశ' అగాడు మంగయ్య. రత్తాలు ఏం మాటాడక పోవటంచూచి టీ గ్లాసు నందుకున్నాడు. హోటలుకు వెనుక గదిలో ఉయ్యాల్లో పిల్లాడేచ్చాడు. చీరచెంగుతో ముఖం తుడుచుకుంటు గదిలోకి పరుగెత్తింది రత్తాలు.

మంగయ్య ఊదుకుంటునే వేడి టీ తాగ సాగాడు.

వర్షం పడసాగింది. గాలి వీస్తోంది తీవ్రంగా. చలిగాలి మంగయ్య చుట్టూ పరిభ్రమించింది.

ఉయ్యాల్లోంచి పిల్లాడిని తీసికుని వాడి ఏడుపు నర్షం చేసికుని రవికముడి విప్పి, వాకిలివైపు వీపునుంచి అప్టాల్లో వేసికుని రొమ్మునందించింది రత్తాలు. మంగయ్యకు రత్తాలువీపు, వీపుమీద వెన్నపూసవెంటూ అందంగా ఏర్పడ్డ గాడీ, సిగనుండి జారే కేశాలు తప్ప మరేం కనిపించలేదు. మంగయ్య కొద్దిసేపు టీ సంగతి మరచిపోయాడు. రత్తాలు పిల్లాడిని కుడివైపునుండి ఎడమవైపునకు తిప్పు కుంది. మంగయ్య గబగబా టీ త్రాగి లేచిపోయాడు.

'రత్తాలు డబ్బులు!'

'గన్నిగాడు లేడా బాబూ!...ఆ బల్లమీదెట్టిపో బాబూ!' వెనుతిరిగి చూడకుండ అంది రత్తాలు.

కొద్దిసేపు అక్కడే తచ్చాడి డబ్బులు బల్ల మీదపెట్టి వెళ్ళిపోయాడు మంగయ్య.

'సచ్చినోడు' మెటికలు విరిచింది రత్తాలు.

పిల్లాడు తల్లి రొమ్ము వదిలేశాడు.

వాడి ముఖాన్న నిద్ర వదలి పోలేదు. పిల్లాడిని ఉయ్యాల్లో వడేసి చిరుగుల దుప్పటి ఉయ్యాల చుట్టూ చుట్టింది రత్తాలు.

వర్షం ఎక్కువైంది.

గదిలోంచి హోటలులోకి అడుగు పెట్టబోతూ పైట తొలగించుకుని రవిక ముడివేసికుంటూ ఎవరో బల్లమీద కూర్చుని ఉన్నట్టు తోచి తల ఎత్తి చూచింది. బల్లమీద అతను కూర్చుని ఉన్నాడు, ఆమె ముఖంవైపే చూస్తున్నట్టు తోచింది రత్తాలుకి. నిజానికి అతనేదో అడిగే ప్రయత్నంలో ఉన్నాడు. బాగనే తడిశాడు. తలమీదనుండి ముఖంమీదకు వర్షం చినుకులు జారుతున్నాయి. రత్తాలును చూచి నిల్చున్నాడు. చేతిలో చేతిసంచీ ఉంది. మనిషి పంచ లాల్చీలో ఉన్నాడు. పల్చటి మనిషి. వయసు ముప్ఫయి దాటదు. ముఖంమీద జుట్టు పడుతోంది.

రత్తాలు ఒకడుగు వెనక్కువేసి ప్రక్కకు తిరిగి పైట సర్దుకుని గుమ్మం దాటింది.

'నగరం పోయే బస్సు......'

'వస్తాది బాబూ! ఈయాళప్పుడు రోడ్డు రోలరు రావాల. వచ్చేయేళకూడ అయింది. కూకోండి. టీ కలపనా?'

'రోడ్డు రోలరా?'

'అదే బాబూ! బస్సు పేరు. అదంత లావిగ ఎళ్తాది. దీని ఎనకే వస్తాది తుఫాను మెయిలు. అదీఢ ఆగనే ఆగదు. 'టీ కలపనా బాబూ!'

వీధివైపు వర్షంలోకి చూస్తూ తలూపా డతను.

చిరుగాలి చలిగాలైంది. రివ్వున వీయసాగింది. ఆకాశం కనపడటంలేదు. వర్షం పెద్దదైంది. గాలి వింతగా ఏడుస్తోంది.

'కాఫీ దొరకదా!' అడిగాడు.

'కాఫీ దొరకదు బాబూ!...టీ బాగనే చేస్తగా. ఒకసారి తాగి సూడండి. మల్లా కావాలంటరు' అంది రత్తాలు.

జాగ్రత్తగ వింటేనే గాని ఆమె మాటలు విన పడటంలేదు. గాలి హోరంటోంది. అతను టీ కావా లన్నాడో లేదో రత్తాలుకు తెలియలేదు. టీ చేయ టంలోమాత్రం నిమగ్నమైంది.

టీ గ్లాసును అతని కందించి హరికెన్‌లాంతరు వెలిగించింది; రత్తాలు హోటలులో చీకటిమూలల్లో దాక్కుంది. టీ గ్లాసు అందుకుని చేతివాచీని చూచు కున్నా డతను. 'టైయూం ఎంతైంది బాబూ?' అడి గింది రత్తాలు. 'ఏడుగంటలవుతోంది' అన్నాడు తల దించుకుని.

'ఏడు దాటినదా? ఇంక బస్సు రానేదియ్యాళ ఇగ రాదు' అంది. తుళుక్కుపడ్డా డతను' బస్సు రాదా?' అడిగాడు.

'డయిరక్టులైను పోయుంటాది బాబూ! దాని కదే రోగం.'

'మరింకేం బస్సులు లేవా?'

'సాయింతరం ఏడు దాటితే బస్సుల్లేవు. ఇయ్యాళ తుపానుమెయిలు కూడ రాలే' అంది. దీపం వెలుగులో అతని ముఖంలో దిగులు కనిపించింది. అతనా ఊరివానిలా గాని, ఆ ప్రాంతంవానిలా గానీ కని పించలే దామెకు. అతనెవరో ఎక్కడినుండి వస్తూ ఎక్కడి వెళ్తున్నాడో తెలిసికోవాలని ఆమెకున్నా అడగ లేకపోయింది.

అతను వీధిలోకే చూస్తున్నాడు. హోటలున్న ముందు సావిడిలోనే లోపలిభాగాన ఒకమూల మట్టి పొయ్యిమీద సిల్వరు గిన్నెలో అన్నం కుతకుత లాడు తోంది. అన్నం వొకసారి కలియపెట్టి పొయ్యిలోకి కట్టెల నెగదోసింది రత్తాలు, సావిడిలో పొగ కొంత తగ్గింది. ఉల్లిపాయల పులుసుకు సరంజామాను తయారుచేస్తున్న రత్తాలుకు మంగయ్య మాటలు గుర్తుకొచ్చాయి. అతనినుండి డబ్బులు పుచ్చుకుంటూ.

'బాబూ! యాడనో తుపాను పెడ్తన్నదంట. మీా కెరికా? మునగ్గాడ వస్తదంట. అసలి కిది తుపానేనంట. మంగయ్య సెప్పినడు. నిజవా బాబూ!' అడిగింది రత్తాలు తుళుక్కుపడ్డా డతను.

ఎవరో ఒక అసామి సైకిలుమీద గాలి తీవ్ర తకు, వర్షానికి లెక్కచేయకండ వర్షంలో తడిసి పోతూ పరుగులు వేయసాగాడు.

'తుఫానా?' అన్నాడు దిగులుపడుతూ. అవును ఇది తుఫానే అన్నట్టు గాలిహోరంది. వర్షపు జల్లు గాలిలో సుడులు తిరిగి నేలమీాదపడి ఒక్కసారి గాలిలోకి లేచి పొగలాగున తెల్లగ మెరసి గాలిలో కొంత దూరం ప్రయాణించి పొగమంచులు కరిగిపోయింది. ఆకాశంలో మేఘాలు దట్టంగా ఉన్నాయి. అవి ఏ రంగులో ఉన్నవీ తెలియటం లేదు. అవి కదలటం లేదు. కదలకండ కురుస్తున్నట్టున్నాయి. అతనేదో గొణుగుకున్నాడు. రత్తాలుకు వినిపించలేదు.

'ఇక్కడనుండి ఊరెంతదూరం?' నిశ్శబ్దాన్ని చీల్చుకుంటు అడిగాడు'

'మైలుదూరముంటుంది బాబూ!'

'ఊరిలో హోటలుందా?' అడిగాడు. ఉంది అన్నట్టు తలూపింది రత్తాలు. 'ఈ వర్షంలో వెళ్తే తడిసిపోతానుకదూ?' తనలో తాను మాటాడినట్టడి గాడు.

మంటనెగదోస్తున్న రత్తాలు అతనివైపు చూచింది. కాని ఏమనలేదు. అతను వాకిలివరకు వెళ్ళాడు సంచీచేతపట్టుకుని బయటకు అడుగు వేయ బోయి వెనుకకు అడుగు వేశాడు. మరి ముందుకు వెళ్ళే సాహసం లేక తన జాగాలో కూర్చుండి పోయాడు. రత్తాలువైపు చూశాడు ఏదో చెప్పాలని. కాని రత్తాలు అతన్ని చూడలేదు. తన వంట ప్రయత్నంలో తానుంది.

అంతవరకు వర్షంలో రావిచెట్టు మొదట్లో గ్లాసులు కడుగుతున్న, గిన్నెల తోముతున్న గన్నిగాడు

పని ముగించుకుని తడిసి ముద్దయి ఒక చేత్తో గిన్నెల్ని మరొక చేత్తో బకెట్‌ని పట్టుకుని వీధి గుమ్మందగ్గర ఒక ప్రక్కగ ఉంచి చొక్కావిప్పి చక్కగా పిండుకున్నాడు. దగ్గరేఉన్న తుండుగుడ్డను మొలకుచుట్టుకుని లాగుపిండుకుని తల తుడుచుకుని గిన్నెల్ని పొయ్యికి ప్రక్కగా ఉంచాడు. హోటలు సావిడిలోనున్న నాలుగైదు పొడుగైన బల్లల ఒక ప్రక్కగ సర్దాడు. ఉన్న రెండు అలకాటే బిళ్లను ఒక ప్రక్కగ జరిపి పొయ్యి తిన్నెమీదనున్న పాకేజి బీరువాలోకి టీ పొట్లాన్ని పంచదార డబ్బాని చెమిచాలను సర్దాడు. టీ గుడ్డలను కడిగి ఒకమూల ఆరవేసి రత్తాలుకు సమీపాన నిలబడ్డాడు. రత్తాలు వాడికి సిల్వరు గ్లాసులో టీని పోసి అందించింది. వాడు గ్లాస్ ఖాళీచేసి కడిగి ఒక ప్రక్కన పెట్టి

'మరి ఎళ్తానే అక్కయ్యా! మా యమ్మకియ్యాల కూడ జొరమే. రేపిటేలకి తగ్గితే వత్తా. నేకపోతే నేదు. కబురెట్టమాక.' అని సెలవు మంజూరుకు పడేసి వాకిలివైపు కదిలాడు గన్నిగాడు.

రత్తాలు వాడి చేతిలో అర్ధ రూపాయి పెట్టింది. వాడు వర్షంలో ఇంటివైపు పరుగెత్తాడు. వర్షంలో పరిగెత్తే గన్నిగాడిని చూచి నోట మాట లేనివాడయ్యాడు అతను. 'బాబూ!' పిలిచింది రత్తాలు. చూశాడు.

హరికన్‌దీపం హోటలు గదిలో మధ్యగా వ్రేలాడుతోంది. బయటి గాలికి దీపం ఊగుతోంది. ఆ వెలుగుతోపాటు చీకటి వెలుగుల్లో ఉన్న చిత్తరువులా నిలబడిఉంది రత్తాలు.

'యాడనుం డొస్తున్నరు బాబూ! తమ రేడకెల్లాల?' అడిగింది!

'నూటయాభై మైళ్ల దూరంనుండి వస్తున్నాను. ఇక్కడికి పదిమైళ్ల దూరంలో ఉన్న నగరం వెళ్లాలి. ఉదయం నాలుగ్గంటలకు బయలుదేరాను. భోజనం లేదు. విశ్రాంతి లేదు. వృధాగా కాలం గడిచింది. చివరికి చేరవలసిన చోటుకు చేరలేదు. బస్సులు తప్పాను. ఈ గాలివాన ఇలానే రాత్రంత ఉండేటట్టు ఉంది. కాఫీకోసం వచ్చానిక్కడికి. ఇంతసేప్రంటా ననుక్కోలేదు. భోజనంకోసం ఊరిలోకి పోవాలని ఉంది. కాని వెళ్లే సాహసం లేదు. ఈ రాత్రి ఇక్కడ కూర్చోటానికి జాగా యిస్తే చాలు. వర్షం తగ్గగానే వెళ్లిపోతాను' ప్రాధేయపడుతూ అడిగాడు.

'ఈ కూసింత దానికింత పాదేయ పడాలా బాబూ! ఆ బల్లమీన ఈ రేత్రికి ఈడనే తొంగో. నిన్ను కాదన్న దెవురు? నాకూ ఈ రేత్రి తుపాను వర్సంలో ఈడ నుండాల్నంటే బయంగానే ఉంది. నీవు దేవుడిలా వచ్చినవు. మనిసికి మనిసి ఉంటే అదే కదా దైర్యం. కూకో బాబూ! మీరు కాపీ తాగే బాబులు. మాకాడ కాపీ ఉండదు. కాసింత టీ డికాసను ఉంది. టీ తాగుతవా? ఈ పొద్దంతా కూడే నేదు కదా' అంటూ టీ తయారుచేసి అతని అంగీకారానికి వేచిఉండక అతని కిచ్చి అతనికి దగ్గరగా ఉన్న పొట్టిబల్లమీద కూర్చుంది రత్తాలు.

అతను టీ నందుకున్నాడు కృతజ్ఞతలతో

'నీ పేరేంటి?' అడిగింది రత్తాలు సూటిగా.

'సీతాపతి' అన్నాడు

'సీతాపతా! అంటే రాములో రన్నమాట. బాగుంది. మంచి పేరే.'

సీతాపతి రత్తాలు పేరడగలేదు. రత్తాలు చెప్పలేదు. వేడిటీని ఊదుకుంటు తాగటం ప్రారంభించాడు. రత్తాలు చెప్పడం ప్రారంభించింది.

'మా అయ్య ఊరికి గాక అడవికి గాక ఈమద్దెనెట్టినాడు దుకానం. నాలుగు సంవత్సరాలవుద్ది. బేరాలు బాగనే ఉంటయిగాని ఒక్కటే ఇల్లు. అయ్యంటే ఆడికి నేను—నాకు ఆడుతోడు. నేనేకపోతే ఆడికాడే తోడు. ఊర్లో హోటేళ్లు శాన ఉండయి. ఈడ బేరం బాగనే ఉంటది. బస్సుల్దిగినోల్లంతా ఈడనే టీ తాగుతరు. మా అయ్యంటే జనం ఉక్కిరిబిక్కిరి......' సీతాపతి తన మాటలు వింటున్నట్టు తోచలేదు రత్తాలుకి.

'బాబూ! నీ మనసీదున్నట్టు నేదు...ఇంటికాడి కెల్లినాదేం?'

'లేదమ్మా! నీ మాటలు వింటున్న'

'బాబూ! మరైతే నగరం ఉద్యోగం మీద ఎల్తున్నా?'

'ఒక్కడొక మనిషిని కలిసి మాటాడాలి. అందు కని బయలుదేరాను. అంతలో ఈ తుఫాను.'

'మరైతే నీకు పెళ్లయినదా?' 'ఇద్దరు పిల్లలు' సమాధాన మిచ్చాడు. 'మగపిల్లలా?' 'లేదు ఒక ఆడ ఒక మగ'

'నగరంలో మీా ఆడది ఉండదా?' 'లేదు! ఒక పెద్ద మనిషి ఉండాడు' 'ఏ పెద్దమడిసే!' 'ఒక స్నేహి తుడు' 'అంటే చుట వా?' చికాకేసింది సీతాపతికి ఆమె ప్రశ్నలకి. కాని చీకాకును ప్రదర్శించటానికి అవకాశం లేకపోయింది. ఉయ్యాల్లో పిల్లాడు ఏడ్చాడు. వరాన్ని తిట్టుకుంటూ వెళ్లి ఉయ్యాల్లోంచి పిల్ల వానిని వందుకుని గుండె కదుము కుంది. వాడు ఏడుపు మానాడు. రత్తాలుకి కూడ గాలివాన భయాన్ని కలుగ జేస్తోంది. భయాన్ని మరచిపోవటంకోసం ఆమె మౌనంగా ఉండలేక పోతున్నది.

సీతాపతికి కొంత సమీాపంలో కూర్చుని పిల్ల వానిని ఒళ్లో వేసికుని ప్రక్కకు తిరిగి మరల సర్దు కుని కూర్చుంది రత్తాలు. సీతాపతిలోని చీకాకు అక స్మాత్తుగ అదృశ్యమైంది. ఆమె కబుర్లలో తాను పాలు పంచుకున్నాడు. గాలి ఉధృతంగా వీస్తోంది. మాటలు వినపడటంలేదు. సీతాపతి ఆమెకు దగ్గ రగా బల్ల జరుపుకున్నాడు. పిల్లాడిని మార్చుకుంటు సీతాపతివైపు చూచింది రత్తాలు. అతని చూపులు గన్నిగాడి చూపు లనిపించలేదు. స్థిమిత పడింది రత్తాలు ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

రత్తాలు చెప్పడం ప్రారంభించింది.

తన చిన్నతనంలో తల్లి పోతే తండ్రి ఎంత ముద్దుగా పెంచాడో చెప్పింది. తనకు పెళ్లవటం చెప్పింది. తండ్రిని విడిచిపోలేక తను పడిన బాధను చెప్పింది. భర్త వ్యసనం గురించి చెప్పింది. తనను ఎంత ముద్దుగా తిడతాడో చెప్పింది. కొట్టినా తనకు బాధ కలిగించని సంఘటనల చెప్పింది.

పిల్లాడు నిద్ర కొరిగాడు. రత్తాలు పిల్లాడు నిద్రపోయిన విషయాన్నిగాని, తను సీతాపతి ముందు కూర్చున్న పద్ధతినిగాని పరిశీలించుకునే స్థితిలో లేదు. సీతాపతిలోని ఉత్సాహం ఆమెకు బాహ్యప్రపంచాన్ని తెలియ నివ్వలేదు. అంతలో ఇంట్లోకి ప్రవేశించిన పిల్లి ఆమె ఉపన్యాసాన్ని భగ్నపరచగా పిల్లవానిని నేలమీాద పరుండబెట్టి మరుగుతున్న పులుసు దగ్గరకు పరు గెత్తింది రత్తాలు. సీతాపతి పిల్లిని తిట్టుకున్నాడు. గాలి ఉధృతంగా ఉంది. సీతాపతి రెండు చేతులు జోడించి ఇంటి పైకప్పువైపు చూశాడు భయంతో.

బాదంచెట్టు ఆకులను ఏమూాలనుండో వెతికి తెచ్చింది రత్తాలు. మూాడాకులను కలిపి విస్తరిగా కుట్టింది. రెండు విస్తర్లలో అన్నం పులుసు వడ్డించి సీతాపతి వైపు చూచింది. సీతాపతి ఆకలితో దహిం చుకో పోతున్నాడు. పులుసులోని ఉల్లిపాయల వాసనలు అతని నాశికారంధ్రాల కలవరపెట్టాయి.

'ఈ పొద్దల్లా కూడు నేదు కదా! కసింత ఎంగిలి పడతవా? మీాయసుంటి గొప్పోల్ల కూడు కాదులే మాది. కానైతే నాకు పులుసు బాగ సేతన వుద్ది. రా! కూకో' ఆహ్వానించింది రత్తాలు. కాదన లేదు సీతాపతి.

కూర్చున్నాడు సీతాపతి. పులుసుఅన్నం అమృ తోపమానంగా తోచింది అతనికి. ఆకలితోఉన్న సీతా పతికి తన ఆకులో ఉన్నది కొంత వేసి తను కూడ భోజనానికి కూర్చుంది రత్తాలు.

కడుపునిండా భోజనం చేసినతరువాత సీతాపతికి ఉత్సాహం వచ్చింది. తన బల్ల దగ్గరకు చేరాడు. రత్తాలు అంటగిన్నెల మూాలపెట్టి ఆ ప్రదేశాల్ని శుభ్రం చేసింది. సీతాపతి గడియారం చూచు కున్నాడు. తొమ్మిది దాటింది.

నేలమీాద నిద్రపోతున్న పిల్లవానిని ఉయ్యాల్లో వేసి దుప్పటి చుట్టింది రత్తాలు. సీతాపతి నిద్ర పోవటానికి పొయ్యి దగ్గర రెండు బల్లల్ని జోడించి వేసింది. కప్పుకోటానికి నల్లదుప్పటిని అందిసూ

'ఇది గప్పుకో. నేనాదారంకాడ తొంగుంటా—మంచి నీళ్లు ఆ కుండలో ఉన్నాయి. అవుసరం అయితే నేపు. ఈ గాలిని సూస్తే కొంప ఉంటదో కూలుద్దో ఎరి కనే కంఠఉంది—ఈ రేత్రి గడిస్తే సాలు.' అంది చేతులు జోడించి పైకి చూస్తూ.

రత్తాలు పడుక్కునే గదికి నాలుగడుగుల దూరంలో వండుకునే పొయ్యి ఉంది. పొయ్యిలో నిప్పుంది. సీతాపతి ఆ పొయ్యిలో నిప్పును చూస్తూ వేడిమిని అనుభవిస్తూ చేతి సంచీని తలక్రింద నుంచుకొని బట్టల మార్చుకుని నిద్రకు ఉపక్రమించబోతున్నాడు. హరికన్‌లాంతరు బిక్కుబిక్కుమంటు వెలుగుతోంది. రత్తాలు ఇంకా ఇల్లు సర్దుతునే ఉంది.

అంతలో ఛణేలు, ఛణేలుమని ధ్వని వినిపించింది. రత్తాలు కంగారుతో ఉత్తరం దిక్కున ఉన్న తలుపు తెరచుకుని చీకటిలోనికి పరుగెత్తింది. తలుపు తెరవటంవల్ల వర్షపుజల్లు ఇంటిలో కురియసాగింది. రత్తాలు ఎటు పరుగెత్తినదీ అర్థం కాలేదు సీతాపతికి ఆ తలుపువైపు పరుగెత్తాడు. అటువక్క షెడ్‌లా కట్టబడిన ఇంటి ప్రక్కభాగంనుండి టిన్నురేకు గాలికి ఎగిరిపోయింది. మరో రెండు రేకులు గాలిలో గాలికి ఎగురు తున్నాయి. మెరుపుల వెలుగులో ఆ రేకును పట్టుకునే ప్రయత్నంలో కనిపించింది రత్తాలు. మెరుపుల్లో దారి వెతుక్కుంటు ఆమెవైపు పరుగెత్తాడు సీతాపతి.

'నాయిన...రేకును...ఆడ......సెడ్డుకు కట్టి నడు......ఇది పోతే ..ఒటేలు పాడవుద్ది' అంది రొప్పుతూ రత్తాలు.

ఇద్దరూ రేకును ఇంటిలోకి లాక్కొచ్చారు షెడ్డుమీద ఇంకో రేకు జారి పోబోతోంది. మరో క్షణంలో ఎక్కడుంటుందో తెలియదు రేకుపైనుండి జారిపోనీకుండ పైకి తోయాలన్న ప్రయత్నంలో రేకును గుండెకు అదిమిపట్టి వెనుకకు ఒక కాలు ముందు కొక కాలువేసి నిల్చింది. రేకు గుండెను కోసేంతలా బాధిస్తున్నది. అయినా పట్టు వదల్లేదు రత్తాలు. సీతాపతి ఆమె ప్రయత్నాన్ని అర్థం చేసికున్నాడు. బల్లనొకదానిని తెచ్చి దానిపై నిలబడి రేకును పైకి నెట్టాడు. రేకు పైకిపోయింది. కాని సీతాపతి గాలికి ఊగిపోసాగాడు. నేలమీద నిల్చున్న రత్తాలు అతని చుట్టూ చేతులు వేసి బలంగా పట్టుకుంది. 'ఒగ్గేయక...తీగ ఉండయి కట్టేయి' హెచ్చరించింది గాలి ఎందుకో ఊరుకుంది. రేకును బలంగా కమ్మిలకు కట్టేశాడు. ఆయాసపడుతూ 'అయిపోయింది' అన్నాడు సీతాపతి. రత్తాలు పట్టు వదిలింది. సీతాపతి రత్తాలు భుజాన్ని ఆసరాగా చేసికుని జాగ్రత్తగ దిగబోయాడు. ఆమె చీర కుచ్చిళ్లు అడ్డొచ్చాయి. కూలిపోబోయాడు. రత్తాలు ఆపింది. సీతాపతి నిలదొక్కుకున్నాడు. చీకటిలో ప్రక్కకు తిరిగి కుచ్చిళ్లను సర్దుకుంది. సీతాపతి బల్లను పట్టుకుని హోటలు సావిడిలోకి పోయాడు. ఇద్దరు కలిసి తలుపును గట్టిగ కట్టారు. వర్షం జల్లు లోపలికి రా సాహసించలేదు. తలుపు దగ్గరే నిలబడ్డ సీతాపతి తన ఒంటిమీద నున్నవి ఏవి చెమట బిందువులో, ఏవి వర్షపు బిందువులో కనుక్కోలేకపోయాడు. తుడుచుకోటానికి సీతాపతికి తుండుగుడ్డ నిచ్చి అతని కనతిదూరంలో నిలబడి పైటను భుజంమీదనుండి తప్పించి నీళ్లు పిండుకో సాగింది.

తన్ను ఆతడు చూస్తాడన్న భయం ఆమెకు లేదు. రవిక నీళ్లు పిండుకుంది. తలను తుడుచుకుంది చీర నటు యిటు మార్చి నీళ్లు పిండుకుని తల తుడుచుకుంది. సీతాపతి వాడి బట్టల మార్చుకుని తడి బట్టల లొట్టెల పెట్టెమీద ఆరవేశాడు.

రత్తాలు పొయ్యిలో కట్టెలువేసి మంట చేసింది. సీతాపతి తల ఆరబెటు కున్నారు. రత్తాలు అతనికి కొద్దిదూరంలో కూర్చుని జుత్తు ఆరబెట్టుకుంది. సీతాపతికి పొయ్యిని వదల బుద్ధికావటం లేదు. రత్తాలు వెనుక గదిలోకి వెళ్లి ఉతికిన తెల్లచీర కట్టుకుని తలను ఆరటానికి వదిలేసి గుమ్మంముందు నిల్చుంది. ఆమె నుదుటన కుంకుమ, కనుల కాటుక కరిగిపోయి అప్పుడే లేచిన పాపాయి ముఖంలా ఉంది ఆమె ముఖం. జుత్తు విరబోసుకుంది. జుటు తడిగా ఉందింకా.

జుత్తునుండి నీటిబిందువులు సన్నగా జారుతున్నాయి. అప్పు డప్పుడు గాలి లోపలికి తోసుకొస్తుంటే హరికన్ లాంతరు గాలిలో ఊగుతోంది. ఆ కదిలే వెలుగులో మబ్బుల్లోంచి మెరిసే మెరుపులా ఉంది రత్తాలు. ఆమె వీపుమీద సొగసుగా బారుగా వంపులు తిరిగిన కేశములు మెరుపు మెరుపునకు మధ్య మిగిలిన చీకటిలా ఉన్నాయి. వర్షంలో తడవటంచేత ఆమె కళ్లు పగడాలులా ఉన్నాయి. ఆ పగడాల దాచుకున్న ముత్యాల ప్రోవులా ఉంది రత్తాలు. ఆమె కంఠం క్రిందనున్న కుత్తిక గుంటలో ఒంటిగా మిగిలిన నీటిబిందువు అదేదో ప్రత్యేక అలంకారంలా ఉంది. ఆమె మెడ నుండి వక్షంమీదకు జారిన పుస్తెలత్రాడు పాపి కొండల మధ్య ప్రవహించే గౌతమిలా ఉంది. ఆమె తలారపెట్టుకుంటు నిల్చున్న భంగిమ ఎన్నో కళాఖండాలకు, శిల్పాలకు నమూనా. చిత్రకారుడి కళాతపస్సుకి అది తపోఫలం.

పొయ్యిలో నిప్పు నివురుకోవటం చూచి సీతాపతి తన విశ్రాంతి స్థలానికి వెళ్లాడు. రత్తాలు నాలుగు చితుకల వేసి, రెండు కట్టెల పడేసింది. మంట రాజుకుంది. సీతాపతి గుండెలమీదకు దుప్పటిని లాక్కున్నాడు. రత్తాలు చిక్కు విడదీసికుంటూ ద్వారానికి చేరగిలా పడింది.

సీతాపతికి చలి ఎక్కువైంది.

కడుపు నిండుగా ఉందిగాని నిదుర రావటం లేదతనికి. బయట గాలి ఉధృతంగా ఉంది. వర్షపు జల్లులు గాలిలో పయ్యెదల్లా కదులు తున్నాయి. మెరుపు మెరుస్తుంటే ఆ వెలుగుల్లో భూమీ ఆకాశం ఏకమైనట్టు, భూమిని కబళించటానికి ఆకాశం చేతులు చాచినట్టు అనిపిస్తుం దెవరికైనా.

వీధి తలుపు కదిలింది. తలఎత్తి చూచింది రత్తాలు. వీధి తలుపు మళ్లా కదిలింది. గాలికి కదలిన కదలిక కాదు. ఎవరో తలుపు తట్టినట్లు కదిలింది. సీతాపతి కూడ తలుపువైపు చూశాడు.

'ఎవరో తలుపు పోస్తున్నట్టుంది' అన్నాడు.

'మంగయ్యా!—గన్నిగాడా? తాగుబోతు ఎదవలు!' భయపడింది రత్తాలు. తలుపు నెవరో తోశారు మళ్లీ.

పైటచెఅగును బొడ్లో దోపి నెమ్మదిగా వెళ్లి తలుపు తీసింది.

మెరుపుల వెలుగులో లోపలికి అడుగుపెడు తున్న వ్యక్తిని చూచి కెవ్వున కేక వేసింది. జేబు గడ్డంలోంచి వికృతమైన నవ్వు నవ్వాడు నరసిగాడు. లోపలికివచ్చి తలుపు గడియవేసి 'నాయాల.. గోల సెయ్యకే!' అన్నాడు.

'నీవు......నీవు......'

'నాయాలా!......నోరెత్తద్దంటే......దు !...పల్లకో' అన్నాడు రత్తాలు చెయ్యిపట్టుకుని ఉరిమి చూస్తూ. రత్తాలు మాటలు లేనిదైంది.

నరసిగాడి రూపాన్ని చూచిన సీతాపతికి భయం కలిగింది. చిరిగిపోయిన కోటు. సగం కాలూడిన ఫాంటు, అరగిపోయిన బూట్లు. పెరిగిపోయిన జుత్తు, జేబుగడ్డం, ఎఱ్ఱబారిన కళ్లు—మెడలో ఆంజనేయుడి బిళ్ల—ఏదో సినిమాలో పాత్రలాగ కనపడసాగాడు నరసి సీతాపతికి.

వాకిలి దగ్గరగా బల్ల నొకదానిని లాక్కుని కూర్చుని ఆయాసం తీర్చుకుంటూ ముఖం, తల తుడుచు కున్నాడు.

'సిగరెట్ ఉందా' అడిగాడు. 'సార్మినారుంది' భయపడుతూ అంది.

'అందుకోయే!' 'ఆజ్ఞ జారీ చేశాడు. సిగరెట్ పెట్టె అగ్గిపెట్టె అందించింది. సిగరెట్ అందుకొని వెలిగించి విలాసంగా పొగ వదులుతూ' 'బల్లమీదెవురు?' అడిగాడు. 'ఎవులో బాటసారి' అంది రత్తాలు.

'వొర్సంలో సిక్కడి పోయినడా ?......మీ అయ్యేడీ?'

'పట్నమెల్లినాడు ఇంక రానేదు. రేపొద్దొస్తడు.'

'నాయాలా!...వణికి పోతన్నవేమే!......నిన్నేటి

సెయ్యనులే!...కూడుందా?' అడిగాడు. 'నేదు' తల వంచుకుని అంది.

'టీయా?' ఆశగా అడిగాడు. 'ఉ ఊ' అంది రత్తాలు

'మంచీలుండయా? అయ్యావేవా?' కసిగా అడిగాడు. రత్తాలు చెంబు నందించింది చెంబుడునీళ్లు తాగి మూతి తుడుచుకొని సీతాపతివైపు చూస్తూ 'ఆడు తొంగియినాడా?' అడిగాడు

'ఆ! తొంగోని శానసేపయింది' అంది రత్తాలు

స్వేచ్ఛగా ఊపిరి తీశాడు సిగరెట్ దమ్ము లాగి రత్తాలువైపు చూచి 'రత్తాలూ...కూకోయే... రత్తాలూ...ఊరంతా నా గురించి ఏటనుకుంటన్నరే?' నెమ్మదిగా అడిగాడు.

రత్తాలు కూర్చోలేదు. నిలబడే అంది.

'నీవు రవుడీవి. తాగుబోతువి. సెంద్రయ్య బాబు తమ్ముని సంపిన అంతకుడివి నీవు జైల్నుండి పారిపోయినతలినుండి ఊరంతా నీకోసమే గాలిస్తుంది పేపర్ల నీ ముఖమేసినారంట పట్టిచ్చినోడికి అయిదు వందలు బగుమతంట పెత్తేకంగా సెంద్రయ్య బాబు మరో అయిదువంద లిస్తడంట—దరమం, నాయం అక్కర్లేని రౌడీ ముండాకొడుకువి. నీ ముకం సూత్తే పాతకం—బయటికి నడూ—ముంగల' గట్టిగ కేక వేసింది రత్తాలు

అంతవరకూ గంభీరంగా ఉన్న నరిసి కళ్లు, కన్నీళ్లతో నిండిపోయాయి సిగరెట్‌ను నేలమీద పడేసి బూటుతో నలిపి కన్నీళ్ల కోటుతో తుడుచుకుని 'రత్తాలూ! మంగే డుందే?' అడిగాడు.

'నీ నద్దాంతరంగా ఇంతసేస్తే ఆడముండా కూతురేటి సేయగల్దు? కాని సెంద్రయ్యబాబు దేవుడు. తనింటి ఎనక సిన్న ఇల్లు కట్టించి యిచ్చి నడు కూడు బట్ట తానే యిస్తన్నడు' జవాబిచ్చింది రత్తాలు

విరక్తితో నవ్వాడు నరిసి గాడు.

'కూడు, బట్ట యిచ్చినడా? ఇల్లు కట్టి యిచ్చి నడా!...యిస్తడులే యివ్వడా?...రత్తాలూ!...అది... ఆ మంగి యింకా బతికే ఉందంటే?...అవునులే బతికే ఉంటాది...సెంద్రయ్య బతికి లేడూ? ఇద్దరూ... పాపం...ఒకరి కొకరు...బతికే ఉంటారు...నానే సచ్చి పోవాల...కాని బతికి ఉన్నా!......యానకో తెల్సా?... ఆళ్లిద్దరికోసరం...ఇయ్యాళ ఇడ కెందుకొచ్చినవో తెల్సా!...' కోటుజేబులో చెయ్యిపెట్టి వెతికి రుమాలులో చుట్టిన బాకు తీశాడు. 'ఈ రోజుతో సెంద్రయ్య పని సరి...కాని ఈ గాలివాన!...రత్తాలూ! ఏమాత్తరం గాలివాన తగ్గాల...నా సామి రంగా!... ఆడు బతికిపోడు...ఊర్లోకి పోత...ఆడి రక్తం కళ్ల జూస్త!...దాన్ని ముక్కముక్కలు కోసి...కోసి...అడ్డమొచ్చినోళ్ల సంపి పారేత్తాను. రత్తాలూ!...నా పగ తీర్సుకుంటూ......'

రత్తాలు మాటల్లేనిదైంది. నరిసి గొంతు సవరించుకున్నాడు. 'నువెల్లి నిద్రపోయే!...నానీడుంటా!'

'నువ్వు సెడ్డోడివి!...నీ వీడుండొద్దు!...పో!... రౌడీ ముండాకొడకా!' అరిచింది రత్తాలు. నరిసిగాడు రత్తాలు మాటను వినే స్థితిలో లేడు చిరిగినకోటును పిండుకున్నాడు. ఒక ప్రక్కగా ఆరేశాడు. తలను చేతులతో తుడుచుకున్నాడు. చేతుల కుర్చీని మూలనుండి తెచ్చి కూర్చుని బల్లమీదకు కాళ్లు జాపి తీరిగ్గా సిగరెట్ వెలిగించుకుని

'నాయాలా!...నీగ్గాదే సెప్పేది? ఎళ్లితొంగో! పొమ్మన్న పోయే గటం కాదే ఇది. పో!' కసిరాడు. ఏదో ఆలోచించడానికి కళ్లు మూసికుంటూ చిటుకు చిటుకుమంటూ వెనుతిరిగింది రత్తాలు. వెళ్లబోతూ నరిసివైపు చూచింది. వాడింకా ఏదో ఆలోచనలోనే ఉన్నాడు. సీతాపతిని చూచి అతని సమీపానికి వెళ్లింది. సీతాపతి 'విన్నానంతా!' అన్నట్టు సైగ చేశాడు. 'నిదుర రానేదా?' వంగుని నెమ్మదిగా అడిగింది.

'లేదు.. చలి...చలిగాలి కొడుతోంది యిక్కడ...' గొణిగాడు. లోపలికెల్లింది రత్తాలు. గొంగళీ దుప్పటి లాంటిదాని నొకదానిని తెచ్చి కప్పింది. ఆమె చేతుల్లోంచి దుప్పటి నందుకుని సరిగా కప్పుకున్నాడు సీతాపతి.

రత్తాలు గది లోపల ద్వారం దగ్గర చాప పరుచుకుని దానిమీద బొంత పరుచుకుంది. ఉన్న నాలుగు దుప్పట్లకి రెండు సీతాపతి దగ్గర, రెండు పిల్లాడి ఉయ్యాలకి ఉన్నాయి. తనకు మిగిలిందేదీ లేదు. చలి మాత్రం చురకలు పెడుతోంది. తడి జాత్తు వీపుమీద తగిలినప్పుడల్లా సూదులు గుచ్చు కున్నట్టుంది. కప్పుకునేందుకు ఏమీ కనిపించ లేదు. దండెంమీద వేలాడుతున్న చీరముక్కను లోపలి లంగా మీద ఓణీలా వేసికుంది.

నరిసిగాడివైపు చూసింది. ఆ మూలనున్న చీక టిలో వాడు చూస్తున్నదీ లేనిదీ తెలియ లేదు. వాడి చేతిలో సిగరెట్ మాత్రం వెలుగుతోంది. చీరను రెండు పొరలుగా వేసికుంది కప్పుకునేందుకు. నిద్రపోడానికి ఉపక్రమిస్తూ ఆరిపోనున్న హరికన్‌లాంతర్ని చూచింది. అది సీతాపతి తలకు కొంతదూరంలో వ్రేలాడుతోంది. దాని వెలుగు నరిసిగాడికి కొంత చేరినా లాంతరు మాత్రం వాడికి కనపడదు. అడ్డంగా పేకెజీ బీరువా ఉంది.

నరసిగాడు తన్ను గమనించటంలేదని నిర్ధా రించుకుని నాలుగడుగుల్లో దీపం దగ్గరి కెళ్లింది. దీపాన్ని క్రిందికి దింపుతూంటే సీతాపతి తలకు ఆమె నడుము తగిలింది. దీపాన్ని పట్టుకుని అతని వైపు చూచింది. సీతాపతి కదలలేదు. దీపం వత్తిని సరిచేసి కిరసనాయిలు పోసి యథాస్థానం ఉంచి, తగ్గించి తన గదిని చేరింది.

నిద్రపోవాలని మేనువాల్చిన రత్తాలుకి నిద్ర రాలేదు. మెడవరకూ చీరను కప్పుకుంది. వెల్ల కితలా పడుక్కుంటే గుండెలమీద బరువు పెట్టి నట్టు, చేతులు కాళ్ళు తిమ్మిరెక్కినట్టు అనిపించిందామెకు. ప్రక్కకు తిరిగింది కాని దీపం వెలుగు తనమీద పడటంచేత సీతాపతికి తాను కనిపించక పోదు. రెండో ప్రక్కకు తిరిగింది. కాని అటుపడుక్కో బుద్ధి కాలేదు. వెనుకనుండి ఎవరో మీదపడినట్టే భ్రాంతి కలిగింది. సీతాపతి కదిలినట్టయి తలఎత్తి చూచింది.

'ఈ రాత్రి ఇంక నిద్రపోను' గోడకు చేరగిలా పడి కూర్చుంటూ అనుకుంది రత్తాలు.

'రత్తాలూ!...రత్తాలూ!...' పిలిచాడు నరిసి గాడు. పలకకూడదనుకుంది. కాని పలకకపోతే వాడే అటువస్తాడన్న భయం కలిగింది. 'ఏం?' విసుగుదల ధ్వనించే కంఠంతో అంది.

'కాసిని మంచీళ్ళియ్యే!'

'రౌడీ ముండా కొడుక్కి అందించాలగావుల్సు' తిట్టుకుంటూ కుండలో నీళ్లు ముంచి చెంబునందించింది రత్తాలు. వాడు చెంబునందుకున్నాడు. రత్తాలు గది లోకి పరిగెత్తు కొచ్చింది. నిద్ర కళ్ళమీద ఊగ సాగింది. ఇగ కూర్చోటం అసాధ్యమనుకుంది. గోడ వైపు వీపుంచి మేను వాల్చింది.

'నరిసిగాడు!...తాగుబోతు ముండా కొడుకు— పచ్చిరౌడీ ముండా కొడుకు...ఈడు నాయన్లేని ఈ పొద్దే రావాల్నా? ఒడిలో అగ్గిలాంటోడు—ఆదొచ్చి మీదబడితే...' రత్తాలు గుండె దడదడలాడింది.

'తానాడి నెదిరించగల్దా?...ఆడి కెదురు తిరి గితే నాబం లేదు...ఆడిమీద పేమ నటించాల... ఆడి కోటు జేబులోని బాకుతోనే ఆడిని సఫా సెయ్యాల...సంపితే జైలుకు లాక్కెడతారు కాబోలు... ఆడిసేసిన పని మంచిదా?...ఆడిని సంపితే మంచిదే గదా?...తానెందుకు జైలుకు పోవాల? గట్టిగ సెప్తాది పోలీసులికి. ఆడిపీడ ఒదిలించినందికి తనకింకా బగు మతి యివ్వాలి...జైల్లో పెడతరా?...తానూరుకోదు... 'ఆలోచిస్తునే నిద్రకొరిగింది రత్తాలు. ఆమె భయాన్ని నిజం చేయటానికేమో అన్నట్టు ఒక ఆకారం గది గుమ్మందాక వచ్చి వెళ్లటం రత్తాలుకి తెలియదు.

వర్షం తగ్గింది. గాలిమాత్రం వీస్తునే ఉంది. అర్ధరాత్రి దాటిపోయింది. హరికన్ దీపం మినుకు మినుకుమంటోంది. రత్తాలున్న గదిలో చీకటి పేరుకోపోయింది. తనకు సమీపంలో ఒకరెవరో నడిచినట్టు కలలో ఉంటూ జాగ్రదావస్థలోకి రాబోతూ

గమనించింది. కళ్ళు తెరవటం అంత తొందరగా వీలవటం లేదు. కాని ఏదో శరీరం బరువు....

తుళ్ళిపడింది రత్తాలు. బలంగాఉన్న పట్టు నుండి తప్పించుకోవాలని విశ్వప్రయత్నం చేసింది. చీకటిలో, మగత విడీవిడని కళ్లతో ఆకారాన్ని గుర్తుపట్టటం ఆమె సాధ్యం కావటం లేదు. కాని నరిసిగాడిని—వాడి రూపాన్ని ఊహించ గలదు. వాడి పేరు తలచుకుంటూంటూ ఉంటేనే ఒంటిలో శక్తి ఇగిరిపోయినట్టనిపించింది. కాని ప్రయత్నాన్ని విర మించలేదు. గుండెమీదకు రెండు చేతుల్నీ తెచ్చు కుని, పైకి తీసివేసే ప్రయత్నంలో విసిరిన చెయ్యి సరాసరి ముఖాన్ని తగిలింది. ఆ వెంటనే రత్తా లుకు కొండంత ధైర్య మొచ్చింది. పుంజుకున్న శక్తితో పెనుగులాడింది. కేక వేయటం ఆమె ఉద్దేశ్యంకాదు. అవతలఉన్న రెండో వ్యక్తినిమాత్రం నమ్మమని ఎవరు చెప్పారు?

పెనుగులాట తీవ్రంగా జరిగింది. చాప జర జరలాడింది. దగ్గరున్న వస్తువులు, చెంబులు ముంతలు నేలను దొర్లాయి. ఉయ్యాలలో పిల్లాడు కేరుమన్నాడు.

'రత్తాలూ!...రత్తాలూ !...ఏంటా అలజడీ?'

రత్తాలు నోరు తెరుద్దామనుకుంది.

అతను నోటిని మూశాడు.

గింజుకుంది రత్తాలు. ఏదో కేకవేసే ప్రయ త్నంతో మూలిగింది. ఆ మూలుగే అవతలి వ్యక్తికి ధైర్య మిచ్చింది.

దీపం పెద్దదైంది. గదిలో మూడవ వ్యక్తి. రత్తాలును పట్టువిడిచి గదిలోనుండి అవతలికి పరు గెత్త చూచాడు. కాని అవతలి వ్యక్తి పట్టుకు దొరికి పోయాడు. వీపుమీద చరుపు చరిచి, మెడబట్టి పట్టుకుని 'న్నాయన్యా!...లా;...ఎవుడ్రా ... నివ్వు... ఒంటిగా ఉన్న...ఆడదాన్ని... న్నా...య్యా...లా! ...' కోపంతో రెండు చెంపలు వాయించాడు. సీతాపతి పళ్ల వెంట రక్తం రాసాగింది. చిరిగిన బట్టలతో లేచి నిల్చుని ఉయ్యాల్లోంచి పిల్లాడి నందుకుంది రత్తాలు.

నరిసి కోపం ఆగలేదు '...రత్తాలూ...ఆ కోటు జేబిలోది...తెయ్యే!...నాయాలా...ఈడి పీణాలు తోడెత్తా నియ్యాల...ఎల్లే!...'

రత్తాలు పిల్లవానిని గుండె కదుముకొని నిల్చుండిపోయింది సొమ్మసిల్లినట్టు పడిపోయాడు సీతాపతి. దయతల్చాడు నరిసి. నీళ్లు తెచ్చి ముఖాన్ని చల్లాడు. 'చీర సుట్టుకోయే...బట్టలు సిరిగిపోనేదా?' ఆదేశించాడు రత్తాలుకి. కలా? నిజమా? అన్న అలో చనలో ఉన్న రత్తాలు పిల్లవానిని ఉయ్యాలలో వేసి చీర నందుకుని గది మూలకు పరుగెత్తింది. చిక్కు పడిన జుట్టును సర్దుకుంది. నరిసిగాడి కాళ్లు పట్టు కోవాలని ఉందామెకు మనసులో. కాని ఏదో నిస్సత్తువ ఆమెలో కదలలేక గోడకు చేరగిలాపడి ఉండిపోయింది రత్తాలు.

సీతాపతి కదిలాడు—మంచినీళ్లు తాగించాడు నరిసి. కళ్లు తెరిచాడు.

'ఈ రోజు శాన మంచిది. అందుకనే బతికినవు. ఆ కత్తి నీకోసరంకాదు—సెంద్రయ్య కోసరం—ఎల్లిపో! ఈడనుండ మాక—ఆడది కావలసివత్తే సంసార్ల కొంపల్లోకి రామాక...' ఆగాడు. సీతాపతి లేచి కూర్చు న్నాడు. నరిసి తన ప్రసంగాన్ని పొడిగించాడు.

'రత్తాలూ!...నాను సెంద్రయ్య నెందుకు సంపాలనుకుంటన్నానో తెల్సా!...ఆడూ...ఇసంటోడే!... నాలుగు సంమ్మచ్చరాలు ఆడు లారీని నడిపి లాబాలు తెచ్చినను...నే లేనప్పుడు ఆడుకూడ ఈడి నాగే...!... నా మంగిని . ! నా రకతం ఉడికిపోయింది...ఆనాడే ఆడిని సంపేవోడిని...కాని ఆడి పెళ్లం ముఖం సూసి...ఏటీ సెయ్యనేదు...కాని ఆడేటి సేసినడు?... ఆస్తి వాటా యియ్యాలొస్తదని తమ్మున్ని చంపి... గోనెలో మూటగట్టి—లారీలో సామాను మద్దెన ఏయించి—లారీలో సీటుక్రింద అయిదువేల రూపాయల మంచి—పోలీసుల నా ఎనక ద్రోలి—లారీ నాపించి—సోదాచేసి—ఆ డబ్బుకోసరం—ఆ పసిబిడ్డను నానే సంపా నని అందర్నీ నమ్మించి గొల్లుమన్నడు సెంద్రయ్య! నానేటి నేరం సెయ్యనేదు—కాని ఏడేళ్ల జైలు పడి

నది—అడుమాత్తరం నా మంగిని ఏలుకుంటూ, ఆస్తి నంత తింటన్నడు...నానాడికేటి సేసేను?...నానేం దుకు జైలు కెల్లాల? నీన్వే సెప్పు? దరమం నాయం—అంటే గిదేనా? -రత్తాలు!.. ఆ సెంద్రయ్యను సంపాల! అప్పుడే శాంతి—అందికనే రెండు మాసా ల్నుండి జైలిడిచి తిరగితన్నా! ... అరేయి! మగాడా! లెగరా! లెగిచి పారిపో! నీ పెల్లం ముఖం నాకు తెల్దు. కాని అది ఆడది. అంది కనే నిన్నిడిసి పెడ్తన్న!... లగెత్తు! ఆయిగ బతుకు' సీతాపతిని లేవదీసి ముందుకు నెట్టాడు.

సీతాపతి బట్టలేసికుని చేతి సంచీతో ముందుకు కదిలాడు. కదులుతున్న సీతాపతిని దీపపు వెలుగులో చూశాడు నరిసిగాడు. 'అరేయి! మగాడా! ఆగు!' సీతాపతి నాపాడు.

'నగరం ఊర్ల రాజారావుగారి కొచ్చేటోడివి గదా?' అడిగాడు. సీతాపతి అవునన్నట్టు తలూపాడు.

'ఇద్దరూ నేస్తులు గదా!'

అవునన్నట్టు తలూపాడు సీతాపతి.

'నాటకాలాడిస్తూ ... ఆడపిల్లల ఎంటేసికుని తిరుగుతూంటవుగదూ!...ఆ మద్దెన...నీ ఎనక ఒక ఆడదాయి తిరిగేది?...పాపం! ... ఇప్పుడేడుంది?... రాజారావుగారు మంచోడు...నీ సంగతి ఆదరచురాజు కెరికనేదు...నీవు గొప్పోడివని అంటడు...ఎళ్ళు!... ఇంకెప్పుడు ఆడదాయి జోలికిరామాక...' సలహానిచ్చి వదిలిపెట్టాడు నరిసి.

సీతాపతి గబగబా అవతలికి వెళ్ళిపోయాడు.

నరిసి గది అవతలికి కదిలాడు. రత్తాలు అతని వెనుకవెళ్ళి ఆతని కుర్చీకి దగ్గరగా నిల్చుని 'శానగండం గడిచినా దయ్యా ఇయ్యాల! నీవు రాకపోతే నానేల్లైపోదు నన్నా!' అంది.

నరిసిగాడు పెళ్లున నవ్వి అన్నాడు.

'రత్తాలూ!...నిన్ను సూస్తే, జాలెస్తుందే! నాను నిన్నేటిసేస్తానని బయమా? 'అన్నా' అంట న్నవు? రత్తాలూ! పైకొకమాట...లోన ఇంకోటి మనలాటోళ్లకి సేతకావే' కుర్చీలోంచి లేచి కోటు తొడుక్కోబోయాడు.

'అన్నా!...నీవు నిజంగా సెంద్రయ్య తమ్ముని సంపనేదా?' అడిగింది. తలఎత్తి రత్తాలు కళ్లలోకి చూశాడు. జాలిగ నవ్వి అన్నాడు

'రత్తాలూ! నాను నిజం చెప్పినా ఎవరూ నమ్మరే! కాని సత్తె ప్రమాణంగా నేనే పాపం ఎరగనే! సీతాపతిలాంటోడే సెంద్రయ్య! పాపకింద నీరు... నాతో నేస్తం కట్టినడు—లారీని తోలమన్నడు— కష్టార్జిమించిన డబ్బు దుపిలినడు— ఇంటికి రాక పోకలు సాగించినడు...సెంద్రయ్య మంచోడని నమ్మి నను నిజంగా మంగి శానమంచిది...అమాయకురాలు. దాని మనసు సెడగొట్టి దాన్ని సెడగొట్టి నా సంసారంల నిప్పులు పోసినడు. అట్టాంటి సెంద్రయ్యను ఇడిసి పెట్టాల్నా? సీతాపతీ అలాంటోడే...నాను సెంద్రయ్యను సంపాలను కోలే! మంగితో ఊరిడిసి పోదామనుకున్నా' కాని సెంద్రయ్య కుట్ర !...దొరికి పోనాను. నానే పాపం ఎరుగను...నీవు పసిబిడ్డ తల్లివి. నీ పాదాల సాక్షి. ఇపుడు మాత్తరం ఆడిని ఒదల్ను...ఆడిని సంపాల! అపుడు నిద్రపోవాల!' కత్తి నొకసారి తడిమి కోటు బొత్తాలు పెటు కున్నాడు నరిసి.

'ఊల్లోకి నిజంగా పోతవా అన్నా?' భయ పడుతూ అడిగింది రత్తాలు. చిరాకుతో చూశాడు రత్తాలువైపు నరిసి. రత్తాలు అంది.

'ఊల్లో అందరు నీ కెరిక. నిన్ను సూస్తే ఏ ఒక్కరూ ఒద్రలు! పైగ డబ్బిస్తరని అందరికీ ఆస. నిన్ను పట్టియ్యానికి అందరు పోటిపడతన్నరు. అన్నా! నీవు మంచోడివి. నామాటిను...ఊర్లోకి పోక... నీ కాల మొక్కుత. ఎలుగు రాకముంగ లేయాడనుండొ చ్చినవో ఆడకేబో. సెంద్రయ్య కంటపడినవా నిన్ను బతకనీడు' చేతులు పట్టుకుంది రత్తాలు.

'రత్తాలూ!...రత్తాలూ'.. నివ్వుకూడ ఆడి మడిసివేనే, ఆడ్ని సంపుతానని ఖాయందరి బాధ.

గాని నా మెడకు ఉచ్చుపడతా వుంటే ఏ ఒక్కరికీ బాదనేదు కదే! నా జీవితం పోయినా మీకేటి కాదు గదే! రత్తాలా!...నాను మడిసినే! మడిసిని. నాలో సెడ్డతనముండదే! గాని అదెవ్వరినేటి సెయ్యదు. నాను రౌడీనే. గాని ఏ ఆడదాన్నీ సెరచనేదే! నాను తాగుబోతునే. గాని లారీనెక్కిన ఏ పొద్దూ తాగనేదే! సెంద్రయ్య నా బార్యను సెరిచినాడే. నా బతుకు ముక్కలు సేసినాడే! అదు బతకాల. నాను కైలు కెల్లాలి. గంతే గదూ! నరిసి కళ్లలో నీళ్లుబికాయి.

రత్తాలు అతని రెండు చేతులు పట్టుకుని

'కాదన్నా! నా మాటిను. ఊరంతా ఏకమ్మైనరు నిన్నేటిసేసినా నీకు దిక్కెవురు? నా పానాలు కాపాడిన బగమంతుడివి. నీకేమైనా ఏడిసేది నానే! అన్నా' గాలీవాన తగ్గిపోనాది ఒర్సం అంతగ నేదు. ఎవురికీ కనపడక పారిపో అన్నా! నా మాటిను' అంటున్న రత్తాలుకి అంతలో ఏదో జ్ఞాపకం వచ్చింది. గల్లాపెట్టి దగ్గరకు పరుగెత్తింది పాత గుడ్డలో గల్లా పెట్టెని వలిపేంది. నోట్లు, చిల్లరను గుడ్డలోకట్టి 'అన్నా! గిది తీసికో! కర్సుపెట్టుకో! ఎల్లిపో అన్నా! నా మాటిను' మూటను అతని చేతిలో పెట్టి కళ్లనీళ్లు పెట్టుకుంది రత్తాలు.

నరసి కళ్లు తుడుచు కున్నాడు.

'రత్తాలూ!...లెగే...కళ్లనీల్లు తుడుసుకో! నాలెల్లి పోతను లెయ్యే!...రత్తాలూ!...ఈ పైసలు నా కెందికే?......ఆడపిల్లవు......రయిక గుడ్డ కొనుక్కోయే!' అంటూ మూటను చేతిలోపెట్టి కుర్చీలో కూలబడ్డాడు నరిసి.

'కాల్సుకో అన్నా!' అంది రత్తాలు సిగరెట్ పెట్టెనందిస్తూ.

'ఒద్దులెయ్యే! నాకేటి వొద్దే!...కాని రత్తాలూ! నిన్ను నాను ఆదుకున్నందుకి నా పాణాలు తీసినవే! నీ పేర్న సెంద్రయ్య సావు తప్పినది. సీతాపతి అదృట్టమంతుడే! రత్తాలూ! ఈ అన్నను మర్చిపోకే! ఎల్తాను' అంటూ లేచాడు.

అంతలో వీధిలో ఎవరో వచ్చినట్టయింది.

'అన్నా! ఎవురో వచ్చినరు! ఆ పొయ్యి ఎనక దాక్కో' హెచ్చరించింది రత్తాలు నరిసి సర్దుకునే లోగా వీధి తలుపు తెరచుకుంది. నాలుగు టార్చిలైట్లు ఒక్కసారి వెలిగాయి. చెంద్రయ్యతోపాటుఉన్న మరి నలుగురు మనుష్యులకు ముందుగా నిలబడి నరిసిని చూపుతున్నసీతాపతిని చూచి దిమ్మెరపోయింది రత్తాలు.

సీతాపతిని చూచి 'సీతాపతీ!' అంటూ కేక వేశాడు బాధగా నరిసి.

ముందుకు అడుగువేసిన నరిసిమీద ఒక్కసారి నాలుగు దుడ్డుకర్రలు పడ్డాయి.

నరిసి నేలకూలాడు.

రత్తాలు గొల్లుమంది.

ఆ తెల్లవారు ఝామున కొబ్బరితోటలో కూలిపోయిన కొబ్బరి చెట్టుక్రిందనున్న నరిసి కళేబరాన్ని ఊరంతా దర్శించింది.

# కరుణాలహరి

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

గీ॥ పాల మున్నీటి కెరటాల చాలునందు
తురగలించెడు మీగడ తరక వగుచు
స్వచ్ఛ శారద పూర్ణిమా చంద్రకిరణ
వార విగళితా మృత రసధార వగుచు
అవతరించిన కరుణాలహరి! నమోస్తు

గీ॥ క్రొత్త దిరిసెనపుం బూల మెత్తదనము
పుల్లమల్లికా సుమముల తెల్లదనము
లలిత మలయానిలంపు చల్లందనమ్ము
నీవుగా రూపుగట్టిన వేమొ కరుణ!

సీ॥ భీష్మవ్యథా విధా గ్రీష్మాతపమ్ముల
వసివాడు బ్రతుకు తీవలను జూచి
తత నిరంకుశ కశా వితతి ఘాతములకు
కసుగందు పసరు మొగ్గలను జూచి
నిరుపేద తనపు నిబ్బరపు బెడారిలో
ఇంకిపోయెడు జీవ నేచ్ఛ జూచి
బహుళకష్టధానల జ్వాలికా మాలల
రగిలెడు మేనికతీలను జూచి

గీ॥ క్రౌర్య భీకర క్రకచ దంష్ట్రలను జిక్కి
నలిగిపోవు మంచితనంపు కలిమి జూచి
ఆర్ద్రచిత్తుల నేత్రములందు జారు
అశ్రుధారల ప్రత్యక్ష మగుదు వీవు

సీ॥ ఏ విమలాత్మ వాణీ వీణపై శుభ
స్వర రాగ గీతివై పలికినావొ?
ఏ మహోదారుని హృదయ పంజరములో
కలికి రాచిలుకవై కులికినావొ?
ఏ పుణ్యశాలి కన్పాపలో పాపవై
అల్లారు ముద్దుగా అలరినావొ?
ఏ మహనీయుని యెదతోటలోన పూ
చిన పారిజాతమై తనరినావొ?

## కరుణా లహరి

గీ॥ ఏకవీంద్రుని భావనా లోకమందు
దివ్యమంగళమూర్తివై తేజరిల్లి
నావొ? ఏ కళాశీలి యూహావిహార
చంచలా వల్లివై తులకించి నావొ?

గీ॥ నీవు పన్నీటి చెమ్మగా నెగడ కున్న
గుండెలెండి కఠోరమై బండబారు
నిన్ను వెన్నెల రేకగా పన్నకున్న
నరునిలో కారుచీకటి పరచుకొనును

మ॥ క్షమకున్, శాంతికి దూర దూరమయి
హింసా పాంసులమ్మైన వి
శ్వము సౌభాగ్య కళాప్రసన్న మగుచున్
భాసిల్ల స్నేహ ప్రసా
రములన్ మానవతా ప్రదీపకళికన్
రంజిల్లగా జేయువా!
విమలానంద పృషత్ ధురీణ! కరుణా
పీయూష మందాకినీ!

సీ॥ పగల సెగల్ చియ్యబట్టిన డెందాన
ఘనసార మిళిత చందన మలంది
కరకు దనమెల్ల కరుడు గట్టిన భావ
వీధుల మార్దవ వృత్తి మెలపి
చేదు నిండిన గుండెపొదు మధురిమతో
నాను నట్లుగ తేనెవాన కురిసి
క్రోధారుణ ప్రభాంకుర సంకులమ్మైన
కనులలో శాంతిముగ్ధత ఘటించి

గీ॥ గాఢదౌర్జన్య పర్జన్య గర్జనలకు
మూర్ఛగొను మదిన్ చైతన్యముద్ర గూర్చి
మానవమ్లాన జీవితోద్యాన సీమ
కిసలయింప వసంతరాగిణిగ రమ్మ!

గీ॥ మనసులో మాటలో నీవు మసలవలయు
చేతలో వ్రాతలో నీవు చెలగ వలయు
నీతిలో రీతిలో నీవు నిలువ వలయు
పరమకల్యాణ రాశి! కృపా మహాశి!

---

# 'విజయ విలాసవ్యాఖ్య-హృదయోల్లాసం' సమీక్షా పరిశీలన

"ఆంగీరస"

పై శీర్షికతో డాక్టర్ ఎస్. గంగప్పగారు 1972 డిసెంబరు 'భారతి'లో ఒక వ్యాసం వ్రాస్తూ, నేను కడచిన అక్టోబరు సంచికలో ప్రకటించిన వ్యాసానికి సమాధానం ఇచ్చారు. వారు నా సందేహాలకు సమాధానం ఇచ్చినట్లు తృప్తిచెంది యుండవచ్చును కాని, అవి సరియైన సమాధానాలు కావని తెలుపుట కోసమై ఈ వ్యాసం వ్రాయవలసి వచ్చుచున్నది.

ఎన్నో దశాబ్దాలు కృషిచేసి విపులంగా ప్రకటించిన ఆంధ్ర విశారద శ్రీ తాపీ—ధర్మారావుగారి 'హృదయోల్లాసం'లో విశేషార్థాలు విద్వద్గ్రాహ్యాలూ, సరసమైనవీ లేవని నేను చెప్పలేదు. ఆయన శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి యెడల గౌరవం చూపలేదనీ అనలేదు. కేవలం ఇతర వ్యాఖ్యాతలను ఆక్షేపించడానికే విశేషార్థాలు చూపారని అంతకన్నా అనలేదు. ఎంత సమర్థులు వ్రాసినవానిలోనయినా అసంతృప్తికరాలయిన విషయాలుండడం సహజం. అవి అట్టివి కావని సమర్థించనక్కర్లేదు, సమర్థించేటప్పుడు సమాధానాలు సరియైన పద్ధతిలో ఉండాలి. గంగప్పగారు ఆ పద్ధతిలో సమాధానా లియ్యలేదు.

1 శ్రీ ధర్మారావుగారు 'ఏణాక్షి నపుడు' (ఆ. 1 ప 127) అనే పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ 'ఆహారాన్నిబట్టి స్వభావముంటుందని ఒక సిద్ధాంతము' అని తెలుపుతూ, దానికి ప్రమాపకంగా శ్రీనాథుని

'జన్యజనకంబులకు భేద శంకలేదు·
దేహ మన్నజ మిందు సందేహ మేది?

అనే పద్యభాగాన్ని ఉదాహరించారనీ, ఆ పద్యభాగం శ్రీహర్షుని నైషధ కావ్యంలోని

'నాస్తి జన్యజనక వ్యతిభేదః
సత్య మన్నజనితో జనదేహః'

అనే శ్లోక భాగానికి అనువాదమనీ, దాన్నిబట్టి శరీరానికీ అన్నానికీ అభేదం తెలుస్తుందిగాని, 'ఆహారాన్నిబట్టే స్వభావం ఉంటుంద'నే దానికి అది ప్రమాపకం కాదనీ వ్రాశాను. డాక్టరుగారు 'ఆహారాన్నిబట్టే స్వభావం ఉంటుం'దంటూ వైద్యశాస్త్ర ప్రమాణాలను సేకరించి సుదీర్ఘంగా చర్చించారు. అసలు విషయం శ్రీ తాపీవారు ఉదాహరించిన సిద్ధాంతానికి శ్రీనాథుని పద్యభాగం ప్రమాపకం కాజాలదని.

'ఆహారాన్నిబట్టే స్వభావం ఉంటుంది' అనేది ఆయన తెల్పిన సిద్ధాంతం. 'జన్యజనకాలకు భేదం లేదనీ, అందువల్ల అన్నజనితమైన దేహానికీ, అన్నానికీ భేదం లే'దనీ శ్రీనాథుని పద్యభాగానికి అభిప్రాయం. పయి సిద్ధాంతానికి ఇది ఎలా ప్రమాణ్యం ఈయ గలదో సహృదయులే ఆలోచించాలి.

**2.** అచ్యుతరాయులను వర్ణించే 'గెలిచిన గెల్పులర్థి తతికిన్ దినమిచ్చిన యీవులన్ వహుల్' (ఆ. I ప. 14) అనే పద్యంలో 'రవులున్, వహుల్' అనే పాఠం గ్రాహ్యం కాదనీ, 'వహుల్ తలచిన' అన్నప్పుడు ప్రథమకు ద్వితీయార్థం చెప్పడం సబబు కాని, పంచమ్యర్థం చెప్పడం ఉచితం కాదని నే నన్నాను. 'వహుల్' లెక్కల పుస్తకా లయితే, వాటిని చూడడం కుదురు

తుంది కాని, ఆలోచించడం కుదరదనీ, అన్వయం కుదరడానికి 'వహుల్ చూచి తలచిన' అని 'తలచి' అనే పదాన్ని అధ్యాహారం చేసుకోవలసివస్తుందనీ వివరించాను.

గంగప్పగారు 'సామాన్యార్థ గ్రహణంలో వేదం వారు గ్రహించిన 'ఈవులన్ వహుల్ తలచిన' అన్న పాఠమే మనకు నప్పుతుంది. సందేహం లేదు. అయినా శ్రీ తాపీవారు మరొక్క అడుగు ముందుకు వేసి తమ వ్యుత్పన్నతను ప్రకటిస్తూ, 'ఈవులున్, వహుల్ తలచిన' అన్న పాఠాన్ని గ్రహించి దానికి తగిన వ్యాఖ్యానం గావించారు. 'ఈవులున్, వహుల్ తలచిన'— అన్నదానికి 'దానములును, వహుల్=వారి లెక్కల పుస్తకములను, తలచిన—ఆలోచించినట్లయితే'—అనే తాపీవారి వ్యాఖ్య సబబే! దీనికి దానములను, పుస్తకాలను (చూచి) ఆలోచించినట్లయితే' అనే అర్థం అంటే 'చూచి' అన్నదిక్కడ అధ్యాహార్యంగా గ్రహిస్తే తప్పేమీ లేదు. పైగా అది సంప్రదాయ విరుద్ధమూ కానేరదు' అని సమాధాన మిచ్చారు.

'చూచి' అధ్యాహార్యం సంప్రదాయ సిద్ధమే అని భాషాపరిశోధకులైన డాక్టరుగారు చెప్తే కాదనేవారు లేరు. కాని; చక్కగా సమన్వయిస్తున్న పాఠం విడిచి, పాఠాంతరాన్ని గ్రహించి, అది సమన్వయించకపోగా— 'చూచి'ని అధ్యాహార్యంగా గ్రహించి అర్థం చెప్పడం సముచితం కాదనే ఇప్పటికీ తోస్తున్నది. తాపీవారు ఒక అడుగు ముందుకు వేసినా, అది సరియైన మార్గంలో పడలేదనే చెప్పాలి. 'వహుల్' అంటే లెక్కల పుస్తకాలని అర్థం చెప్పితే మరొక అస్వారస్యం కూడా సంభవిస్తున్నది. అచ్యుతరాయల విజయాలు లక్ష విక్రమార్కులకూ, దానములు కోటి కర్ణులకూ సాటిగా ఉంటాయని కదా అభిప్రాయం! అందువల్ల అవన్నీ సుప్రసిద్ధాలయినవే! వాటిని నమ్మని సందర్భంలోనే లెక్కల పుస్తకాలను చూడవలసిన అవసరం ఉంటుంది. నమ్మిక ఉన్నప్పుడు వాటిని చూడవలసిన పని ఉండనే ఉండదు. అందువల్ల క్లిష్టాన్వయంతో కూడిన పాఠాంతరంవల్ల విశేషార్థం సంగతి అటుండగా—అస్వారస్యానికి అవకాశం ఏర్పడగలదు.

3. 'పైపయి కౌతుకంబు' (అ 1 ప. 128.) అనే పద్యంలో 'దానలీల, లాపరతంత్రుండై కలకల నగుచుండెడి సవ్యసాచి నిం, ద్రోపదిరోచి జూచి' అనేదాన్ని వివరిస్తూ తాపీవారు 'ఇందులో దానలీలా పరతంత్రుడైన అర్జునుడు కలకల నవ్వుతున్నాడని యిదివరలో వ్యాఖ్యాతలు అర్థం చెప్పారు. దానం చేస్తున్నప్పుడు కలిగే ఆనందంలో మందహాసం కలగడం అసహజం కాదు. కాని దానాలు ఆసక్తితో చేస్తూ ఉన్నప్పుడు నవ్వు ఎందుకు? సమంజసం కాదు' అని వ్రాస్తూ 'కలకలన్ నగుచుండెడి=ముఖము కళకళ లాడుతూ (మిక్కిలి ఆనందంతో) ప్రకాశిస్తూవున్న అనగా చాల శోభాయమానముగా ఉన్న' అని ఆ పదాలకు అర్థం వివరించారు.

ఇక్కడ 'కలకలన్ నగుచుండెడి' అనే విశేషణం పద్యంలోఉన్న 'సవ్యసాచి' అనే విశేష్యానికి సంబంధించినది; కాని పద్యంలోలేని 'ముఖ' పదానికి సంబంధించినదికాదు. లేని ముఖపదాన్ని అన్వయంలో చొప్పించడం అన్వయసరళికాదని నేను వ్రాశాను. దానం చేసేటప్పుడు మందహాసం సహజమే అని శ్రీ ధర్మారావుగారూ ఒప్పుకున్నారు. పెద్దగా నవ్వడం అసహజమే! అందుకనే చేమకూరకవి 'నవ్వుచున్' అని చెప్పక 'కలకల నవ్వుచున్' అని మందహాసాన్నే వెల్లడించాడు. వెనుకటి వ్యాఖ్యాతలు చేసిన తప్పేమీ కానరాదు.

'కలకల' శబ్దం వ్యక్తమైన శబ్దం (ధ్వని) అనే అర్థాన్నే తెలియజేస్తుందనీ, అవ్యక్త ధ్వనిని తెలుపదనీ గంగప్పగారు చెప్పారు. కలకల శబ్దం ఆయా సందర్భాలను అనుసరించి వేర్వేరు ధ్వనులనూ చెప్పవచ్చును. ప్రకాశించడం మున్నగు ఇతరాలైన అర్థాలనూ చెప్పవచ్చును. దానికి ఒకే అర్థమని నిర్ధారణ చెయ్యడం సరికాదు.

శ్రీ ధర్మారావుగారు 'కలకలన్ నగుచుండెడి= ముఖము కళకళలాడుతూ (మిక్కిలి ఆనందంతో) ప్రకాశిస్తూవున్న' అని ముఖపదాన్నికూడా చేర్చి అర్థం

చెప్పగా గంగప్పగారు ముఖ్యప్రసక్తినే విడిచిపెట్టి 'కళకళలాడుతూ మందహాసంతో కూడిన' అన్నది సవ్యసాచికి విశేషణం అవుతుంది' అని పూర్వ వ్యాఖ్యాతల దారికే వచ్చారు. తాము శ్రీ ధర్మారావుగారి అర్థాన్ని సమర్థించినట్లనుకొన్నారేమో! కాని, సమర్థించినట్లు ఇతరు లెవ్వరూ అనుకోలేరు.

4. 'అన విని పొపపూప జవరా లెదలో మన పొపలేక' (ఆ. I. ప. 161) అని విజయవిలాస ప్రతులన్నిట్లోనూ 'ఎదలో వల పొపలేక' అనే పాఠమే కానవస్తూ ఉన్నది. 'వలపు ఆపలేక' అంటే 'ప్రేమను అణచుకో లేక' అని అర్థం.

శ్రీ ధర్మారావుగారు మాత్రం 'వలపోపలేక' అనే పాఠాన్ని గ్రహించి 'సహించలేక' అనే అర్థాన్ని చెప్పారు. ఈ రెండు పదాలకీ అర్థం ఇంచుమించుగా ఒక్కటే! 'వల పలేక' అనే పాఠంలో చేమకూర కవికి ప్రియమైన అనుప్రాసం కూడా వుంటుంది. ఆ పాఠాన్ని మార్చి కొత్త పాఠం గ్రహించనక్కర్లేదని నేను తెలిపాను. డాక్టరు గంగప్పగారు 'వల పొపలేక—అను పాఠం ప్రాసానుగుణమై ఉందనడంలో సందేహం లేదు; ఇది సరైనదే! కాని, దానికంటె మరికొంత విశేషార్థం చెప్పడమే ఈ పాఠం గ్రహించడంలోని పరమార్థమని తలంచాలి' అని సమాధాన మిచ్చారు. ఆ విశేషార్థ మేమిటో వివరించి చెప్పినట్లయితే బాగుండేది. ప్రసిద్ధంగా ఉన్న పాఠాన్ని కాదన్నప్పుడు సహృదయుల మనస్సుకు నచ్చే విశేషార్థాన్ని చెప్పాలి. లేనప్పుడు కొత్త పాఠాన్ని గ్రహించడంలో ఔచిత్యం ఉండదు.

5. ఉలూచిని వర్ణించే సందర్భంలోని 'చిలువ చెలువంపుఁ బల్కులఁ జిలువ చెలువ' (ఆ. I. ప. 165. పాదం 4) అనేది లభించిన ప్రతులన్నింటిలోనూ ఒకే మాదిరిగా ఉన్నది. ఉన్నదానికి 'స్థితస్య గతి శ్చింతనీయా' అనే పద్ధతిలో పూర్వ వ్యాఖ్యాతలు 'చిలువలు పలవలు గల విలాసంతో కూడుకున్న పలుకు'లనే అర్థం గ్రహించి ఉన్నారు. శ్రీ ధర్మారావుగారికిన్నీ ఆ పాఠాన్నే ఆశ్రయించవలసి వచ్చినది. ఆయన పూర్వ వ్యాఖ్యాతలను అధిక్షేపిస్తూ 'ఈ చిలువలూ పలువలూ ఏమిటో, అవి ఉలూచి పలుకులలో ఎక్కడ కనిపించాయో, చిలువలూ, పలువలూ అన్న అర్థము ఏ మాటనుబట్టి వచ్చిందో?' అని వ్రాశారు. వారు 'నాగుబామువంటి అందముగల మాటలతో' అని అర్థం చెప్పి, ఆ అర్థాన్ని సమర్థించడానికి విపులంగా వ్యాఖ్య కూర్చారు. ఏమి వ్రాసినా—వెనుకటి వ్యాఖ్యాతల అర్థం కుదురదని చెప్పినప్పుడు ఈ అర్థం కూడా కుదరదనే చెప్పవలసి ఉన్నది. ఎమెస్కో వారి మూలప్రతిలో తత్సంపాదకులు 'చెలువు చెలువంపుఁ బల్కుల చిలువ చెలువ' అనే పాఠాన్ని సంపాదించి 'చెలువు చెలువంపుఁ బల్కులన్=అత్యంత విలాసయుక్తమైన పలుకులచేత'అని అర్థం చెప్పారనీ, అది కొంత సరసంగా ఉన్నదనీ కూడా వ్రాసి ఉన్నాను.

గంగప్పగారు పూర్వ వ్యాఖ్యాతల అభిప్రాయాన్ని విమర్శిస్తూ 'చిలువలు, పలువలు అంటే 'లేనిది కల్పించి' అనే అర్థంలోనే వాడుక. 'చిత్రవిచిత్రంగా' అని గ్రహించినా తప్పులేదు. కానీ 'చమత్కారం' మాత్రంకాదు' అని వ్రాశారు. ఇట్టి పదాలకు అర్థం ఆయా సందర్భాలనుబట్టి వాడుకలో ఉంటుంది. 'ఈ అర్థమే వస్తుంది; మరొక అర్థం రాదు' అని నిర్ణయించలేము. 'చిత్రవిచిత్రంగా' అనే అర్థాన్ని గ్రహించినప్పుడు 'చమత్కారంగా' అనే అర్థం ఎందుకు గ్రహించకూడదో నాకు బోధపడలేదు.

విమర్శకులు ఎమెస్కోవారి ప్రతిని ప్రస్తావిస్తూ 'ఇక ఎమెస్కో వారు ప్రకటించిన విజయ విలాసంలో తత్సంపాదకుల పాఠం బాగున్నదంటూ 'ఆంగీరస'గారు అంగీకరించారు. నిజమే! అది అర్థం చేసుకోగలిగినవారి ఉపజ్ఞతమీద ఆధారపడి ఉంటుంది. అంతమాత్రంచేత తాపీ వారి వ్యాఖ్యను సరసంగా లేదనడం సముచితం కాదేమో!' అని వ్రాసి ఉన్నారు. ఎమెస్కో వారి పాఠం సుస్పష్టమైన అర్థాన్ని ఇస్తున్నది. దాన్ని గ్రహించడానికి ఉపజ్ఞ అక్కర్లేదు. తాపీవారి అర్థం వారికి సరసంగా తోచవచ్చు. మాటలకూ, పాముకూ సామ్యం చెప్పడం సరసమని అనుకోను. అది సరసమైనదైనప్పుడు పూర్వవ్యాఖ్యాతల అర్థం కూడా

సరసమైనదే కాగలదు. వెనుకటి అర్థం సరికాదని చెప్పడంలో ఔచిత్యం కానరాదు.

6. చిత్రాంగదను పెళ్లికూతుర్ని చేసినట్లు వర్ణించిన పద్యంలో 'శృంగారకళా, చిత్రాంగదయుత యగు నా చిత్రాంగద బెండ్లికూతుఁ జేసిరి' (ఆ 2. ప. 12) అనే చోట పూర్వవ్యాఖ్యాతలు 'అంగద' శబ్దానికి 'భుజకీర్తు'లనే అర్థం వ్రాయడం సరి కాదనీ, 'అందెల'నే అర్థం చెప్పాలనీ తాపీవారు వ్రాశారు. 15-వ పద్యంలో 'అల పెండ్లికూతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్' అనే చోట అంగద శబ్దానికి 'అందె'లనే అర్థం చెప్పవలసి ఉన్నందున 12-వ పద్యంలో కూడా ఆ అర్థాన్నే గ్రహించవలసి ఉంటుందనీ కూడా ఆయన చెప్పారు.

'పెండ్లికుమార్తెను చెయ్యడానికి చిత్రాంగదను అలంకరించేటప్పుడు భుజకీర్తులను పెట్టినారని చెప్పుటలో విప్రతిపత్తి కానరాదు. 15 వ పద్యంలో అందెలను గ్రహించినంతమాత్రాన ఆ అర్థాన్నే ఇక్కడ కూడా గ్రహించాలనే నిర్బంధం లేదు.' అని నేను తెలిపాను.

పయి రీతిని నేను వ్రాయగా—గంగప్పగారు తాపీవారు చెప్పినదాన్నే తిరిగి తెలియజేస్తూ 'ద్వితీయా శ్వాసంలో 12 వ పద్యంలోని 'శృంగారకళా చిత్రాం గదయుత యగు నా చిత్రాంగద' అన్నదానిలో 'అంగద' అనేదానికి 'భుజకీర్తి'అని కాక 'అందె' అనే గ్రహించా లనీ, ఎందుకంటే అదే ఆశ్వాసంలోని 15—వ పద్యం లోని 'రణచ్చరణాంగదంబులన్' అన్నచోట 'మోగు తున్న కాలి అందె' అనే అర్థం వచ్చేటట్లు ప్రయుక్తం కావడంవల్ల అది సముచితమనీ తాపీవారి సముచిత వ్యాఖ్య. మొదట చిత్రాంగదను అలంకరించే సంద ర్భంలో చెప్పబడని అందెలగూర్చి తరువాత చెప్పడం ఉచితం కాదని తాపీవారి భావన. ఎందుకంటే మొదట భుజకీర్తులు అలంకరింపబడినవని చెప్పి; ఆ వెనుక ధరింపబడని కాలిఅందెలతో వచ్చిందనడంలో సొగసు లేదని వారి తలంపు' అని వ్రాశారు.

'సుత్రామనిభుడు' అనే 12—వ పద్యం తర్వాత ఆ వెంటనే 13—వ పద్యంగా 'రణచ్చరణాంగ దంబులన్' అనే వర్ణన గల 15 వ పద్యం ఉన్నట్ల యితే గంగప్పగారు చెప్పినది ఒప్పిదంగా ఉండవచ్చు. కాని, ఇక్కడ అలా లేదు. వీటిమధ్య మరి రెండు పద్యాలున్నవి. ఒకటి చిత్రాంగద ముస్తాబునకు సంబం ధించినది. తర్వాతిది పెండ్లి కుమారుడైన అర్జునుడు పెండ్లికి తరలి రావడం గూర్చినది. ఆ పద్యం తర్వాత ఉన్నదే 'రణచ్చరణాంగదంబులన్'గల పద్యం ఉన్నది. అందువల్ల 12 -వ పద్యంలోని 'అంగద' పదానితో 15 — వ పద్యంలోని 'అంగద' పదానికి ముడిపెట్ట నక్కర్లేదు.

మరొక సంగతి. 13—వ పద్యంలో
'గరిత లలంకృతి సేయఁగ
గరువపు మురు వపుడు హెచ్చి కన్నియ దనరెం
బరిణయయవ్వుం గైసే తల'

అని చిత్రాంగద కైసేతలు తెలుపబడి ఉన్నవి. ముస్తాబు చేసినప్పుడు అన్ని నగలూ వస్తాయి. వాటిలో 'అందెలు' చేరవని చెప్పలేముకదా! కావున ఇదివరలో చెప్పబడని 'అందెలు' 15 వ పద్యంలోకి ఎలా ప్రవే శిస్తాయి?' అనే సందేహానికి అవకాశం లేదు. పూర్వ వ్యాఖ్యాతలు చెప్పిన అర్థం ఉచితమైనదే; కాని, అను చితం ఎంతమాత్రమూ కాదు.

7. చిత్రాంగదా సౌందర్యవర్ణన సందర్భంలో 'హరిపతి నడుమున కోడెన్, గరువపు నడకలకు నోడె గజపతి యిఁక నీ, నరపతి లోనగు టరుదే, వరవర్ణిని మెఱుఁగు వాఁడి వాల్చూపులకున్' (అ. 2. ప. 17) అనే పద్యం ఉన్నది.

సింహం ఆమె నడుముకూ, ఏనుగు ఆమె నడకకూ ఓడిపోయాయి; ఇక మానవుడు ఆమె వాల్చూపులకు ఓడిపోవడంలో వింతలేదు—అని దీని అర్థం. చిత్రాంగద నడుము సింహం నడుముకన్నా సన్నమనీ, నడక ఏనుగు నడకకంటెనూ ఠీవి కలదనీ, అట్టియామె వాలుచూపులకు అర్జునుడు లొంగి పోవడంలో ఆశ్చర్యం లేదనీ దీని అభిప్రాయం. వేరే వ్యంగాన్ని ఇక్కడ గ్రహించకూడదు.

ఇక్కడ ఒక విశేషం ఉన్నదంటూ శ్రీ ధర్మా రావుగారు 'హరి' పదానికి అశ్వమనే అర్థంకూడా ఉన్నది. కాబట్టి 'అశ్వపతి' గ్రహించవచ్చుననీ, బహమనీ రాజులకు 'అశ్వపతు' లనేది బిరుదమనీ, అట్లే ఉత్కళరాజులకు 'గజపతి' బిరుదు ఉన్నదనీ, విజయనగరరాజులకు 'నరపతి' బిరుదు ఉన్నదనీ చెప్తూతూ రాయలవారి శత్రువులు బహమనీ కళింగ రాజులు యుద్ధములో వారు పారిపోవడంకద్దు. తంజావూరు ప్రజలకు ఈ పద్యము ఆ ముచ్చటను స్ఫురణకు తేకపోదు' అనీన్నీ చెప్పి ఉన్నారు.

పై విశేషార్థాన్ని చెప్తితే పెద్ద చిక్కు వస్తుంది. అశ్వపతులైన బహమనీ సుల్తానులూ, గజపతులైన ఉత్కళరాజులూ ఓడిపోయారంటే — నరపతులైన విజయనగర ప్రభువులు ఓడిపోవడంలో ఆశ్చర్యం లేదు' అని అర్థం ఇస్తూ యిది విజయనగర ప్రభువులను హీనపరుస్తుంది. అందువల్ల ఇక్కడ అలాటి అర్థాలు తీయడం ఉచితంకాదు— అని నేను వ్రాశాను.

గంగప్పగారు 'హరిపతి, గజపతి, నరపతి—అన్న పదాలకు శ్రీ తాపీగారు చేసిన వ్యాఖ్య చమత్కారసహమై ఉంది. వాటికి విపరీతార్థాలు తీయడానికి ప్రయత్నించరాదు'అని నా వ్రాతను విమర్శించారు.

పద్యంలో ఉన్నది 'హరిపతి' పదం; దానికి 'అశ్వపతి' అనే అర్థాన్ని చెప్పి విశేషాన్ని చూప యత్నించిన వారు తాపీవారు! తమకు ఇష్టమైన అర్థాలను మాత్రం గ్రహించి, ఇష్టం కానివానిని విడవాలంటే కుదరదు. ఊరు తీస్తే పేను వచ్చి తీరుతుంది. నేను తెలిపిన విపరీతార్థం వస్తుందో రాదో విచక్షణులే నిర్ణయించగలరు. ఇక్కడ విశేషార్థాల జోలికి పోకుండా ఉండడమే మేలు.

8, 'ఈ, బిత్తరి ముద్దు నెమ్మొగము పిన్నమ పున్నమ చందమామకున్.' (అ 2. ప. 108.)

ఇక్కడ శ్రీ వేంకటరాయశాస్త్రిగారు 'పిన్నమ్మ అనగా మహాలక్ష్మి కావున—ఈ ముఖము పూర్ణిమా చంద్రునియొక్క సిరి' అని చమత్కారాన్ని సూచించారు. శాస్త్రిగారు చెప్పినది సరి కాదంటూ తాపీవారు 'వ్యవహారంలో పెద్దమ్మ అంటే దరిద్రదేవత అనే ఉంది కాని, పిన్నమ్మ అనగా లక్ష్మీదేవి అని ప్రసిద్ధంగా లేదు' అని వ్రాశారు. గంగప్పగారున్నూ వారిని సమర్థిస్తున్నారు. అక్కన్న మాదన్నలను గూర్చిన కథ సుప్రసిద్ధంగదా! 'మనకున్న చుట్టరికం ఏమిటి?' అని మాదన్న అక్కన్నను అడుగగా 'నీవు పిన్నమ్మ కొడుకువి (శ్రీమంతుడివి.) నేను పెద్దమ్మ కొడుకుని (దరిద్రుడను)' అని సమాధానం చెప్పేడట! ఈ 'పిన్నమ్మ' పదం ఈ అర్థంలో ఏ ప్రాంతానికి చెందినా—తెలుగువా రందరి వాడుకలోనూ ఉన్నది. ఇక—భాషా వాఙ్మయాల్లో విశిష్ట పరిశోధన చేసి డాక్టరు పట్టం పొందిన గంగప్పగారి వంటివారే 'పిన్నమ్మ' పదానికి 'లక్ష్మి' అనే అర్థం వ్యవహారంలో లేదంటే ఎవరు మాత్రం ఏమనగలరు?

9. 'పేరంటాండ్రురు మంత్రవర పఠనాప్తిన్' (అ. 3. ప. 106) అనే చోట పూర్వ వ్యాఖ్యాతలు 'పేరంటాండ్రురు, మంత్రవర్ణ..' అని విడదీస్తే తాపీవారు 'పేరంటాండ్రు, ఉరుమంత్రవర్ణ—' అని విడదీసి 'ఉరుమంత్ర వర్ణ పఠనాప్తిన్=గొప్పవేద మంత్రముల పఠనముతో కూడినవారై—అనగా వేద మంత్రములను పఠించుచుూ. అని అర్థం వ్రాశారు. ఆయన 'కొందరు' పేరంటాండ్రురు' అని బహువచనమువీద బహువచనమును ఉంచి వ్యాఖ్యానించారు. ఈ బహువచనమువీద బహువచన ప్రయోగము చేమకూరకవికి అలవాటులేని క్లిష్టప్రక్రియ కాబట్టి 'ఉరుమంత్రవర్ణ పఠనాప్తిన్' అనుట సమంజసము' అని విమర్శించారు.

వ్యాకరణ సమ్మతంకాని ఎన్నో ప్రయోగాలు వాడిన చేమకూరకవి లాక్షణికులు అంగీకరిస్తూ ఉన్న 'పేరంటాండ్రురు'ను వాడి ఉండడనడంలో ఔచిత్యం లేదనీ, 'ఉరు' విశేషణం 'మంత్రా'లకు అనవసరమనీ, వాటిలో కొద్దివీ, గొప్పవీ అనే భేదంలేదనీ నేను తెలిపి ఉన్నాను,

గంగప్పగారు 'ఉరు మంత్రవర్ణ...' అనే తాపీవారి పదచ్ఛేదాన్నే సమ్మతిస్తూ, 'ఇక్కడ "ఉరు" శబ్దానికి 'మహిమాన్వితమైన' అని మాత్రమే తాపీవారి అభిప్రాయమనీ, ఆయన 'గొప్పదీ, కొద్దిదీ అని వింగడింపునకై ప్రయత్నించలేదనీ సమాధానమిచ్చారు. తాపీవారు 'గొప్పవేదమంత్రము'లని అర్థం చెప్పగా గంగప్ప గారే తాపీవారి అభిప్రాయం అది కాదనడం వింతగానే ఉన్నది. 'మహిమాన్వితమైన' మంత్రాలని అనుకున్నా—అన్ని మంత్రాలూ మహిమ కలవే కాబట్టి ఆ మంత్రాలకు వేరుగా 'ఉరు' విశేషణం అనావశ్యకమే అవుతున్నది.

10. 'సురభి రక్షణ కీర్తిసురభిళ దిఙ్మండ
లుండగు తదనుజన్ముండు దెలుప'
(ఆ. 3. ప 236)

అనేది 'మనుమార్గమున'—అనే సీసపద్యపు నాల్గవ పాదం. వెనుకటి పాదాల్లో 'మనుమార్గమున భూమి మనుమార్గము యుధిష్ఠిరుడు, వైరి పాటనక్రమము వృకోదరుడు, తురంగాధిరోహము నకులుడు తెలిపినట్లు చెప్పబడింది. ఎత్తుగీతిలో 'కోదండ పాండిత్య విలసనము తానె (అర్జునుడే) తెలిపినట్లున్నది. అందువల్ల 'సురభిరక్షణను సహదేవుడు తెలిపినట్లు చెప్పవలసి ఉన్నది. 'సురభి రక్షణ' అనేది వ్యస్తపదమే. అలా గ్రహించడమే అన్వయ పద్ధతి. 'గోవులను పోషించుట అనే కీర్తిచేత పరిమళించు చున్నట్లు చేయబడిన దిక్కుల సమూహము కలవాడు' అని ఏకపదంగా తీసుకుంటే 'తెలుపన్'కు అన్వయంకుదరదని నేను వ్రాశాను. గంగప్పగారు'సురభి రక్షణ'ను వేరుగా చెప్పనక్కరలేదంటున్నారు. అన్వయ పద్ధతిని ఎరిగినవారు ఎవ్వరూ ఆయనతో ఏకీభవించరు. 'తెలుపన్' అనే దానికి దేనితో అన్వయమో ఆయన చెప్పనేలేదు. సమన్వయం కుదిరిస్తే సమ్మతించవచ్చు. ఊరికే 'కుదురుతుంది' అంటే ప్రయోజనం లేదు.

11. అర్జునుని చక్కదనాన్ని వర్ణించే

'కమ్మని జాళువా నొరయం
గర్గ్గిన చెక్కుల మెక్కువాడు చొ
క్కమ్మగు జాతికెంపు వెల
గాఁ గొను మోవి మెఱుంగువాడు'—
[ఆ. I. ప. 135]

అనే పద్యం అర్థంలో తాపీవారు 'వెలగా=తెల్లదానిగా కొనున్=భావించును' అని విశేషార్థాన్ని చెప్పి, దానికి సమర్థకంగా 'వెల అన్నది వెల్ల అన్న మాటకు సూక్ష్మరూపము. తెల్లని అని అర్థము. 'వెలవెలలోనూ, 'వెల్వెల'లోనూ తెల్లని అన్న అర్థంలోనే 'వెల'రూపము కనబడుతూ ఉంది' అని వ్రాశారు. 'ఆమ్రేడితంగా ఉన్నప్పుడే—'వెలవెల' అన్నప్పుడే తెల్లదనం అనే అర్థం వస్తుంది గాని 'వెల' అనే దానికి రాదు'—అని నేను వ్రాశాను. ఈ పద్యంలో 'వెలగాన్' అనే ఉంది గాని ఆమ్రేడితంలేదు కాబట్టి విశేషార్థం స్ఫురించే అవకాశం లేదు. 'ఇక్కడ తాపీవారి ఊహ విశేషార్థాన్ని సూచిస్తుంది' అని గంగప్పగారి సమాధానం. అది ఎలా సమాధాన మవుతున్నదో బోధ పడకున్నది.

12. ప్రథమాశ్వాసంలోని 141 వ పద్యం—సీసంలోని ఎత్తుగీతిలో ఉన్న 'కంటసరి'ని వివరిస్తూ తాపీవారు 'కంటసరి (కుతిగంటు—కుత్తిగంటు) అను కంఠాభరణమును అవివాహితలగు స్త్రీలు మాత్రమే ఉపయోగిస్తారనీ, అది ధరించిన కాంత కన్యక అనీ గ్రహించాలి' అని వ్రాశారు.

'కంటసరి' కంఠాభరణమైనట్లున్నా దాన్ని కన్య వివాహిత అనే భేదం లేకుండా స్త్రీ లందరూ ధరిస్తూ ఉన్నట్లు ప్రబంధాలనుబట్టి తెలుస్తున్నదనీ అవివాహితలు ధరించేది మాత్రమే కాదనీ నేను తెలియజేశాను.

'తాపీవారు ప్రాంతీయమైన వాడుకనే యిందు గ్రహించారేమో!' అని గంగప్పగారి సమాధానం. ఈ సమాధానపు ఔచిత్యాన్ని పాఠకులే నిర్ణయించాలి.

13. తృతీయాశ్వాసంలోని 'చందురు జాతి బాగడపు' అనే 189 వ పద్యానికి తాపీవారు వ్యాఖ్య వ్రాయకుండా విడిచిపెట్టారు. ఎన్నో ఏళ్లు ఈ ప్రబంధాన్ని గూర్చి కృషిచేసి వ్రాయబడిన విపుల వ్యాఖ్యలో

దీనికిమాత్రం వ్యాఖ్యానం లేకపోవడం లోపంగా ఉన్న దని నేను వ్రాశాను. దీనికి గంగప్పగారు సమాధాన మిస్తూ 'దీనికి వ్యాఖ్య వ్రాయకపోవడం లోపమే! కాని అందుకు ప్రయత్నించడం కేవలం ప్రయాస అని మానుకున్నారు' అని వ్రాశారు. ఇది సరియైన సమాధానం కాగలదా?

14. 'అన్నపూర్ణా విశాలాక్షీ సనాథుం గాశీ విశ్వనాథుం దర్శించి' (ఆ. 1 సంఖ్య 193) అనే చోట తాపీవారు 'అన్నపూర్ణ అయిన విశాలాక్షి పేరు గల దేవితో కూడియున్న కాశీవిశ్వనాథుని పూజించి అని అర్థం వ్రాశారు. వారు వ్రాసినది సరికాదనీ అన్నపూర్ణ, విశాలాక్షి వేర్వేరు దేవతలనీ, 'దర్శించి' అన్నపదానికి 'పూజించి' అనే అర్థం చెప్పడం ఉచితం కాదనీ నేను వ్రాశాను. డాక్టర్ గంగప్పగారు 'అన్న పూర్ణను, విశాలాక్షిని ఒకరిగానే గ్రహించడం ఏమరు పాటున జరిగిందనే తలంచాలి. లేకపోతే ఆ మాత్రం వా రెరుగరా?' అని వ్రాశారు. ఈ వ్రాత సమాధాన మవుతుందో కాదో పాఠకులే నిర్ణయించాలి. గంగప్ప గారు 'దర్శించి=పూజించి'—అని తాపీవారు అర్థం చెప్పడం ఉచితం కాదని 'అంగీరస'గారనడం సముచితం కాదు. దేవతా దర్శనంలో 'పూజ' ఇమిడే ఉంది కదా!' అనిన్నీ వ్రాశారు. పూజలో దర్శనం ఇమిడి వుంటుంది. దర్శనంలో పూజ ఇమిడి ఉండదు. గుడికిపోయి దేవదర్శనం చేసుకున్నారంటే దేవుణ్ణి పూజించారని అర్థమా? దీన్ని ఎవరైనా ఆమో దిస్తారా?

15. ద్వితీయాశ్వాసంలో

'సీరియు నిటులా సౌనా
సీరియు నన్యోన్య సూక్తి జితమానసులై
పోరాని కూర్మి నుండగ
నా రాముని కడకు నంత హరి చనుదెంచెన్'

అనేది 117 వ పద్యం. ఇక్కడ 'జితమాన సులై' అనే దానికి బదులుగా 'సితమానసులై' అని పాఠాంతర ఉన్నది. తాపీవారు ఈ రెండు పాఠాలూ సరికావంటూ 'హితమానసులై' అనే పాఠాన్ని తీసు కుని 'స్నేహభావముతో కలిసిన మనస్సులు కలవారై' అని అర్థం చెప్పారు. ఇతరుల పాఠాలు బాగులేవ న్నారే కాని, తమ పాఠంలో యతి తప్పిపోయిందనైనా గమనించలేదు.

నేను చెప్పిన ప్రతిదానికీ సమాధానం ఇవ్వాలనే సంకల్పంతోనో యేమో గంగప్పగారు 'విశేషార్థ స్ఫుర ణార్థం శ్రీ తాపీవారు 'హితమానసులై' అనే పాఠం గ్రహించారు ......ఇది ప్రామాదికమే; సందేహం లేదు' అని వ్రాశారు. 'ప్రామాదికమే' అని ఒప్పు కుంటున్నప్పుడు విశేషార్థ స్ఫురణార్థం గ్రహించినటు చెప్పడం అనవసరమేకదా!

నేను సముచితాలుగా లేవని చెప్పినవాటి కన్ని టికీ గంగప్పగారు ప్రయత్నించి సమాధానాలు చెప్పారు. కాని, అవేవీ సముచితములైన సమాధానాలు కావని ఈ నా వ్యాసంవల్ల పాఠకులు గ్రహించగలరు. డాక్టరు గారు సంతృప్తికరములైన సమాధానాలు వ్రాస్తే అవి తప్పక శిరోధార్యాలు కాగలవని మనవి చేసుకుంటు న్నాను.

[ఇంతటితో ఈ చర్చ ఆపివేస్తున్నాము :
సంపాదకుడు.]

# ద్విపద - దాని ఛందస్సు

డా. బొడ్డుపాటి కుటుంబరాయ శర్మ

ఛందము వేదపురుషునకు గతి సాధనమ్మైన పాదద్వయము. మంత్రములు యయిన దేవతకు ఛందము, ఛాందకమగునని 'ఛంద్రాంసి ఛాదనాత్' అనుటనుబట్టి విదితమగుచున్నది. 'ఛందః పద్యే అభిలాషేచ' అని యమరకోశకర్త. అందుచే ఛందశ్శబ్దమునకుఁ 'బద్య'మనియు 'నభిలాష' మఁరియు నర్థములు గలవు. ఈ 'యభిలాష'యే కావ్యనిర్మాణ మఁదు ఛందోమయమ్మైన పద్యముల యుత్పత్తికిఁ గారణ మగును. అనఁగా 'నభిలాష' కారణము, పద్యము కార్యమునని తెలియఁగలము. కవియం దుద్భవించు రసభావముల సంయమనమునకు ననివార్యముగ కవి బుద్ధిలో గొంత ప్రయత్నము జరుగును. తత్ప్రయత్నముయొక్క సిద్ధి, సమత్వరూపమును దాల్పఁ గలదు. కవిబుద్ధి యా సిద్ధిని బొందినపుడు ఛందోవిర్భావము జరుగును. ఈ రీతిగఁ బాశ్చాత్యులు ఛందస్సునకు నభిలాషపరమ్మైన యర్థమును గూడఁజెప్పిరి. యోజింపఁగా, కవియొక్క యైచ్ఛికమ్మైన చిత్తవృత్తినుండి యనివార్యమునను నప్రయత్న సిద్ధము గను ననంతరూపములై వెలయు ఛందములును ఛందమయములైన వాక్యములును నిర్గతము లగుచున్నవి. అట్లే ఛందము అక్షర సంఖ్యా నియామకము గావు నను నక్షర పరిణామ రూపమే గావునను పదములు, పాదములునై పద్య (గద్య) రూపమును గూడఁ దాల్చుచున్నది. ఇట్లు మనము ఛందశ్శబ్దమునకుఁగల కార్యకారణ రూపమగు పద్యము, నభిలాషము నను వాని యర్థాఽద్వైత సమన్వయము చేయఁగలుగుచున్నాము.

కేవలమ్మైన యిట్టి ఛంద స్వరూప స్వభావములను గూర్చి యించుక తెలిసికొనుటచే నిఁక నాంధ్ర సాహిత్యములోని ద్విపద ఛందో రీతులను గు ంచి వివరముగఁ బరిశీలింతము. ఛందోబద్ధ రచనవలనఁ గలుగు ననుభూతి, కలాతత్త్వ సంబంధి యగుటచే ఛందస్సును శాస్త్ర దృష్టితోడనేగాక కళాతత్త్వ దృష్టితో గూడ పరిశీలింప వచ్చుచు. కాని మన యిప్పటి ప్రయత్నము శాస్త్ర దృష్టికి మాత్రమే నియతమ్మై యున్నది.

గీతికి లయ నిబద్ధత యెట్లో, పద్యమునకు ఛందోనిబద్ధతయు నట్లని గ్రహింపవలెను. 'ఛంద యతి ఆహ్లాద యతీతి ఛందః; ఛది ఆహ్లాదనే; సంతోషము పెట్టునది; ఆహ్లాదమును చేయునది' యని గురుబాల ప్రబోధిక[1]. అన్యత్ర వ్యాప్తమ్మైన శబ్దములలో నవ్యక్తముగానున్న లయను కావ్యములో ఛందస్సు, వ్యక్తము చేయుచున్నది. శ్రుతి, లయ, తాళ గుణములు మూఁడును ఛందో మూలములు. లయ సహజసిద్ధమ్మైనది; తాళము కళాధర్మముగా లయనుండి వర్ధిల్లిన గుణము. అనగాఁ, లయ మొదటి మెట్టు; తాళము రెండవ మెట్టు. అక్షరముల పరిమాణము లయగా పరిణత మగుననుట పారిభాషిక పద్ధతి. ఒకే ప్రమాణముగల మాత్రలయొక్క నడకపేరే లయ యనినచో, నది సులభముగ మనకు గ్రాహ్యమగును. లయ త్రిస (3 మాత్రలు) చతురస్ర (4 మాత్రలు) ఖండ (5 మాత్రలు)— మిశ్ర (7 మాత్రలు) సంకీర్ణ (9 మాత్రలు) గతులలో నుండుట పరిపాటి. ఇది సహృదయ పాఠకుని దనవెంట లాగికొనిపోయి యాతనియందు త్వరిత గతిలో రసోత్పత్తిని గలిగించుటకు సాధనమగు చున్నది.

---

1. పుటలు 707, 767. వావిళ్ల— (1953).

ఇఁక ద్విపద ఛందస్సును గుఱించి:—

స్వరములయొక్క యుదాత్తానుదాత్త స్వరిత భేదములనుబట్టియు నక్షర సంఖ్యను బట్టియు వైదిక భాషలో పద్యపాదము లేర్పడుచుండఁగా నాంధ్ర భాషలోని వృత్తముల పాదము లక్షర గణ సంఖ్యా నిబద్ధములై సంస్కృత భాషా సంప్రదాయమును బట్టియు ద్రావిడ భాషా సంప్రదాయమునుబట్టియు బరిణతిఁ జెందినవి. ఈ మాత్రాగణ నిబద్ధములైన జాతులలో షట్పద ప్రాస నియమము లేనివి యుప జాతులని లాక్షణికుల వర్గీకరణము. కావున ఛందో వేత్తల భావము ననుసరించి ద్విపద, జాతుల వర్గము లోనిది. జాతులు మాత్రాగణములచే నేర్పడుచున్నవి. సంస్కృతాంధ్రములలో మాత్రాగణముల విషయ మున భేదమున్నది. ఆంధ్రములోని సూర్యేంద్ర చంద్ర గణములలో మాత్రా సంఖ్యా నియమము లేదు; వీనిని ప్రస్తారము చేయునపుడు లఘువులతో మొదలయ్యెడి గణముల మొదట నదనముగా నొక లఘువును జేర్ప వలెను:—

'వినుత ద్వి త్రి చతుర్గురు
జనిత గణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను, నక్కర జాతుల కె
ల్లను నాదిమ లఘువు! మొదల లఘు విడ
వలయున్'

అని కవిజనాశ్రయము. ఇట్లు రెండు, మూఁడు, నాలుగు గురువులు పెట్టి వేర్వేఱు వర్గములుగా ప్రస్తరించి చూచినచో, 'కవిజనాశ్రయ'—'కావ్యాలంకార చూడా మణి' కర్తలవి మతములో సూర్యగణములు నాలుగు, ఇంద్రగణము లెనిమిది, చంద్రగణములు పదునాఱు నని తేలుచున్నది. అనంతాదుల మతమునఁ గూడ నీ గణ నిర్మాణ మిట్లే గాని, పైని ప్రతివర్గము నుండియు రెండేసి గణములను [అనఁగా, సూర్యగణ ములనుండి గగ-స—గణములను; ఇంద్రగణములనుండి మ—సగ—గణములను; చంద్రగణములనుండి మగ— సగగ—గణములను] తొలఁగింపఁగా వరుసగ మిగిలిన రెండు—ఆఱు-పదునాల్గు—గణములు గల వర్గములే సూర్యేంద్ర చంద్రగణములని స్పష్టమగుచున్నది.

'గల—నగణము లినుఁ డింద్రుఁడు
నల-నగ—సల భ,ర,త లింక నగగ—నహ—సలా
భల—భగురు—మలఘు, నవ, నహ
తల, రల, సవ, నలల, రగురు, తగ, లిందుఁ
డజా!'[3]

'ఇంద్ర గణములు మూఁడిన గణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్ప రేవ!'

అని 'కవిజనాశ్రయము' ద్విపద లక్షణము నిచ్చు చున్నది. ఈ గ్రంథము లోకమునకు లభించిన యాంధ్రచ్ఛందో గ్రంథములలో మొదటిది. ఒక్కొక్క పాదమునందును మూఁడింద్రగణములు నొక సూర్య గణమును గ్రమముగ నుండవలెనని 'కవిజనాశ్రయము' చెప్పిన ద్విపద లక్షణము విషయములో లాక్షణి కులయం దభిప్రాయభేద మున్నది. 'కవిజనాశ్రయ'— 'కావ్యాలంకార చూడామణి' కర్తల మతమున మ—సగ— యను నింద్రగణములును, గగ—స—యను సూర్య గణములను ద్విపదలో నుపయోగించుట తప్పు గాదు. పాల్కురికి తన ద్విపదలో:—

'పాయక శ్రుతి 'రసానృక్త స్య జిహ్వా
గ్రే'యని యే ప్రొద్దు ప్రమోయుఁ గావునను'—

అనుచోట 'గగము'ను సూర్యగణముగాను;

'అంధక కరిదైత్య వ్యాఘ్ర లాలాజ'—

అనుచోట సగురువును నింద్రగణముగాను ప్రయో గించి యున్నాఁడు అనంతాదులు చెప్పిన సూర్యేంద్ర గణములను బురస్కరించుకొని చూచినచో, పైనఁ జెప్పిన సోమనాథుని ద్విపదలు లాక్షణిక సమ్మ తములు గాక పోవలెను. కాని, దేశియచ్ఛందములలో నక్కరజాతి పద్యముల యందు (అక్కరేతరవి వేఱు) గగస—గణములను, మ—స గురువు—గణములను సూర్యేంద్ర గణములుగఁ గ్రమమున వాడవచ్చునని 'కవిజనాశ్రయ' 'కావ్యాలంకార చూడామణి' కర్తల పలుకు. ఆ కారణముచే 'పాల్కురికి' వి పై ద్విపదలు లాక్షణిక సమ్మతములే యగుచున్నవి. ఇంతేగాదు. సూర్యేంద్ర గణముల విషయమున నర్వాచీనులైన యనంతాదుల మతముకంటెఁ బ్రాచీనులైన 'కవి జనాశ్రయ'— 'కావ్యాలంకార చూడామణి' కర్తల మతమే గ్రాహ్యము.

మాత్రాగణములు —

---

2. విన్నకోట పెద్దన 14 వ శతాబ్ది.
3 ఛందోదర్పణము, ఆ 1—ప 19.

సూర్యేంద్ర చంద్రగణములని వ్యవహరింపక మాత్రా సంఖ్యనుబట్టి చూచినచో ద్విపద పాదములో చతుర్మాత్రా గణములుగాని, పంచమాత్రా గణములు గాని, వీని కలగలుపుగాని, యుండునట్టి మూఁడు గణములును, నంత్యమునఁ ద్రిమాత్రాగణ మొక్కటియు నుండఁగలవు. అనఁగా, ద్విపద పాదముయొక్క నాల్గు గణముల మొత్తమును బదునెనిమిది మాత్రలకు మించదు; పదునైదు మాత్రలకుఁ దగ్గదు.

ద్విపద దేశీయత:—

తెలుఁగునందలి ద్విపదను విన్నకోట పెద్దన యొక్కఁడే 'ద్విపది' యని వ్యవహరించుట జరిగెను.

> శక్రత్రయంబును సవిత్ప్రండుఁ బాద
> విక్రీడికులు మృదు ద్విపదికి నెపుడు......
> వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని...[4]

అందుచేతనే కొందఱు పొరపడి, దేశీయ చ్ఛందమైన ద్విపద ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనఁబడినదని డా. నేలటూరి వేంకట రమణయ్య గారనిరి. 'సంగీత రత్నాకరము'న[5] నాల్గుపాదములును బాదమునకుఁ దొమ్మిది గణములును గలదిగా జెప్పఁబడిన శుద్ధ ద్విపదికయుఁ దెలుఁగు ద్విపదయు లక్షణమునుబట్టి చాల భేదముగల ఛందములు. ఆంధ్రమున ద్విపద కావ్యపిత యనఁబడిన పాలుకురికి:—

> '......................అవి ప్రాస నియతి
> దప్పకుండఁగ ద్విపదలు రచియింతు'—

నని ద్విపదలోని 'ద'యను నక్షరమును యతిస్థానమున నిలిపి ప్రాసరాహిత్య ప్రయోగమును జేసినాఁడు. సంస్కృతమున వేదవాఙ్మయములలో రెండు పాదములుగల 'ద్విపదా విరాట్, ద్విపదా జగతీ' వంటి ఛందో విశేషము లున్నను లౌకిక వాఙ్మయములో సమస్త పద్యములకును నాల్గుపాదము లుండుట నియతమైన లక్షణము. కాని, యా నియతి దేశీయచ్ఛందస్సులకుఁ జెల్లదు. త్రిపద, చౌపద (నాల్గుపాదములు), షట్పది (ఆఱుపాదములు) వంటి దేశిచ్ఛందములు పాద సంఖ్యను బట్టియే యేర్పడినవి. పై ఛందస్సులకున్న పేళ్లను బట్టి చూడఁగా దేశీయ చ్ఛందస్సులకుఁ బాద నియతి లేదని తెలుచున్నది. ఏ పద్యము గాని నాలుగు పాదములు మించినచో నా పద్యము పేరిటి మాలికగా దానిని వ్యవహరింతురు. ఉత్పలమాలిక, చంపకమాలిక— వంటి విట్టివే! ద్విపద, రగడలయం దధిక పాదము లున్నను 'ద్విపద మాలిక, రగడ మాలిక'యని యెవ్వరు ననరు. పైఁగా వీనిలో నెప్పుడును బాదములు సరిసంఖ్యలోనే యుండును. నాల్గుపాదములుగల ద్విపదిక నుండి రెండు పాదములుగల ద్విపద పుట్టినదనుకొనిన వారిది పొరపాటు; అది ఛందస్సంప్రదాయ విరుద్ధము. 'హయప్రచార రగడ'ను రెట్టించినచో 'తురగ వల్గన రగడ' యనుటయు, 'వసుధ'వృత్తమునకు నిబ్బడి రూపముగా 'తోటక వృత్తము' వెలయుటయు 'విచిత్ర వృత్తము'ను ద్విగుణీకరించినచో 'భుజంగ ప్రయాత' మేర్పడుటయు వంటి నిదర్శనములు మన పై యూహకుఁ బ్రాణము పోయు చున్నవి.

పోఁగా, జంఝలా నామకమును నొక గీతి భేదముగా భరతుడు చెప్పినట్లు వాచస్పత్య నిఘంటువు పేర్కొను శుద్ధ ద్విపదికయు,[6] గీతి విశేషముగా 'విక్రమోర్వశీయ' ముటంకించు ద్విపదికయు, నా 'విక్రమోర్వశీయము'ననే లక్ష్యముగా నీయఁబడిన (ప్రాకృత) 'జంభలిక'యు నొక్కటియే కావచ్చునని మాటవరుస కనుకొన్నను, ప్రతిపాదమునను బదునైదు మొదలుకొని పదునెనిమిది మాత్రల వఱకుఁగల 'ద్విపద'యు, ప్రతిపాదమునను బదమూఁడు మాత్రలు మాత్రమేయుండు 'జంభలిక'యు నొక్కటియే యగుట దుస్సాధము. ఇట్లే, సంస్కృత ప్రాకృతముల యందు ద్విపద లనఁ బడువానిలక్షణము లున్నవి యున్నట్లుగా దెలుఁగు ద్విపద లక్షణములతో సంవదింప జాలవని నిరూపింప వచ్చును. ఈ రీతిగనే 'మానసోల్లాసము'[7]నందలి 'ద్విపదిగ' లక్షణమును దెలుఁగు ద్విపదకు సరిపడుట లేదు. కాఁగా, 'సంగీత రత్నాకర వ్యాఖ్యాన' (కళానిధి) కర్తయగు 'కల్లినాథుఁడు 'ద్విపథకము'నే 'దోధకమ'ని పిలిచెను.

---

4. కావ్యాలంకార చూడామణి -- అష్టమోల్లాసము—ప 61.

5. అధ్యా 4. సూత్ర 114—ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి.

6. 'శుద్ధ ద్విపదికా గీతి ర్జంభతే త్వభిధీయతే'—భరతః'

7. పుటలు 290—291.

౬. దోధకపాదమునందలి చివరి గురువును లఘువుగా జేసినచో నది ద్విపదపాద మగునుగాని, 'దోధకము'న భగణప్రయోగము విహితము; మన 'ద్విపద' యందది య్యైచ్ఛికము. ఇక 'రత్నావళి'యందు ప్రాకృత ద్విపదీ ఖండమునకు లక్ష్యము కలదు. దానినిబట్టి యందు పాదమునకు పదునూఱు మాత్రలుండ వలెను; మఱి తెలుఁగున ద్విపదపాదమునకు కనీసము పదునైదు మాత్రలుగదా! కావున నీ రెండును నొక్కటి గావు. ఇంకను 'సంగీత చూడామణి' (జగదేకః) యందలి సంస్కృత 'ద్విపదిగ'యే ప్రాకృతమున 'దోహా' యగుచున్నను, వాని వానికి లక్షణ విషయమున భేదము కలదు. తెలుఁగు ద్విపద పాదములోని మాత్రల సంఖ్యకీ రెండును భిన్నములైనవి. రెండు పాదములకు లక్షణ సామ్యము కల్గినవన్నియు ద్విపదలను భావములతో పైని పేర్కొనఁబడిన సంస్కృత ప్రాకృత ద్విపద భేదము లన్నియు ద్విపదలె కావచ్చును. ఐనను దెనుఁగు ద్విపద లక్షణము వానికంటె విలక్షణమైనది.

అట్లే, 'దువయి - దువలిగ—దువది' మున్నగు పేళ్లతో బిలువఁబడు కన్నడ ఛందములోని ద్విపదలకును, 'దోఅఇ' అనఁబడు ప్రాకృత పద్యములకును, తమిళ ఛందములో ద్విపద తుల్యములై 'అహవల్పా' లనఁబడు వానికిని, లక్షణము తెలుఁగు ద్విపద లక్షణముకంటె భిన్నమై యున్నది. తెలుఁగు ద్విపద దేశియ చ్ఛందము. దానికి పైనఁ జెప్పఁబడిన సంస్కృత ప్రాకృతములలోగాని, కన్నడ తమిళములలో గాని ద్విపద భేదము లనఁదగు వేనితోడను జన్య జనకభావ సంబంధము లేదు. అందుచేతనే ద్విపదను జాతిచ్ఛందముగ నాంధ్ర లాక్షణికులు పరిగణించుట.

ద్విపద ప్రాచీనత:—

ద్విపద చ్ఛందస్సును పాల్కురికియే సృష్టించె నని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు రనుటయం దభి ధార్థముకంటె నభిమానమే మెండు. ఏలన. క్రీ. శ. 9 వ శతాబ్దికే తెలుఁగు శాసనములలో పద్యము లున్నవి. నేటివఱకు నాంధ్రలోకము జిహ్వాగ్రములపై నాట్యము సలుపుచుండు పాటలు, పదములు మున్నైన దేశియ రచనలు నూటికి తొంబదిపాళ్లు ద్విపదలును తద్భేదములునునై యున్నవి గదా! అటు పాడఁదగిన పదకవిత్వ లక్షణము కొంతయు నిటు పఠింపదగిన పద్యకవిత్వ లక్షణము కొంతయు సంతరించుకున్నది ద్విపద; అందులకే కొంత గేయమును గొంత పాఠ్యమును నైనదనుట. గీతికిని బద్యమునకును బొత్తు కుదిర్చిన ద్విపద యా రెంటికిని నడిమికాలమునందు పరిణామ దశలో నేనాడో పరిధవిల్లి యుండునుగాని, తొమ్మిదవ శతాబ్ది దాఁటి పాల్కురికి కాలమువఱకును బరిణతి నొందకుండునా? క్రీ. శ. ఆఱవ శతాబ్ది దగు పొట్లదుర్తి—మాలెపాడు శాసనమునందు:—

'అణపోతులు రేవణ కాణ పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్వాతె ఇశె రేణికిన్'

అను రెండు పంక్తులలో 'ద్విరద గతి రగడ' లక్షణము కొంత గర్భితమై యున్నది. ద్విపద గతి రగడ, మధుర గతి రగడల వంటివి సంకుచిత లక్షణములు గలిగి విస్తృత లక్షణ లక్షితమైన ద్విపదనుండి యుద్భవించుట ఛందః పరిణామమున సహజము. అందుచే క్రీ శ. ఆఱవ శతాబ్దికే ద్విరద గతి రగడ వంటిది యుండెననఁగా, ద్విపద యంతకు మునుపే యాంధ్రజాతి చరిత్రతోబాటుగ నావిర్భవించి జానపద కథా గేయముల రూపమునను, పెక్కుపదములు పాటల రూపముననను, ప్రోది సేయఁబడి యుండవలెను.

క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దికే [848-892] యద్దంకి శాసనములో 'తరువోజ' ప్రయుక్తమైనది గదా! కావున తరువోజకును సీసమునకును మూలమగు ద్విపద యంతకుఁ బూర్వమే వ్యాప్తినొంది యుండు ననుట స్పష్టము. ఒక్క ద్విపదపాదమును రెట్టించిననో, తరువోజపాద మేర్పడును. తరువోజ పాదములోని మధ్య సూర్యగణమును చివరకు మార్చినచో సీస పద్యపాద మేర్పడఁగలదు. అంతే గాదు:—

'కవితారసపు జల్లు—ఖడ్గాల గలుగల్లు
కరిణాలకే జెల్లు—నో,! కూనలమ్మ!......
కాపువాడే రెడ్డి—గరికపోచే గడ్డి
కానకుంటే గుడ్డి - యో,! కూనలమ్మ!'

వంటి [కూనలమ్మ] పదములలో స్థితము మొదటి పాదము, సీసపద్యపాదములోని ప్రథమ భాగము; రెండవ పాదము ద్విపద పాదము. అనఁగా, సీసపద్య ప్రథమ పాద భాగమునందు కంటె, ద్విపద పాదమునం దొక మాత్ర తక్కువ. అయినను నీ మాత్రాలోపము కడ

పటి గణములలో గలుగుచున్నది గావున నంతగా గుర్తింప వీలుండదు.

మధ్యాక్కరయు ద్విపద భేదమే! మధ్యాక్కర పాదమందు వరుసగా రెండింద్రగణములు నొక సూర్య గణము మఱల రెండింద్రగణములు నొక సూర్య గణము మొత్త మాఱుగణములు. ఇట్లు ద్విపదగతి రగడయు తరువోజయు సీసమును మధ్యాక్కరయు వంటి తెలుగు దేశిచ్ఛందములకు ద్విపద ప్రాతిపదిక యనుట విస్పష్టము. త్రిపదిని షట్పదిని కూడ నించుక మార్పుతో ద్విపద భేదముగఁ జేయవచ్చును. అందుచే రగడలు తప్ప ద్విపదవలె బహుఛందస్సులకు మూలమ్మైన పద్య మాంధ్ర సాహిత్యములో మఱి యొకటి లేదు.

ప్రాచీన లక్షణ గ్రంథములలో ద్విపద:—

పాల్కురికి తన ద్విపద కావ్యములయందు ద్విపద లక్షణమును గుఱించి 'అనియత గణై:', 'ప్రాసోవా' — 'యతిర్వా',—ఇత్యాదిగా జెప్పుటను బట్టియే ద్విపద యాతనికిఁ బూర్వమే లక్షణవంతమై కావ్యములలోని కెక్కిన ట్లూహింపవచ్చును. కాని తెనుఁగులోని తక్కిన లక్షణ కర్తలకుఁ బాల్కురికి సోమన చెప్పిన ద్విప దయే ముఖ్యముగ నాధారము.

మంజరీ ద్విపద—గేయ లక్షణము:—

ప్రాస నియమములేని ద్విపద, మంజరీ ద్విపద. కవిజనాశ్రయకర్త రేచన, మంజరీ ద్విపదను పేర్కొననే లేదు. విన్నకోట పెద్దన 'వలదు ప్రాసం బంద్రు వరుస మంజరికి'[8]నని మంజరిని ద్విపద భేదముగ సూచించెను. అనంతుఁడు[9] మంజరిని ద్విపద భేదముగ నంగీకరించి దానికిఁ బ్రాసనియతి యుండదనియు నేపాద మున కాపాదమే తెగినట్లుండవలె ననియు నభిప్రాయ పడినాఁడు. గేయములయందు లయానుసారియైన మాత్రా సంఖ్య మాత్రమే నియతముగాని ప్రాసాదు లన్నియు వైచ్ఛికములు ప్రాసనియతి లేకుండుటచే మంజరీ ద్విపద, పద్యమునకు కంటె, గేయమునకే సన్ని హిత మగుచున్నది. రెండు పాదములుగల పద్యమునకే ద్విపద నామము రూఢి యగుచుండఁగా నేకపాదముగల పంక్తికి 'ద్విపద' యనుపేర చెల్లరాదు. కాని, యొక్క పాదమునం దైనను లక్షణము ద్విపదదే గావున మంజ రికిఁ గూడ'మంజరీ ద్విపద' యనియు, 'ద్విపద మంజరి' యనియు లాక్షణిక వ్యవహారము. ప్రాసనియతిని బురస్కరించుకొని ద్విపదకుఁ బద్యత్వమును బాగుగఁ జేకూర్చినవాఁడు పాల్కురికి సోమనాథుఁడు. అట్లే, ప్రాసనియమముండు జాతులలో బ్రాసయతి నిషేధ మైనను ద్విపదకు తాళలయాను గుణ్యమును సమ ధికముగ సమకూర్పనెంచి కాబోలు ప్రాసయతిని గూడఁ బ్రయోగించినవాఁడు సోమనాథుఁడు. తాళ్ల పాక చిన్నన్న కాదన్నను జనవ్యవహారమందున్న ద్విపద రూప గేయములను బట్టి రామోగాని, పోను పోను 'లయహారి'—'లయ విభాతి'—'లయగ్రాహి'—త్రిభంగి ఇత్యాది వృత్తములలో సైతము ప్రాసయతి నెల కొన్నది.

'అమ్మగ్గి కన్నులు—తమ్మి పువ్వులు.
తమ్మి పువ్వుల లోని—కమ్మదే నెల్లు'—

జనవ్యవహారమునఁగల ద్విపదరూప గేయమునఁ బ్రాసయతి కిది యుదాహరణము. ఇట్లే, కొన్ని సామె తఁయందును బ్రాసయతిని గుర్తింపవచ్చును.

(1) అత్త లేనికోడ—ఉత్తము రాలు.
(2) ఇల్లు కట్టిచూడు—పెళ్లిచేసి చూడు.
(3) ఇదిగో తోఁకంటే—అదిగో పులి అంటాం.

కాని, మొత్తమువిూదఁ గేయములయందు మాత్రము ప్రాసయతి నియతము గాదు; ఐచ్ఛికము మాత్రమే! ఐనను లాక్షణికులు ద్విపద, మంజరీ ద్విపదలయందు ప్రాసయతిని నిషేధించిరి.

ద్విపద—పద సంక్రమణము:—

ద్విపదయందు మొదటి పాదములోని తుది పదము రెండవ పాదములోనికి సంక్రమించుట యను నది సోమనాథునియందే, యందును బసవపురాణ ములోకంటె, పండితారాధ్య చరిత్రలో యధికముగ జరిగెను. ఏక ద్విపదలో నిట్టి సంక్రమణమును గొంతవఱ కంగీకరింప వచ్చునేమో గాని, భిన్నద్విపదా సమ్మేళన రచన సాధువు గాదు. సోమనాథుఁడు దీనికి భిన్నముగ రచించుట, ద్విపదకు వృత్త ప్రతిపత్తి చేకూర్చు నిమిత్తమే యనఁదగును.

---

8. కావ్యాలంకార చూడామణి—ఉల్లా 8— ప 61.

9. ఛందోదర్పణము, అశ్వా 3- ప 49.

# ప్రమోద ప్రమాది

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రీ చతురాననుం డెవని శ్రీకరనాభి జనించి మించి వ్యా
కోచ పవిత్రమానస ముఖుం డయి వేదమయ ప్రపంచమున్
దీ చతురత్వ మింపొదవ నిల్పె నతండు ముకుందుఁ డీ 'ప్రమా
దీచ' శుభాబ్ది నెల్లరిని దేల్చును గాక కృపాంతరంగుఁడై.

పావన ధర్మబద్ధగుణ భారతవర్ష జనాళికిన్ 'బరీ
ధావి' యొసంగె గౌరవము ధన్యతఁ గూర్చె మహా జయంబునన్;
కేవల మాంధ్రదేశమునకే తుద కిచ్చెను జాల క్షోభ నా
నా విధ కష్టనష్టములు న్యాయవిహీనత నింద్యవర్తనన్

అన్నలుఁ దమ్ములట్లుగను నన్ని విధంబుల నుండి సర్వ సం
పన్నులుగా మనంగఁ దగువారలె లేక సుదూరదృష్టి యా
త్మోన్నతి వీడి స్వార్థపరు లొక్కటనై కపట ప్రవర్తులై
ఖిన్నత నాత్మనాశనము క్రించు దనంబు గడించి రల్పులై.

స్వార్థపరత్వ మన్ పెనుపిశాచము సోఁకినవారి బుద్ధి ని
స్స్వార్థ మెఱౌను? జీవితము శాశ్వతమే? లఘుబుద్ధి గొప్పయే?
స్పర్థ సహోదరావళిని సౌఖ్యదమే? మఱి యీ య భాగ్యులున్
వ్యర్థులు తీర్చిదిద్దరె? భావిచరిత్రము వర్తమానమున్?

పరమపవిత్రమున్ సకలభాగ్యదమున్ శుభసన్నిధానమున్
సురుచిర మాంధ్రదేశము యశోధనధర్మ విశేష విజ్ఞతా
కర వర సాహితీ ప్రథిత కల్పక మౌనటులన్ 'ప్రమోది' వై
పరగవలెన్ 'ప్రమాది' వయి వర్తిల కో నవవర్ష రాజమా!

నీ రాజ్యంబున నాంధ్రరాజ్యరమ యున్నిద్రంబు శోభాఢ్యయై
శ్రీ రంజిల్లఁ జెలంగఁగా వలయు వర్షింపం గదే నీ మహా
ధారా వాహిక సత్కటాక్షసుధ శాంతం బద్వితీయంబునై
మా రమ్యాంధ్ర సరస్వతీ జనని కామ్యంబుల్ ప్రసాదించుతన్!

---

# ఆచార్య నాగార్జునుడు

శ్రీ ఎ. వి. ఎస్. ఆర్. శాస్త్రి

విశ్వ సంస్కృతి ఒక మహాప్రవాహము వంటిది. వివిధ భూములనుండి వచ్చు వివిధోపనదులై మహాప్రవాహమున జేరి నానాట దానిని బలీయ మొనర్చినవి. ఒక్కొక్క కాలమున నొక్కొక్క దేశము ప్రముఖత వహించి తన విజ్ఞాన స్రవంతినీ మహాప్రవాహమున సంగమింప జేసినది. వేదకాలమున సప్తసింధుప్రాంతము బుద్ధదేవుని కాలమున కోసల, కాశీ, మగధ ప్రాంతములు, గ్రీకు తత్త్వవేత్తల కాలమున యవన భూమి, టోలమీల కాలమున అలెగ్జాండ్రియా యిట్టి పుణ్యమునకు నోచుకున్నవి. విశ్వ సంస్కృతీ చరిత్రయందు గణనీయ స్థానమున పెంపొందియున్నవి.

అట్టి భాగ్యమే కృష్ణాతీర ఆంధ్రభూమికి క్రైస్తవ శకారంభ కాలమున సిద్ధించినది. ఇచట నానాడు బయలుదేరిన మహాయాన మాధ్యమిక వాదము, తత్త్వశాస్త్రమున నొక నూతన యుగమునకు ప్రాతిపదిక వేసినది. దీని మూలస్థానము శ్రీ పర్వతము. ఆవాద ప్రవక్త శ్రీ నాగార్జునుడు. ఆ శ్రీ పర్వతమే నేటి నాగార్జునకొండ. ఆ నాగార్జునుడు బౌద్ధమత పీఠాధిపతులలో పదునాలుగవ వాడు.

ఈనాడు నాగార్జునకొండ ప్రాంతము చైతన్య రహితము. కానీ, ఆనాడది ఒక పుణ్యస్థలి. ఒక మహావిహారము. ఒక సుప్రసిద్ధ విద్యాపీఠము.

నాగార్జునుని చరణ సన్నిధిన తత్త్వరహస్యముల గ్రహించుటకు నేల నాలుగు చెరగులనుండి జిజ్ఞాసువులానాడు అచ్చటికి వచ్చెడివారు. వివిధ దేశముల ప్రభువులు, తమ దేశీయులగు విద్యార్థుల వసతి నిమిత్తము విహారముల గట్టించిరి. అట్టివానిలో సింహళ దేశీయుల విహార మొకటి యున్నదను విషయము నేటి త్రవ్వకములవలన తెల్లమగుచున్నది.

దరిదాపుననే, ఇక్ష్వాకుల రాజధాని విజయపురి యుండెడిది. దాని శిథిలావశేషములు నేటి త్రవ్వకములలో సుస్పష్టమగుచున్నది. ఆనాటి ఇక్ష్వాకులు ఆంధ్ర శాతవాహనుని సామ్రాజ్య సామంతులు. శాతవాహన ప్రభువు నాగార్జునునికి ఆప్తమిత్రుడు.

ఈ విధముగ, ఆంధ్ర ప్రభువుల, వారి సామంతులగు ఇక్ష్వాకుల ఆదర సహకారముల చలువను మహాయాన మాధ్యమికవాదము పెరిగి పెద్దదై చైనా, మధ్యఆసియా, కొరియా, జపాన్, టిబెట్టు దేశములకు వ్యాపించినది. నాగార్జునకొండ గురించి, నాగార్జునుని గురించి మనకు తెలియవచ్చు విశేషములు ఇవి.

కాలగర్భమున కలిసిపోయిన నాగార్జునుని చరిత్రను గురించి, మనకీ స్థూలవిశేషములు చైనీయ, టిబెటీయ, బౌద్ధమత గ్రంథముల సాయమున మాత్రమే నేడు లభ్యమగుచున్నవి. చైనీయ గ్రంథస్థ విషయములు గ్రహించుటకు వాని ఆంగ్లానువాదములే మనకు శరణ్యము. టిబెటీయ గ్రంథములకు హంగేరి యను రచయిత రచించిన జర్మను అనువాదములును, వాని ననుసరించిన ఆంగ్ల గ్రంథములును దిక్కు.

చైనీయ, టిబెటీయ భాషలలో గల గ్రంథములను ఈ వడపోతలతో నిమిత్తము లేకుండా, భారతీయ భాషలలోని కనువదించుటకు భారత ప్రభుత్వము పూనుకొన్నదా, లేదు. నాగార్జునుని సమగ్ర చరిత్రను రచించుటయందాసక్తిగల ఆంధ్ర ప్రభుత్వమే పూనుకొనుట సమంజసము.

ఇక భూగర్భమున దాగియున్న ఐతిహాసికాధారముల విషయమున నాగార్జునకొండ ప్రాంతమే మనకు శరణ్యము. పురావస్తు పరిశోధనవా రిప్పటివరకు జేసిన త్రవ్వకములవలన లభ్యమయిన ఆధారములు కొంత విలువగలవే యైనను, నాగార్జున చరిత్ర రచించుటకు సాయపడునవి బహుకొద్ది మాత్రమే. ఈనాడీ త్రవ్వకముల వలన మనకు లభ్యములయిన దానశాసనము లన్నియు మాఢారీపుత్ర శ్రీవీరపురుష దకుడను ఇక్ష్వాకురాజు పరిపాలనకాలపు దరిదాపుల లోనివే. ఇవి యన్నియు క్రీస్తు తర్వాత మూడవ శతాబ్దములోనివి. ఆనాటికి శాతవాహన సామ్రాజ్య మంతరించినది. ఇక్ష్వాకుల స్వతంత్రు లయినారు.

మరొక విశేషమున్నది. ఈ శాసనముల కాలము నాటికి బౌద్ధ మతమునకు రాజాదరణ లేదు. రాజు లందరు వైదిక మతాసక్తులు. రాణులు మాత్రమే బుద్ధదేవుని ఉపాసిస్తున్నారు. అందువలన ఆ నాటికే బౌద్ధ బ్రాహ్మణ మతముల మధ్య సమన్వయ మారంభమయ్యెనని నిర్ణయించవచ్చును. రాణుల ఆదరణ మాత్రముననే, ఈ మహావిహారములు, స్తూపములు నెలకొనబడినవనియు మనము జెప్పజాలము.

ఇట్టి మహా విహారముల నిర్మాణమున కావశ్యకమగు బౌద్ధమతాసక్తి ఆనాటి ప్రభువులలో లేవని తెలియుటచే, వీని నిర్మాణమునకు మన మింకను వెనుకకు బోక తప్పదు. చైనీయ గాథల ననుసరించి యీ విహారములను ఆంధ్ర శాతవాహనరాజు నాగార్జునుని కొరకై కట్టించెనని తెలియుచున్నది. కానీ, ఆ శాతవాహన ప్రభు వెవరు?

నాగార్జునకొండ త్రవ్వకములలో యిక ముందు వేరుగ ఆధారములు లభించు వరకును, మనకున్న సామగ్రితోడనే నాగార్జునుని కాలమున అతని నాదరించిన శాతవాహనరాజు కాలమును నిర్ణయించవలసి యున్నది. కొందరు ఈ శాతవాహన ప్రభువు యజ్ఞశ్రీ యనిరి. యజ్ఞశ్రీ కాలము క్రీ. శ. రెండవ శతాబ్దినే నాగార్జునుని కాలముగ గ్రహించిరి.

కానీ, నేడు నాగార్జునకొండనద్ద లభ్యమగుచున్న శాసనములు, చైనీయ బౌద్ధమత చరిత్రయును, ఈ వాదమునకు విరుద్ధముగా నున్నది.

చైనీయ, బౌద్ధమత చరిత్ర ననుసరించి జూడ, హిందూదేశమున బౌద్ధమత పీఠాధిపతులు ఇరువదిముగ్గురు క్రమక్రమముగ అధికారము వహించి నారనియు, అందులో పదునాలుగవవాడు నాగార్జునుడనియు, కడపటివాడు బౌద్ధ ధర్ముడనియు తెలియుచున్నది. బోధిధర్ముడు తన కాలమున భారతదేశమందు బౌద్ధము హీనస్థితియందుండుటచే చైనాకు వెళ్లె నందురు. అంతటితో భారతదేశమునందే పీఠ మంతరించినది.

బోధిధర్ముడు చైనాకు పోయినది క్రీ. శ. ఐదువందల ఇరువది యారులోననికూడా ఈ గ్రంథము వలన తెలియుచున్నది. నాగార్జునుడు బుద్ధుని తర్వాత నాలుగువందల సంవత్సరములకు జన్మించెనని ఈ గ్రంథములే చెప్పుచున్నవి.

బుద్ధునినుండి బోధిధర్ముని కాలమునకు దాదాపుగ వేయి సంవత్సరములగునని యందురు. ఈ మధ్యకాలమున ఇరువది ముగ్గురు పీఠాధిపతు లుండుటచేత, యీ విధముగ లెక్కించినను పదునాలుగవ పీఠాధిపతియైన నాగార్జునుడు బుద్ధుని తరువాత నాలుగు, ఐదు శతాబ్దములలో అనగా క్రీ. పూర్వము ఒకటవ శతాబ్దిలో నుండుననియే తెలియుచున్నది.

ఇక యిప్పటికి లభించిన శాసనముల విషయ మిదివరకే ప్రస్తావించినాము. క్రీ. శ. మూడవ శతాబ్దిలోనివగు యీ శాసనమువలన నా కాలము బౌద్ధమతమున కత్యుచ్చకాలమని చెప్పుటకు వలను పడకున్నది. యజ్ఞశ్రీ కాలమునకును, ఈ శాసన కాలముకును గడచిన అంతరము నూరు సంవత్సరముల లోపలనే యుండును. నాగార్జునుడు యజ్ఞశ్రీకి సమకాలికుడే యగునెడల అతని కాలమున బౌద్ధమతము ఆంధ్రప్రాంతమున నత్యుచ్చస్థితి యందుండెనని అంగీకరింపక తప్పదు. అట్టి సందర్భమున యిక్ష్వా

కుల కాలము నాటికి అనగా వంద సంవత్సరముల లోపలనే అది బ్రాహ్మణ మతమునందంతర్లీనమై పోవు స్థితికి వచ్చినదనియు నిశ్వసింపజాలము.

ఇదియునుగాక, యజ్ఞశ్రీ కాలమున బ్రాహ్మణ మ ము పునరుజ్జీవిత మైనదనియు, మత్స్యపురాణ మా కాలముననే సంగ్రదితమైనదనియు తెలియు చున్నది. అట్టివాడు బౌద్ధ గురువు నాదరించి పోషించెననుటయు దుర్లభము. యజ్ఞశ్రీ యను పేరే వైదికమత పునర్విజృంభణమును చెప్పక చెప్పు చున్నది.

నాగార్జునుని పాశ్చాత్య పండితులు రెండవ శతాబ్దివాడని చెప్పుటచే, అతనిని యజ్ఞశ్రీతో సమ కాలికునిగ మన ఐతిహాసికులు నిర్ణయించిరనుట స్పష్టము. పాశ్చాత్య రీతుల నాగార్జునుని కాలమును నిర్ణయించుటలో కొంత పొరపడిరని తెలియుచున్నది. అశ్వఘోషుని నాగార్జునుడు తన గ్రంథములలో పేర్కొని యున్నాడు. అశ్వఘోషుడు తన గ్రంథ ములలో పేర్కొన్న శకనరపతి కనిష్కునిగ పాశ్చాత్యులు విశ్వసించిరి. కనిష్కుడు క్రీ. శ. డెబ్బది ఎనిబదిలో నున్నాడని విశ్వసించి పాశ్చాత్య పండితులు నాగార్జు నుని క్రీ. శ. రెండవ శతాబ్దిలోనికి తెచ్చిరి.

అశ్వఘోషుడు పేర్కొన్నవాడు కనిష్కుడే యని భావించుటచే కలిగిన ఈ పొరపాటు నిపుడు సరిదిద్దుకొనవలసి యున్నది. పుష్కలావతిని పరి పాలించుచు మోహుడను పేరుగల శకరాజు క్రీ. పూ. రెండవ శతాబ్దియందున్నాడు. యవన, ఖరోష్ఠీపుల లోని తన నాణెములు మనకిపుడు కనిపించుచున్నవి. ఇతని కుమారుడు ఆజియే పంజాబునందు యవనుల అధికారమును నిర్మూలించెను. కావున ఈ మోహుని, అశ్వఘోషుని సమకాలికుడుగ మనము గ్రహించినచో నాగార్జునుడు క్రీ. పూ. రెండవ శతాబ్దిలో చివర నుండెనని తేలగలదు. అప్పటి శాతవాహనరాజు ఆంధ్ర రాజుల పట్టికలో ఆరవవాడగు శాతకర్ణి కాగలడు. ఈ శాతకర్ణి క్రీ. పూ. నూటడెబ్బది రెండులో రాజ్యాధిపత్యము వహించెనని చరిత్రకారులు అంగీకరిం యున్నారు.

నాగార్జునుని గురించి చైనీయ, టిబెటీయ గాథలలో గల మరియొక విషయముతో గూడ యీ కాల నిర్ణయము సరిపోవుచున్నది. నాగార్జును నాద రించిన శాతవాహన ప్రభువతి దీర్ఘకాలము పరిపాలించు టచే విసుగెత్తిన రాజపుత్రుడు నాగార్జునుని మరణ మునకు కారణభూతుడయ్యెనని ఆ గాథలు చెప్పు చున్నవి. ఈ శాతకర్ణి పరిపాలనా కాలము ఏబదియారు సంవత్సరములు. ఆంధ్ర రాజులలో ఇంతకాలము పరి పాలించిన రాజెవడును మరియొకడు లేడు. యజ్ఞశ్రీ పరిపాలనాకాలము ఇరువదిమూడు సంవత్సరములు మాత్రమే.

ఈ విషయములు పరిశీలించి చూపిన నాగార్జు నుడు క్రీ. పూ. రెండవ శతాబ్ది కడపట నుండెనని విశ్వసించుటయే సమంజసమని దోచుచున్నది.

నాగార్జునునిచే ప్రవచితమగు మాధ్యమిక వాదము మానవుని విజ్ఞానభూమికి కడమెట్టు అని చెప్ప వచ్చును. శూన్యభావన అనాటి బౌద్ధులకు కొత్త కాదు. కానీ, నాగార్జునుడు శూన్యత కొక నూతనత్వ మును సమకూర్చినాడు. అస్తిత్వ నాస్తిత్వములకు మధ్యగామియగు భావమే నాగార్జునుని శూన్యత. ఈనాటి విజ్ఞానులు సైతము తమ నిత్యపరిశోధనల మూలమున నీ వాదము వైపునకే వచ్చుచున్నారు.

నేటి గణితశాస్త్రమున మనకు సుపరిచితమగు శూన్యము దాదాపు నిట్టిదే. గణితశాస్త్రవేత్తదృష్టిలో శూన్యము రెండు విధములు. సర్వశూన్యము గణిత పరి కర్మలలో పనికిరాదు. పరికర్మలలో నుపయోగించునది గణిత శాస్త్రీయ శూన్యము. ఒకటిని సున్నచే (శూన్య ముచే) భాగించిలి మనుకొనిన అపుడు మనకు లభించు లబ్ధము అనంతసంఖ్యయని గణితవేత్తల నిర్ధా రణ. ఒకటిని భాగించిన సున్న సర్వశూన్యమే అగు నెడల భాగహార పరికర్మయే యుండదు. అందువలన సున్నను గురించి ఒక గణితశాస్త్రవేత్త నిర్వచింపు

మని కోరినచో అతడు మన మూహించగలుగు నట్టి సంఖ్యాభిన్నముల కన్నను చిన్నదియే శూన్యము అని మాత్రము యనును. అయినఎడల దాని కస్తిత్వము గలదా? అని యడిగిన నతడు లేదనును. స్వశూన్యమా యనిన కాదనును. దాదాపుగ ఇట్టిదియే మాధ్యమిక భావ వాదన. ఇట్టి శాస్త్రీయవాదనను కనిపెట్టిన ప్రథమ గౌరవము నాగార్జునునకే దక్కవలయుననుట నిర్వివాదాంశము. ఇక సాపేక్షతా సిద్ధాంతపు మూల సత్యములు నాగార్జునుని ద్వివిధ సత్యములలో కనబడు చున్నవి.

బుద్ధికుశలతచే ప్రతిపాదించిన తన తత్త్వ సిద్ధాంతముల నాతడు ప్రజల నెత్తిపై రుద్దలేదు. సంవృత్తి సత్యమున నునికిగల ఈ ప్రపంచమునందలి ప్రజల సన్మార్గ వర్తనులుగ జేయుటకై భక్తి మూలకముగ బుద్ధ, బోధిసత్త్వారాధనల నతడు ప్రోత్స హించెను. ఆ ప్రోత్సాహ ఫలితము వ్యాపించి బుద్ధ భక్తికి చిహ్నములే నేటి త్రవ్వకములందు లభించు చున్న నానా శాసనములు.

నాగార్జునుని భావముల న[illegible]ని యనంతరము ప్రజలయందు బోధింపగలుగు ప్రతిభాశాలురు కరువయినారు

మహాయానము క్రమముగ వజ్రయానముగ అట నుండి వామాచార మతముగ మారుటతో, బౌద్ధమతము నీతిహీనుల చేతులలోనికిపోయి ఉదాత్తతను గోల్పోయి అస్తమించినది

ఆ మతముతోపాటు శ్రీ పర్వతపు శోభయు నంతరించినది. మిగిలినవి నేడు మనకు కనబడుచున్న కనబడని భూమిలో దాగియున్న శిలాఖండములు. ఈ శిలాఖండములే నాగార్జున ప్రతిరూపములయి, ఆంధ్రులలో నిద్రాణమైయున్న తేజశ్శక్తుల నుజ్జ్వలింప జేయగలవని ఆశింపవలయును



# అత్యద్భుత శతావధానంలు - వేంకట రామకృష్ణ కవులు

శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

ఆంధ్ర కవిత్వ రంగములో ఒక విధముగా ఆధునిక యుగమును అవధాన యుగమని అనవచ్చును. ఈ కాలములో దేవులపల్లి సోదరకవులు, తిరుపతి వేంకట కవులు, కొప్పరపు సోదరకవులు ఇత్యాదులైన జంటలు ప్రసిద్ధములైనవి. గతానుగతికముగా గాక స్వప్రతిభా బలముతో అవధాన ప్రక్రియలో ఒక అభినవత్వమును తీసికొనవచ్చి శతావధానుల శ్రేణిలో తమ ప్రత్యేకతను నిలబెట్టుకొన్న ధీరులు వేంకటరామకృష్ణ కవులు.

ఆంధ్రభోజుడుగా ప్రసిద్ధినందిన పిఠాపుర ప్రభువువారి సంస్థానమున గురుస్థానములో కుదురుకొని యుండుటచే వేంకటరామకృష్ణ కవుల అవధాన కళాకౌశలము ఆంధ్ర దేశీయులకు అందఱకు అందుబాటులో లేకదయ్యెను.

అత్యద్భుత శతావధానము, శతవిధానము, శతప్రాసము ద్విగుణీకృతాష్టావధానము, అను ప్రక్రియలు అవధానవాఙ్మయమున ప్రవేశపెట్టి వేంకటరామకృష్ణ కవులు ఒక విశిష్టస్థానము నాక్రమించిరి.

శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రి, శ్రీ ద్వివేది రామకృష్ణశాస్త్రిగారలు కలిసి వేంకటరామకృష్ణ లయిరి. వీరు మేనత్త మేనమామ బిడ్డలు. ఒకరిది ఫ్రెంచి యానామునకు సమీపమున గల పల్లిపాలెము జన్మస్థలము. రెండవవారిది పశ్చిమ గోదావరిజిల్లా తణుకు దగ్గరనున్న కాకరపఱు.

వేంకటరామకృష్ణ కవులు 1909 వ సంవత్సరమున పిఠాపుర సంస్థానమునకు వెళ్లి రాజావారికొక విజ్ఞాపన పత్రమును పంపిరి. అందు

'నాలుగు నైదు గంటలు దినంబునకుం
బనిసేఁగ నెంతయుం
దాలిమితోడ నీ శతవధానము
మూఁడు దినాలు పట్టు నీ
కాలము లోపలన్ విసుగు గల్గును
మీకును మాకుఁగన భూ
పాలక యాలకింపు మొక పద్ధతిఁ
జేసిన వార మిత్తఱిన్'

'చేయుట కొక్క గంట, యది చెప్పిన
చొప్పునఁ దప్పకుండఁగా
వ్రాయుట కొక్క గంట సరివారలలో
నవధాన పాండితీ
స్థేయత కొక్క గంట, యరుదెంచిన
పెద్దల గౌరవింప నొం
డో యర గంటయో వ్యవధి
యుండవలెన్ ధరణీ పురందరా'[1]

యని రాజావారికి విన్నవించుకొనిరి ఈ పద్యములు చూచి రాజావారు ఇంతకు పూర్వము మూడు రోజుల కాలము నట్టి శతావధానమునుచూచి విసిగి యుండుటచే నాలుగు గంటలలో చేయు శతావధానమును చూడ కుతూహలురై 1909 మార్చి 13 వ తేదీని ఒక సభను ఏర్పాటు గావించిరి. (కీలకనామ సంవత్సర ఫాల్గుణ బహుళ షష్ఠీ స్థిరవారము) సీసము వంటి పెద్దపద్యములతో నూరు పద్యములు చెప్పుట కష్టమగును కదాయని యవధానులు పృచ్ఛకులకీ విధముగా విజ్ఞప్తి చేసికొనిరి.

సందర్భంబును జూచి చెప్పెద మెడన్
శార్దూల వృత్తంబు మా
కెందైనం దగియున్నచో నపుడు
మత్తేభంబు నిర్మింతు మా
నందంబందిన జంపకోత్పలముల
స్పంధింతు మీ ప్రక్రియన్
గందం బొక్కెడ గీత మొక్కెడను
వక్కాణింతు మిచ్ఛాగతిన్'

పృచ్ఛకులు కోరినరీతిని అవధానులు పద్యములు వక్కాణము చదివిన వానిని ధారణచేసి నూరు పద్యములు పూర్తిగా ఒచి రాజావారు అడిగిన పద్యముల నప్ప జెప్పిరి. రామకృష్ణ కవుల అవధాన ప్రతిభ కచ్చెరువంది రాజావారు వారిని అత్యద్భుత శతావధానులని పిలువదొడగిరి.

మహారాజా వారంతటితో సంతృప్తినందక రామకృష్ణ కవులనింకను పరీక్షింపదలచి 'చేయుట కొక్క గంట...' యను పద్యమునందలి 'కవిత్వము చెప్పుట కొక్క గంట' యను వాక్యమును ఊతగా తీసికొని నూరు పద్యములు గంటలో చెప్పుడని కోరగా, పూర్వ మెన్నడును అట్టి ప్రయత్నము చేయక పోయినను రామకృష్ణ కవులు దానికి అంగీకరించిరి. ఈ శత విధానమున కాద్యులు వీరే కనుక దాని నిర్వహణమునకు కొన్ని నిబంధనల నేర్పరుచుకొనిరి. అవి యేమన

'పృచ్ఛకుడు కవి యెఱింగిన పురాణ ప్రసిద్ధ కథ నెద్దానినైనం దన యిచ్చవచ్చిన దానిం గోర వచ్చును. ఒక వస్తువును నూఱు పద్యములచే వర్ణింపు మని గాని, యా కథలో నీ వర్ణన మెక్కువగా నుండ వలెనని గాని చెప్పరాదు. ఈ వృత్తముల జెప్పవలెనని నియమింపరాదు.

కవి కథా సందర్భములోం దన యిచ్చవచ్చినట్లు వర్ణింపవచ్చును. ప్రసిద్ధములగు పురవర్ణనము, రాజ వర్ణనము మొదలగునవి మహాప్రబంధములలోవలె విశేషించి వరించరాదు. శైలి సర్వత్ర సమముగ నుండ వలెను. కృత్యాదిని రెండు మూడు మాత్రము ప్రార్థన పద్యము లుండవచ్చును. తగు చోట్లం బది వచనముల కన్న నెక్కుడుగం జెప్పం జనదు.[3]

రాజావారీ శతవిధాన ప్రక్రియను వీక్షించుటకై 1909 మార్చి 14 వ తేదీని సభ గావించిరి. రామకృష్ణకవులు తమ విజ్ఞాపన పత్రము నందు

'ప్రాకట సత్కవిత్వ పరిపాటిని మేము
రచింపు చుండఁగా
మాకెనయై రసజ్ఞుఁడయి మెచ్చియుఁ
జెడ్డయు నేర్చి ప్రోడయౌ
లేకరి యొక్కఁడుండ వలె లేక కడుం
గడు నింపు నింపియున్
మా కవితా రసాయనము మాకును
మీకును దూరమయ్యెడున్'[4]

అని లేకరిని గూర్చి హెచ్చరించుటచే రాజావారు సమర్థులయిన లేకరుల నెనమండుగురను నియమించెను. రామకృష్ణకవులు 'ప్రహ్లాద చరిత్రము' ఇతివృత్తముగా తీసికొని శతవిధానము నిరాక్షేపముగా పూర్తి గావించిరి. ఎనమండుగురు లేకరులను సంపూర్ణముగ పద్యములను వ్రాయలేక పోయిరి. రాజావారు అవధానుల అత్యాశు కవితకు మెచ్చి స్వయముగ అత్తరు తాంబూలాదుల నిచ్చి మున్నూట పదహారు రూపాయిలను జోడుశాలువలను పారితోషికముగా నొసంగి వారిని అంతటినుండి ఆస్థాన కవులుగా నియమించు కొనిరి.

పిమ్మట రామకృష్ణకవులు విజయదశమి పండుగలలో రెండవసారి 1909 నవంబరు 17 వ తేదీని 'రామాయణము' ను కథావస్తువుగా గ్రహించి శత విధానము గావించిరి.

'శతప్రాసము' అను నూతన అవధాన ప్రక్రియకు కూడ వీరే సృష్టికర్తలు. ఇంతకు పూర్వము పెద్దన 'పూత మెఱుంగులన్......'అను 30 పాదముల గల ఉత్పలమాలికను రాయల ఆస్థానమున ఆశువుగా చెప్పినను నూరు పాదములు గల మాలిక ప్రథమముగా రామకృష్ణ కవులే యల్లిరి.

'సిరి మనరావు సూర్య నృపశేఖరు
నింట వసించుగాత సు

స్థిరముగ......అని ప్రారంభించి
..................నే
నురవుగఁ జెప్పుచుఁ టిననని యూహ
యొనర్పకు మయ్య ! భూ పురం
దర ! బహుధా ప్రసంగ వశతన్
వచియించితి నట్లు భూపతీ ![5]

యని పూర్తిజేసిరి.

రామకృష్ణ కవుల శతావధానములలో మరి కొన్ని పేరెన్నిక గన్నవి పిఠాపుర సంస్థానమున (20–11–1909) గావించినది యొకటి, వేఱొకటి యానాము గావించినది.

రామకృష్ణ కవుల అవధాన కవిత్వము ధారా శుద్ధి కలిగి మృదు మధురమై సరళమగు శైలిలో సర్వత్ర నొకేరీతిని సాగుచుండును. మచ్చునకు కొన్ని పద్యములు అత్యద్భుత శతావధానము నుండి ఉదాహరింతును. ఒక పృచ్ఛకుడు అర్ధనారీశ్వర వర్ణనము చేయుడని కోరగా రామకృష్ణ కవులు చెప్పిన పద్యము

'హరుఁడు సగంబు శీత కు ధరాత్మజ
యొక్క సగంబు కంకణం
బురగము, చంద్రలేఖ యొక యుజ్జ్వల
రత్నము గంగ క్రొమ్ముడిన్
మెఱసెడుఁ బువ్వుదండ విషమే
గళభూషణమై చెలంగు నా
పరమ మహంబు నా హృదయ
పద్మమునం దలపోయు చుండెదన్'[6]

'తెలివిలేని నీచున కైశ్వర్యము గలిగిన వాని ప్రవర్తన' యెట్లుండునని ఒక పృచ్ఛకుడు కోరగా వారు చెప్పిన పద్యము.

కవిరాజ విరాజితము :—

'ఘనులను తక్కువగాఁగను నీచుల గాంచు
గడుంగడు గణ్యులుగన్
మనమునఁ గోపము మానుగ బెంచును
మాను లసద్గుణమైత్రిని వి
జ్ఞులను ధూళున్ను జాలఁగ గేరును
సజ్జన సంతతి సంతతమున్
విను సిరి నీచుని వేడ్క వరించిన
విశ్వమునం బృథివీ రమణా.'[7]

ఒక పృచ్ఛకుడు రామాయణమును సంగ్రహముగా కందమునందు చెప్పుడని కోరెను. 24 వేల శ్లోకములలోనున్న రామాయణమును సంగ్రహముగా చెప్పుమనుట, అందును కందమున చెప్పుమని కోరుట– కాని రామకృష్ణ కవు లెంత సహజముగా సంగ్రహించిరో చూడుడు.

ధరఁబంక్తిరథుని సుతుడై
హరు వింటిని విఱిచి సీత నార్జించి కపీ
శ్వరు చెలిమిఁ జేసి రావణు
బరి మాఱిచి రాముఁడిలను బరిపాలించెన్.[8]

లక్షణ విరుద్ధముగా కవిత్వమును చెప్పు కవిని వర్ణింపుడని యొక పృచ్ఛకుడు కోరగా ఆనాటి వాగ్యుద్ధములు మనము నందుంచుకుని రామకృష్ణ కవు లిట్లు చెప్పిరి.

ప్రాసంబున్ యతియున్ విరుద్ధ
శబ్దంబున్ ప్రయోగించుచున్
మోసంబుల్ వడివెట్టి మా కుపమ
మేమేయంచు నెందున్ దుర
భ్యాసం బొప్పగ నుండు వారు
కవులై పద్యంబులన్ జెప్పినన్
వాసింగన్న కవీశ్వరుల్
సభలలో వర్ణింతురే వారలన్[9]

సీసమునందు సూర్యుని వర్ణింపుడని యొక పృచ్ఛకుడు కోరగా అవధానుల నోట వెలువడిన పద్యమిది.

'ఏవాని కిరణంబు లీధాత్రి నెల్లర
కంధకారముఁ బాపి హర్ష మొసగు
ఏవాని సంచార మెపుడు నాఁగని
గడియారమై కాలగతిని దెలుపు
ఏవాని భానువు లిల జలంబులఁ బీల్చి
పైరుపంటల కెల్లఁ బంచిపెట్టు

ఏవాని సేవింప నెల్ల రోగంబులు
బంచ బంగాళమై పాఱిపోవు
కువల యామోదమును దానకూర్పు నెంచి
యవని నెవ్వఁడు రావు వంశాబ్ధి సోముఁ
డగుచు జన్మించె నియ్యెడ నట్టి సూర్యు
నభినుతింపఁగ నెవ్వనికైనఁ దరమె'[10]

అత్యద్భుత శతావధానము గావించిన మరునాడు శతవిధానమును గావింపవలెనని శ్రీ రాజావారు

'శతవధానంబు నిన్నను సల్పినారు
నేఁడు ప్రహ్లాద చరితనుగూడ మీర
లాశువుగ నొక్క గ్రంథంబు ననువు చేయ
వినఁగఁ గోరుచు నుంటిని వేడ్కమీఱ'

'మాటలాడినఁ గవితగా మాఱవేయుఁ
బలుకు పలికిన ముద్దులు గులుక వలయుఁ
జెప్పచోఁ గమ్మతేనియల్ చిలుక వలయు
మీరు ప్రహ్లాద చరితంబుఁ గూరుచునెడ'[11]

అని పలికిరి. శతవిధానము నందలి కవిత్వమునకు కొన్ని ఉదాహరణములు. ప్రహ్లాదునికి విష్ణుమూర్తి పైగల నిశ్చల భక్తిని చెప్పు సమయమున చెప్పిన పద్యము.

జనకుఁడెంత వచించిన జనని యెంత
చెప్పినను గురుఁవెంతయుఁ జెడ్డ త్రోవ
యంచుఁదెల్పిన వినఁబోక హర్షమునను
వెన్నుఁ బూజించు చుండును వేయిగతుల[12]

హిరణ్య కశిపుని సంహరించిన పిదప ప్రహ్లాదుడు నరసింహమూర్తిని స్తుతించిన విధము.

శ్లో॥ 'వందే విష్ణుం భవభయ బంధ
వినాశకరం మహాదేవమ్
సుందర వక్త్రం నందిత బృందారక
మతుల వీర్య మత్యంతమ్'.

'వందేరమాధి నాథం బృందారక
వినుత పాదరాజీవమ్
వందిత బుధజనలోకం బందీకృత
దుష్టరాక్షసం మనసా'[13]

ఉషాకన్య సౌందర్యమును వారిట్లు వర్ణించిరి

చెన్ను మీఱిన గన్నులు చేరెడేసి
పసలు మీఱిన వెంట్రుకల్ బారెడేసి
బాగు మీఱిన గుబ్బలు పట్టెడేసి
కలిగి చెన్నారె యౌవన కాలమందు[14]

పిఠాపుర సంస్థానమున ప్రవేశింపక పూర్వము రామకృష్ణకవులు కొన్ని అష్టావధానములు గావించిరి. అందు ప్రధానముగా పేర్కొనదగినవి ద్వివేది రామకృష్ణశాస్త్రిగారు గావించిన కాకరపఱ్ఱు అష్టావధానము, (27–4 1907 విశ్వావసు సంవత్సరాది దినమున గావింపబడినది.) పల్లెపాలెము అష్టావధానము, పిఠాపురాష్టావధానములు (17–3–1909, 25–7–1909.)

వేంకటరామకృష్ణకవుల అష్టావధానములందు కవిత్వము, చతురంగము, నిషిద్ధాక్షరి, శాస్త్రప్రసంగము వ్యస్తాక్షరి, ఘంటాగణనము, నిర్దిష్టాక్షరి, సమస్యాపూరణము అనునవి ఎనిమిది అంశములు. అందు కొన్నిటికి బదులు పురాణ పఠనము, కావ్యపాఠము, లోకవ్యవహార ప్రశంస పుష్పగణనము అను అంశములను కొన్ని అవధానములలో చేర్చుకొనెడి వారు.

వారు గావించిన అష్టావధానములలో కొన్ని అంశములను కొన్ని మచ్చున కుదాహరింతును.

శ్రీ ద్వివేది రామకృష్ణశాస్త్రిగారు కాకరపఱ్ఱునందు ప్రప్రథమముగా యొనరించిన అష్టావధానము నందొక పృచ్ఛకుడు సీసమునందు శ్రీ కృష్ణుని వర్ణింపుడని కోరగా వారు చెప్పిన పద్యము.

చిన్నారి పొన్నారి చిన్నివెన్నెల గుత్తి
చెన్నుఁదన్నెడి మోము చెల్వువాని
మీఱ మేలముఁ జేయు వాలుగన్నుల వాని
కొమరారు నల్లని కురుల వాని
నీలమేఘము డాలు నేల జాలిన మేని
వన్నెవానిని మేలి చిన్నెవాని
గెందామరల డాలు గేలి సేయఁగ జాలు
ఛాయ మీనెడు నంఘ్రి ద్వయివాని

పల్లవీ పల్లవాధరా ప్రాణనాథు
నందనందనుఁ బూజింతు డెందమందు
నాదగు వధానమునంగని మోదమంది
యున్నవారికి సంపద నొసఁగు కొఱకు[15]

రామకృష్ణ కవుల అష్టావధానము లందు శ్రీయుతులు దేవులపల్లి తమ్మనశాస్త్రిగారు, కూచి నరసింహంపంతులుగారు, పురాణపండ మల్లయ్య శాస్త్రిగారు, పేరి పేరయ్య శాస్త్రిగారు మున్నగు దిగ్దంతులవంటి పండితులు పృచ్ఛకులై వ్యవహరించి అవధానుల పాండిత్యమును ధారణాబలమును, సమయస్ఫూర్తిని నిశితముగా పరీక్షించెడి వారు.

సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులును, పీఠికా పురోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులును అగు శ్రీ కూచి నరసింహం పంతులుగారు అవధానుల ధారణా బలము పరీక్షింపనెంచి అవధానులకు తెలియని ఆంగ్లభాషలో నొక వాక్యమును వ్యస్తాక్షరి కొసగిరి. రామకృష్ణకవులా వాక్యమును అవలీలగా ప్రకటించిరి. ఆ వాక్యమునిట పొందుపరచుచున్నాను.

హి హూ ఈజ్ కన్విన్సుడ్ ఎగ్నెస్టు హిజ్ విల్
ఈజ్ ఆఫ్ ది సేమ్ ఒపీనియన్ స్టిల్[16]

(He who is convinced against his will is of the same opinion still.)

పీఠికాపుర సంస్థానమున గావింపబడిన అష్టావధానములో శ్రీ పురాణపండ మల్లయ్య శాస్త్రిగారు కొన్ని అక్షరముల నిచ్చి అవి వారు నిర్దేశించిన చోటుల యందుంచి యొక శ్లోకమును చెప్పుడని కోరగా రామకృష్ణకవులు చెప్పిన శ్లోకము. నిర్దేశింపబడిన అక్షరములు ఈ దిగువ శ్లోకమునందు కుండలీకరణము నందు కలవు.

విరే (జే) రాజ (రా) ట్ప్రోయం
న (వా) నందో మహద్ధ (నమ్)
దత్వాద్య (స) ద్భోగ్యమో (దం) య
శ్చ కాశే భూ (త) లేభృశమ్[17]

పీఠికా పురాష్టావధానమున శ్రీ పేరి పేరయ్య శాస్త్రిగారు అక్షరములు నిషేధించు చుండగా రామకృష్ణకవులు చెప్పిన శ్లోకము.

'సమాం పాతు లసద్వక్త్రః
ధీమాన్ సత్వగురు స్సమః
యం సుధాన్నాస్తథా చాన్యే
యయుర్మోక్షం నవం నతాః'[18]

సమస్యా పూరణమున వేంకటరామకృష్ణ కవులు చూపిన ప్రతిభ అసాధారణము. పీఠాపురమున వారు గావించిన అష్టావధానములందియ్యబడిన రెండు సమస్యలను, పూరణములనిట పొందుపరచుచున్నాను.

సమస్య :

'కుండను గొండ సొచ్చె నిదిగో! యని పల్కెను విస్మయంబు నన్'—

పూరణము :

'కొండలురేగి లోకముల గుండలు
సేయుచు నుండఁ జూచి యా
ఖండలుఁ డుద్ధతుండయి యఖండ
పరాక్రమ మొప్ప తెక్కలన్
జెండఁ గడంగుటం దెలిసి శీత నగా
త్మజుఁ డబ్ధి వ్రజి రా
కుండను గొండ సొచ్చె నిదిగో!
యని పల్కెను విస్మయంబునన్.'[19]

సమస్య —

'రాతికిఁ గోతి పుట్టె రఘురాముని
కైవడి సీత కైవడిన్'

పూరణము:—

ఖ్యాతి యొసంగ నంజనకుఁ గల్గిన
శ్రీ హనుమానుఁ జూచి సం
ప్రీతిని జెంది దేవతలు పేరిమిఁ
జెప్పుకొనంగ సాగిరీ
భూతలమందు రావణుని బొల్పడఁ
గింపగ నిప్పు డంధకా
రాతికిఁ గోతి పుట్టె రఘురాముని
కైవడి సీత కైవడిన్'[20]

పీఠికాపుర సంస్థానమున విద్వత్కవులుగ విలసిల్లి అనేక ఉత్తమ గ్రంథములను వెలయించి అత్య

ద్భుత శతావధానులుగ కీర్తి నందిన శ్రీ వేంకట రామ కృష్ణ కవులు సర్వదా స్మరణీయులు. వేంకటరామ కృష్ణ కవులమై శ్రీ మధునాపంతుల వారు చెప్పిన మధురమైన పద్యముతో నీ వ్యాసమును ముగించుట సముచితము.

'పరమాశ్చర్య కరావధానముల
నవ్యస్వాదు కావ్యంబులం
బరిశీలించి ధరాధి నాయకుండు
కాన్కల్ వెట్ట, శ్రీ సీతికా
పుర సంస్థాన కవీశ్వరస్వామునం
బొల్పుం గాంచి యాంధ్ర ప్రజా
దరముం జెందిన రామకృష్ణులకు
సంధానింతుఁ గైమోడ్పులన్'

---

ఆధార గ్రంథములు

(1) వేంకటరామకృష్ణ గ్రంథమాల-ప్రథమ గుచ్ఛకము. రాజానురంజనము పేజి 4.

(2) వే. రా. గ్రం. సీతిక.

(3) వేంకటరామకృష్ణ గ్రంథమాల-ప్రథమ గుచ్ఛకము. సీతిక-28 పేజి.

(4) రాజానురంజనము 4 వ పేజి.

(5) వేంకట రామకృష్ణ గ్రంథమాల-ద్వితీయ గుచ్ఛకము-శత ప్రాసము. పేజీలు 1 నుండి 5 వరకు.

(6) ప్రథమ గుచ్ఛకము-అత్యద్భుత శతావధానము-12 వ పేజి 31 వ పద్యము;

(7) అత్యద్భుత శతావధానము 21 వ పేజి 95 వ పద్యము.

(8) ప్రథమ గుచ్ఛకము — శతావధానము 60 వ పేజి 5 వ పద్యము.

(9) ప్రథమ గుచ్ఛకము — శతావధానము 66 వ పేజి 30 వ పద్యము.

(10) ,, 60 వ పేజి 7 వ పద్యము.

(11) ప్రథమ గుచ్ఛకము — ప్రహ్లాద వంశము— శత విధానము 31 వ పేజి 15, 16 పద్యములు,

(12) శత విధానము 33 వ పేజి 41 పద్యము.

(13) ప్రహ్లాద వంశము—34 పేజి 55, 56 శ్లోకములు.

(14) ప్రహ్లాద వంశము 36 పేజి 73 పద్యము.

(15) ప్రథమ గుచ్ఛకము — కాకరపఱ్రు అష్టావధానము 82 పేజి.

(16) ప్రథమ గుచ్ఛకము – అష్టావధానము 24 పేజి V వ్యస్తాక్షరి.

(17) అష్టావధానము 24 పేజి VII నిర్దిష్టాక్షరి.

(18) అష్టావధానము 23 వ పేజి III నిషిద్ధాక్షరి.

(19) అష్టావధానము 24 వ పేజి VIII సమస్య.

(20) అష్టావధానము 81 వ పేజి 8 సమస్య.

# ఆంధ్రసాహిత్యము - సందేశ కావ్యములు

## శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

క్రీస్తుపూర్వ కవికుల గురువు కాళిదాసు రచించిన మేఘసందేశము సాహిత్య ప్రపంచమున ప్రసిద్ధిగాంచిన కావ్యము. కుబేరుని శాపమువలన ప్రియురాలికి దూరమైన ఒకానొక యక్షుడు మేఘుని ద్వారా తన ప్రేయసికి పంపు సందేశమే యిందలి కథావస్తువు. మేఘదూతము ఈ గ్రంథమునకు గల నామాంతరము. దూతకార్యము సాహిత్యమునకు క్రొత్తకాదు. ఆదికవి వాల్మీకి రామాయణముననే హనుమత్సందేశము కలదు గదా! కాని రామాయణ మహాకావ్యమున నీ సందేశ మొక ఘట్టము మాత్రమే. మేఘసందేశమున సందేశ కార్యమే ప్రధానము. ఈ కాళిదాసుని మార్గము ననుసరించి సంస్కృతమున సందేశ కావ్యము లసంఖ్యాకముగా వెలసినవి.

ఆంధ్రసాహిత్య మనువాదముతో నారంభమైనది. ఆ స్థితి చాల కాలము కొనసాగినది. అయినను ఆధునిక యుగమువరకు మేఘసందేశమున కనువాద గ్రంథములు వెలువడలేదు. ఆధునిక కాలమున అనేక కారణముల వలన లఘుకావ్యములపై ఆసక్తి ప్రబలినది. అందువలననే ఋతుసంహార, మేఘసందేశముల కనువాదములు తామరతంపర యైనవి. విశ్వనాథ సత్యనారాయణగారి లెక్కననుసరించి మేఘసందేశమునకు లక్ష యనువాద లున్నవి. ఈ సంఖ్య నతిశయోక్తిగా భావించినను, శత సంఖ్యను మించియుండు ననుట కనుమానింపవలసిన యగత్యములేదు.

కాళిదాసు గ్రంథము ననువదింప కుండ, ఆతని గ్రంథము నాధారముగా గ్రహించి వేరు నాయికా నాయకులతో, వేరు దూతలతో రచింపబడిన గ్రంథము లాంధ్రమున కొన్ని గోచరించు చున్నవి. కవులు కొంతకు కొంత స్వాతంత్ర్యమును ప్రదర్శించిన పద్ధతి యిది. విశ్వనాథ సత్యనారాయణగారి శశిదూతము, గుఱ్ఱం జాషువాగారి గబ్బిలము, పుట్టపర్తి నారాయణాచార్యులు గారి మేఘదూతము, మోటూరి వేంకటరావుగారి చకోర సందేశము మున్నగున విట్టి కావ్యములు.

సందేశ ప్రధానములగు ఈ నాలుగు గ్రంథములలో రెండు శృంగార గ్రంథములు. శశిదూతము, చకోర సందేశము విప్రలంభ శృంగార ప్రధానములగు గ్రంథములు. సంయోగాశయుండి వియోగము ననుభవించు వారిని గూర్చి వర్ణించునది విప్రలంభ శృంగారము. శశిదూత చకోర సందేశములలో ప్రేయసీ ప్రియుల సుఖసంయోగము గూడ సూచింప బడినది. నారాయణాచార్యులుగారి మేఘదూతమున గూడ నాయికా నాయకులు సౌఖ్యముల ననుభవించుట కవకాశము లేకపోలేదు గాని నాయకునకు విధింపబడినది దీర్ఘకాల పరిమితి గల శిక్ష. ఇక మిగిలిన సందేశ కావ్యము గబ్బిలము. తక్కిన గ్రంథములకు, ఈ గ్రంథమునకును భేదము శతసహస్రాంశము. ఈ గ్రంథమున నాయకుడే గాని నాయిక లేనేలేదు. నాయకుడాజన్మ బ్రహ్మచారి. అతడంపు సందేశము ప్రేమ సందేశము కానేకాదు. కన్నీటి సందేశము. అందువలన కరుణ మీ గ్రంథమున ప్రధానము. నాయకుడు తన జాతివారి బాధా గాథలను పరమేశ్వరునకు సందేశము పంపుట తోపాటి గ్రంథమున దేశభక్తి గూడ అధికము. మేఘదూతమున గూడ పేదల కడగండ్లే ముఖ్యము. ధనికులు గావించు అన్యాయముల నన్యాయ మన్నందుకే ఈ కథా నాయకునకు కారాగారవాస శిక్ష సంభవించినది.

ఈ కావ్యకర్తలు గ్రహించిన సందేశహారులను గూర్చి కొంత ప్రస్తావించుట సమంజసము. శశిదూతమునందు చంద్రుడు దూత. చకోర సందేశమున రాయబారి చకోరిక. మేఘదూతమున మేఘుడే కార్య

నిర్వాహకుడు. జాషువా కావ్యమున గబ్బిలపు చాన సందేశహారి. విశ్వనాథ, నారాయణాచార్యులుగార లెన్నుకొన్న దూతలు పురుషులు. వెూటూరి, జాషువాగార లెన్నుకొన్న దూతలు స్త్రీలు. దూతకార్యమునకు వారు వీరను భేదమును ప్రాచీన గ్రంథకర్తలు పాటింపలేదు. వీరును పాటింపలేదు. కాని ఆడు గబ్బిలమునే దూతగా గైకొనుటకు కారణమును చెప్పుచున్నాడా యన్నట్లుగా జాషువా 'బిడ్డల గని పాలిచ్చెడి... .....దొరసానివి' యని సంబోధించినాడు. ఒకరి కష్టముల నర్థము చేసికొనవలెనన్నచో స్త్రీలు, అందును బిడ్డలు గన్నవారే తగుదురని వారి యుద్దేశమేమో!

## శ శి దూ త ము

ఆంధ్రదేశమున ప్రసిద్ధులైన పండిత కవీంద్రులలో ప్రముఖుడు విశ్వనాథ సత్యనారాయణ. వారు రచించిన లఘుకావ్యములలో శశిదూతము ప్రసిద్ధిగాంచిన గ్రంథము. భార్యకు భర్తపై ఎందుకో క్రోధము జనించినది. ఏకశయ్యాగతులై యున్నను ఆమె భర్త కభిముఖముగా లేదు. వెన్నెల రేయి. మింట వెన్నెలరేడు వెలుగుచున్నాడు. ప్రియుడు విరహమును భరింపలేకపోయినాడు. ఆకాశమున అందముగా ప్రకాశించుచున్న చంద్రుని రాయబారము నడుపుమని నాడు. ఇది ప్రధాన కథ.

తక్కిన గ్రంథములలోని రాయబారమునకును, ఈ గ్రంథమునందలి రాయబారమునకును భేద మున్నది. ఆ గ్రంథములలో ప్రేయసిగాని, పరమేశ్వరుడుగాని ఎక్కడో ఉన్నారు. దూతగా ఎవరినో ఒకరిని ఎన్నుకొనవలసిన అవసరము మిక్కిలిగా నున్నది. శశిదూతమున ప్రేయసీ ప్రియులకు దూరమావడలలో గాదు, అంగుళముల లోనే. ఇది సముఖములో రాయబారము. ప్రియుడు చంద్రునితో జరుపు సంభాషణ యంతయు ప్రేయసికి శ్రవణానందము గల్గించుచునే యుండును. కొంతసేపటి కైనను ఆమె మెత్తబడక తప్పదు. చంద్రుడు ఈ సంభాషణకు కేవల మాధారమే. ఈ సంగతిని రచయిత గూడ స్పష్టాస్పష్టముగ వ్యక్తీకరించుట గూడ జరిగినది. నీవు గావింపవలసిన రాయబార మంత కష్టసాధ్యము గాదని మతికొందఱు శ్రమించిన దూతల నుదాహరించినాఁ డీ రచయిత. నలునకు మరాళమువలె, రఘురామునకు హనుమంతుని వలె, యక్షునకు మేఘమువలె నీవు నాకు దూతగా లభించితివని చెప్పి వారికన్న నీ కార్యము సులభతరమని ఈ క్రింది పద్యమున వివరించెను.

'వెలఁదికిఁ గ్రొత్తగాఁ బ్రణయ బీజము
నాటుట యంత కష్టమా!
వెలసిన తా వెఱుంగక గవేషణ
సేయుట యంత క్లిష్టమా!
గొలగొల కొండ గుర్తు లిడుకొంచును
బోవుట యంత నిష్టమా!
సులభము నాదు దూత్యమిదె సుందరి
నా కులపత్ని చంద్రమా!'

ఈ గ్రంథమును దూతకావ్యమనుటకన్న చంద్ర శతక మనుట మేలు. ఇందలి పద్యములు నూఱు. ఈ పద్యములలో నధిక భాగము చంద్రస్తుతియే. అట్లని శతక లక్షణము లన్నియు నిందున్నవని కాదు. తెలుగు శతకములకు ముఖ్యమైన మకుట నియమమిందు లేదు. తమకు దౌత్యము నెఱపుటకు చంద్రుడే తగుననుట కీ కవీంద్రుడు కొన్ని కారణములను చూపినాడు. ప్రేయసీ ప్రియుల మనములలో శృంగారభావము నుద్దీపింప జేయు వానిలో వెన్నెల ముఖ్యమైనది. మన్మథున కేదో యొక ఋతువులోనే వసంతుని సాహాయ్యము గాని, చంద్ర సాహాయ్యము ప్రతిమాసము నందు నుండును. చంద్రుడు చల్లనివాడు. చల్లనివాని హృదయము గూడ కోమలమై తీరును. ఈ భావమునే నాయకుడు వ్యక్తీకరించిన విధ మిది.

ముగుదలు, పూలు, నీవు నొక మోస్తరు
కోమల జీవులందు బి
ట్టుగ నిది యొక్క పూవుల కుటుంబము
మీర లొకళ్లొకళ్లకున్
మిగులఁగ స్నిగ్ధులౌదురును మీరును
మీరును నొక్కఁడౌట నీ

వగుదువు నాకు దూత్యమున కంగనకున్
మృదుకోప శీలకున్.'

ఒకరినొక పని కొప్పించుటకు వారిని స్తుతించి తీరవలెను. పొగడ్తలకు లొంగనివా రీ లోకమున నరుడు. సందేశ కావ్యము లన్నిటిలో సందేశహారిని స్తుతించుట యున్నది. ఈ గ్రంథమున నీ స్తుతి యధికము. దీనిని స్తుతిశతకమనుట సమంజసమేమో నను అభిప్రాయమును వ్యక్తీకరించుటకు కారణ మిదియే. ఆ పొగడ్తలలో కవి ఊహాశక్తి కాట పట్టయిన వాని నొండు రెంటిని చవి చూతము.

చంద్రునిలో కళంకమున్నది. ఆ కళంకము నెందరో కవులెన్నో రకములుగ నూహించిరి. ఇట్టి ఊహలకు బిల్హణీయము కాణాచి. విశ్వనాథవారు చంద్రుని సంబోధించి, వెన్నుని కున్న మచ్చను స్తుతించి నీ మచ్చను కళంకమని ఈ జనమాడు కొనుచున్నారు. నీలో నున్నని కళంకము కాదు. సముద్ర మథన సమయమున గిరి కవ్వము దూసికొని పోగా ఏర్పడిన మచ్చయే యిదియని యిచ్చకపు మాటలతో మెచ్చుకొనెను.

'వెన్నునికున్న మచ్చ యరవిందము
రత్నము భోగిలక్షణం
బెన్నఁగ నీదు మచ్చయది యేమొ
కళంకము, నిచ్చకాలనన్
దిన్నగ నిట్లయుండును గదే!
గిరికవ్వము దూసి చన్ననీ
యన్నువ మచ్చ నెవ్వరెటులాడి
ననున్ మనకేమి లే సఖా!'

ఓ చంద్రా! నీవు తలచుకొన్నచో నా ప్రేయసి నా బిగి కౌగిలిలో చేరునట్లు చేయగలవు. నిజము నకు పూవులు, తెమ్మెరలు, మన్మథుడు కాముకులకు బాధ కలిగించినను వానిబాధను తప్పించుకొన వచ్చును. పూవులు తీసివేసినచో పోవును. సన్నగాలులు తెరలు తెరలుగా మాత్రమే వీచును. సమయము కాదను కొన్నచో మన్మథుడు విల్లు సంధింపడు. కాని నీ కిరణము లట్టివికావు. ఎడతెరిపి లేనివి. అడ్డుకొన నేరనివి. ఉక్కిరి బిక్కిరి చేయునవి. కావున నా ప్రేయసిని సమాధానపరచుటకు నీవే తగిన వాడ వని కవి శశిని స్తుతించెను.

'నీ కిరణమ్ము లడ్డుకొన నేరదు
నీ కిరణ ప్రసారముల్
రాకలు రాకలై యెడము రావును
నుక్కిరి బిక్కిరౌదు ర
స్తోకములైన నీ వెలుఁగు త్రోవలఁ
జేతులఁ జిమ్ముకొంచు నే
యే కడకేగినన్ జలువలేచిన
వెన్నెల పోతలే కదా!

విశ్వనాథవారి యూహాశక్తి యద్భుతమైనది. చంద్రకాంతిని వీరు పలువిధములుగ నూహించుచు స్తుతించిన పద్యములు పదియున్నవి. ఇవన్నియు నన్నయ భట్టారకుని నాగస్తుతివలె 'మాకు ప్రసన్న మయ్యెడిన్' యను మకుటముతో సాగినవి. ఈ పద్యములలో రూపకోత్ప్రేక్షాద్యలంకారములతో సాగిన వీరి యూహ లసామాన్యమైనవి. వెన్నెలజాలును పంట కాల్వలతో పోల్చుచు వీరు చెప్పిన పద్యమును గమనింపుడు.

'కరకరి క్రొత్త త్రవ్వి కరకట్టఁగఁ
బోసిన నింగిలోఁ జం
దిరుఁడను తూమునన్ మెఱుపు తీవల
చెర్వుల నుండి దంపతి
స్ఫురదురు చేతమన్ బొలము బోదెల
వెంబడిఁ బర్వు లెత్తుచున్
విరిసిన జాలు వెన్నెలల విచ్చులు మాకు
ప్రసన్న మయ్యెడిన్.'

ఇట్లు చంద్రుని స్తుతించుచు రాయబారము నడుపుమని తొంబది పద్యములలో స్తుతించిన తరువాత, ప్రియుని విరహవేదన నంతటిని ప్రత్యక్షముగ వినుచున్న, కనుచున్న ప్రేయసి ప్రియుని వక్షమున వ్రాలినది. ఏదో తాత్కాలిక కోపము నొందినది గాని నిజమున కా యువతి 'యుత్తమ ఇల్లాల'ట. ప్రేయసి తన్ను జేరిన తర్వాత నాయకుడు చంద్రుడు గావించిన

సాహాయ్యమునకు కృతజ్ఞతలు చెప్పుటతో ఈ గ్రంథము ముగిసినది. చంద్ర స్తుతి వ్యాజమున లోకములో దాతల పద్ధతిని సహజసుందరముగా విశ్వనాథ కవీంద్రుడు వ్యక్తీకరించిన ఈ క్రింది పద్యముతో ఈ గ్రంథ చర్చ ముగింతును. చంద్రుడు సమాధానము వాగ్రూపమున చెప్పకుండగనే దూతకార్యము నెరవేర్చెనని యిందు వ్యంగ్యముగా సూచింపబడినది.

'ఇత్తు నటంచుఁ దానధముఁ డీయఁడు
రేపులు ద్రిప్పి ద్రిప్పి తా
నిత్తు నటంచు మధ్యముఁడు నిచ్చును
దప్పక రేపొ మాపొ తా
నిత్తు నటంచు నోట ననఁడిచ్చును
వందలు వేలు లక్షలై
యుత్తముఁ డట్టి యుత్తముల
నుత్తముఁ డౌదువు నీవు చంద్రమా!'

## చకోర సందేశము

చకోర సందేశ కర్త శ్రీ మోటూరి వేంకట రావు. సందేశకావ్యము లన్నిటికి మేఘ సందేశమే ప్రోద్బలకము గాని వీరి సందేశ కావ్యమునకును కాళిదాసుని కావ్యమునకును నొక విధమైన యవినా భావ సంబంధ మున్నది. కాళిదాసు కావ్యమున యక్షుడు మేఘముద్వారా యక్షికి సందేశము నంపును. ఈ గ్రంథమున మేఘసందేశము విన్న యక్షుని ప్రేయసి చకోరిక ద్వారా ప్రతి సందేశము నంపును. అందువలన దీనిని సంపూర్ణ స్వతంత్ర కావ్యమనుటకు వీలులేదు. అట్లని స్వతంత్రము కాకపోదు. విశ్వనాథ వారన్నట్లు 'చమత్కారముగా చెప్పినచో తోటాను త్రిప్పికొట్టుట వంటిది' వేంకటరావుగారూహించిన విధముగా నిన్నివేల సంవత్సరములనుండి యూహించి మేఘసందేశమునకు ప్రతిసందేశమంపిన వారు లేరు. అదియే దాని అంతట అదియొక విలక్షణమైన బుద్ధి. ఊహలోని వైశిష్ట్యము. భావనలోని ప్రత్యేకత.'

ఈ కవీంద్రుడు కథావస్తువు నెన్నుకొనుట లోనే కాక రచనా పద్ధతి నెన్నుకొనుటలోగూడవైలక్షణ్యమునే ప్రదర్శించెను. ఈ గ్రంథ రచనకు వీరెన్నుకున్న ఛందస్సు ప్రత్యేకమైనది. ఉత్సాహ, కవిరాజ విరాజిత, మత్తకోకిల, తరళములు తక్కిన కవు లచ్చటచ్చట నుపయోగించునవి. అవి ఈ గ్రంథమున నధికముగా నుపయోగింపబడినవి. ఉత్తరఖండమంతయు మత్తకోకిల, తరళములలోనే నడచినది. చెప్పదలచిన భావమొక పద్యములో నిముడనప్పుడు రెండు, మూడు పదములు పెంచి వ్రాసెనేగాని ఛందస్సును మార్చుటకు వీరంగీకరింప లేదు. వీరి పట్టుదల యటిది. ఛందస్సులో చమత్కారములను చూపించుటకు వీరు 'పద్మినీ భాస్కరము'నగూడ ప్రవేశపెట్టిరి. చకోర సందేశము వ్రాసిన తర్వాత వ్రాసిన గ్రంథమిది. కాబట్టి రచనా విధానమున గూడ క్రొత్తదనమును కోరుకొను వీరి స్వభావము స్పష్టమైనది.

ఈ గ్రంథమున ప్రథమ ఖండమంతయు ద్విపదలో సాగినది. యక్షిణి తన విరహవేదన నీ ఖండమున విపులముగా, ఉదాత్తముగా వర్ణించినది. ఉపవనమున శాంతిగనలేని, కపురంపు గృహదీపికల సైప బోని, సగముచిక్కి విషాద భరితమైన ఈ శుభాంగిని కవీంద్రుడు శంపాలతాంగితో పోల్చుట జరిగినది.

'శ్యామళాబ్దపరీత శక్ర చాపంపు
సామీప్యమునఁ దోచు శంపా లతాంగి
వలె విషాదచ్ఛాయ వెలయు హర్మ్యమునఁ
జెలి యొంటిగాఁ జలించియుఁ బ్రకాశిల్లె.'

ప్రియుని బాసి వెతనొందుచు, నెదుట గన్పట్టిన చకోరికకు తన వేదనను వినిపించి ప్రియుని చెంతకు రాయబార మేగుమని యక్షి ప్రార్థించినది. ప్రియుని బాసి తాను జీవింపలేనని బాష్పరుద్ధ కంఠ స్వరముతో విన్నవించినది. వియోగము సంవత్సరమని పేరే గాని క్షణ మొక యుగముగా గడచుచున్నపు డెట్లు సైచుట యని వాపోయినది.

'వినవే చకోరికా! వినవె నా చెల్లి!
వినిపింతుఁ గన్నీటి విరహ గీతికల
ననుకంప నీదు ప్రత్యణువులోఁ బొంగ
నినదింతు నేనె నీల్గువనఁ గరంగుచును—'

ఈ నాలుగు పాదములే గీతములో పల్లవి వలె మాటిమాటికి పునరావృత్తము చేయుటనుబట్టి పాఠకుల ప్రత్యేకముగా అనుకంప కల్గింపవలె నను రావుగారి దృక్పథము ద్యోతకమగు చున్నది. తాను, తన భర్త తనువులు వేరయ్యు, మనసు లొకటేనని చకోరికకు వివరించి, తాను భర్తతో గలిసి యానందముగా దినములు గడపిన విషయమును వివరించినది. నరుని జీవన మధు స్పర్శల దోగి సురభిళ ప్రమదప్రసూనమైన ఆ యక్షి భర్తతో నహస్సిశలు వలె లీ విధము నిట్లు వివరించినది.

'రమణీయ జాతి రత్నమునాగఁ బ్రియుఁడు
కమనీయ మణిమయాభము నైతి నేను
అమరరాకా జ్యోత్స్నయై క్రాల విభుఁడు
హిమకరాంతర వికాసము నైతి నేను
మిహి పసిండి నివాళి మిసనాఁగఁ బతియు
మిహికా శిఖా నవోన్మేష మేనైతి
హరిధనుర్మకుటాబ్దమై భర్తయొఱయఁ
దరళ విద్యుత్ప్రభాంకురమైతి నేను.'

ఈ గ్రంథమునందలి ద్వితీయఖండమున రామగిరికి యక్షస్త్రీ మార్గనిర్దేశము గావించుట ప్రధానము. మేఘసందేశమున యక్షుడు రామగిరి నుండి అలకాపురికి మార్గనిర్దేశము గావింపగా చకోర సందేశమున అలకానగరమునుండి ప్రారంభమైనది. 'ఆ మార్గోపదేశము సరిగా పూర్వమేఘము వెనుకకు చదివికొనిపోయినట్లున్నది.' (విశ్వనాథ పీఠిక). కాని మేఘ సందేశమున ప్రథమ భాగమున మార్గ నిర్దేశ ముండగా, నిందు ద్వితీయ భాగమున నున్నది. మేఘమునకు మార్గ సూచన సమయమున యక్షుడు శృంగార ప్రసంగము నధికముగా గావించెను. ఈ గ్రంథమున యక్షకాంత పలుకులలో ప్రియుని కొఱకామె పొందువేదన వ్యక్తీకరింపబడినదిగాని యది మితి మీరలేదు. అదుపులోనున్న సుకుమార ప్రతీక్ష యామెది. పార్వతీ పరమేశ్వరుల వర్ణన సమయమునగూడ యక్షుడు శృంగారాలాపనలు చేయగా, చకోర సందేశమున యక్షిగావించు ఆది దంపతుల వర్ణనలో భక్తివెలి వెరిసినది. పురుషునివలె స్త్రీ తొందరపడ లేదుగదా! ఈ పాత్రనిట్లు చిత్రించుటయే యుచితము. ఆ పాత్రనట్లు రూపొందించుటయే యుచితము.

యక్షవనిత చకోరికకు కొంతవఱకు మార్గము వివరించి ఆ తరువాత భూలోకమున్నది. నాకా ప్రదేశములతో పరిచయములేదని చెప్పుచునే మనుజ లోకమునుగూర్చి కొన్నిమాటలాడినది. ఆ మాటల నీ గ్రంథమునకు పీఠికలు వ్రాసిన విశ్వనాథ వారు, వెంపరాలవారు ఉదాహరించి రెండు విధములుగా వ్యాఖ్యానము గావించిరి. విశ్వనాథవారు యక్షికి 'మానవులయొక్క భోగలక్షణము చాల తక్కువ రకముదని తెలియును' అని వ్రాసిరి. మానవలోకము దుఃఖ సంభరితమని వాక్రుచ్చిన యక్షకాంతయే

'కరము శోక రసార్ద్ర మయ్యును
క్ష్మాతలమ్ము మహా మునీ
శ్వర తపో నిరతాత్మ యోగ
విశంకట మ్మగుచున్ శివం
కర సురార్చిత పుణ్యతీర్థ
నికాయ మండిత మై జనో
త్కర పురాగత కర్మపుంజ
విఘాత విశ్రుతమైచనున్'

అని భువనప్రశస్తి గూడ గావించినది. మేఘ సందేశమున యక్షుడు గావించిన శృంగార వర్ణన మంతయు మానవ శృంగారమును మించినదిగా లేదు. అట్టి సమయమున మానవుల భోగలక్షణము తక్కువ రకముదని విశ్వనాథ వారనవలసిన యవసరము లేదు.

విశ్వనాథవారు సుందర కవిత్వమును చెప్పగల కవీంద్రులే గాక కావ్య సౌందర్యమును గమనింపగల విమర్శకులు గూడ. అప్పుడప్పుడు వైలక్షణ్యమును కాంక్షించియో, తొందరపాటువలననో కొన్ని వాక్యము లందురు. ఆ వాక్యములు విమర్శకు పాత్రము లగును. యక్ష యువతి మానవలోకమునుగూర్చి చెప్పిన పద్యములకు నీరి ఈ వ్యాఖ్యాన వాక్యముగూడ నట్టి యున్నది. ఈ విషయమున వెంపరాలవారే సత్యసమ్మతమైన నిర యము గావించి రనక తప్పదు.

వేంకటరావుగారి చకోరసందేశ మొక విధముగా మేఘసందేశమునకు పూరక గ్రంథము. యక్ష దంపతుల సంయోగమును గూడ ఈ కవీశ్వరుడు మంగళాచరణమను ఖండములో బుష్షభగతిరగడలో నిరూపించుటతో, మేఘచకోర సందేశముల శుభ సంబంధమును దృఢతరము గావించుటతోపాటు, ఛందస్సు విషయమున వీరి ప్రత్యేకతను గూడ ప్రదర్శించుకున్నారు.

## గబ్బిలము

ప్రసిద్ధి గాంచిన జాషువా గ్రంథములలో గబ్బిలము ప్రముఖమైనది. ఇది రెండు భాగములు. గబ్బిలమునకు హరిజనుడు పంచముల బాధలను వివరించి, పరమేశ్వరునితో విన్నవింపుమని ప్రార్థించి, కైలాసమునకు త్రోవ చూపుట మొదటిభాగమునందలి విషయము. రెండవ భాగమున తన గుడిసెలోనికి తిరిగివచ్చిన గబ్బిలమును వెళ్లివచ్చితివా అని ప్రశ్నించి, స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను, సాంఘిక సంస్కరణ కార్యక్రమములను, హరిజనులలోని లోపములను మున్నగు వానిని వివరించును. మొదటి భాగమున వివరించిన విషయమును విపులీకరించుటయే రెండవభాగమున గూడ నధికము.

జాషువా తన గ్రంథమును మేఘ సందేశముతో సరిపోల్చి, భేదములనుగూడ వివరించి, గబ్బిలమును సందేశహారిగా గ్రహించుటలోని యౌచిత్యమును విన్నవించెను. 'కాళిదాసుని మేఘ సందేశమును మనస్సులో నుంచుకొని నేనీ కావ్యమును రచించితిని. గ్రంథ నామము గబ్బిలము. శ్రోతలకిది కటువుగా దోపవచ్చును. మేఘసందేశ కథానాయకుడు ప్రణయ సందేశము నంపును. కాని యితడంపునది తుక తుక నుడుకు నగ్నసందేశము. అతని శిక్షాకాల పరిమితి యొక సంవత్సరము. ఇతని శిక్ష ఆ జన్మాంతము. తరతరములు. దీనికవధి లేదు. అతడు మన్మథాగ్నితప్తుడు. ఇతడు క్షుధాగ్ని పీడితుడు. ఇరువురిలో నితడు దయనీయుడు... కులీనులగు రాజులకువలె హంసములు చిలుకలు మున్నగు పక్షిదూతలితనికి జిక్కుట అసంభవము. కావున నిట్టిడుల జీర్ణకుటీరములలో నిరంతరము దర్శనమిచ్చు గబ్బిలము నితనికి సందేశహారిగా బరిగ్రహించితిని. రసజ్ఞులకిందలి యౌచితి సులభ గ్రాహ్యము.'

శశిదూతము, చకోర సందేశము శృంగార కావ్యములు. పుట్టపర్తివారి మేఘదూత మొకవిధముగా శృంగార గ్రంథమే. శృంగార స్పర్శ యే మాత్రమును లేని సందేశ కావ్యము జాషువాగారి గబ్బిలమే. ఈ సందేశ కావ్యములో దురాచార నివారణ, దేశభక్తి ముఖ్య లక్షణములు. అస్పృశ్యత, మూఢభక్తి, భాషవా విమర్శకు లోనైన దురాచారములు. హరిజనుల దీనహీన చరిత్రను వివరించి అగ్రకులములవారి హృదయములలో మార్పు కల్గింపవలెనని జాషువాకవి హృదయ కాంక్ష. అస్పృశ్యుని దైన్యస్థితిని ఈ కవి గ్రంథారంభముననే బండబారిన గుండెకాయలు కరగునట్లు వర్ణించినాడు.

> 'వాని తలమీఁదఁ బుటిమిన బంకిలమును
> గడిగి కరుణింప లేదయ్యె గగనగంగ
> వాని నైవేద్యమున నంటుపడిన నాడు
> మూఁడు మూర్తులకును గూడఁ గూడు లేదు
> పామునకుఁ బాలు, చీమకుఁ బంచదార
> మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
> ప్రాక్తనంబైన ధర్మదేవతకు గూడ
> నులికిపడు జబ్బు గలదు వీడున్న చోట
> ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
> యినుప గజ్జెల తల్లి జీవనము సేయుఁ
> గసరి బుసకొట్టు నాతని గాలి సోఁక
> నాల్గు పడగల హైందవ నాగరాజు.'

పై పద్యము లన్నియు జాషువా కవి నాయకుని వర్ణించుచు చెప్పిన పద్యములు. నాయకుడు తన గుడిసెలోనికి వచ్చిన గబ్బిలమును పరామర్శించి, శివుని చెంతకు దూతగా వెళ్లుమని కోరును, దారి తెన్ను

లను వివరించుచు మధ్యమధ్యలో తన జాతిపాట్లు నెత్తి గించును. ఎల్లలోకమును రాత్రి నిద్ర పుచ్చినదట. అస్పృశ్యతా జాడ్యముతో బాధపడుచున్న పేదవాడయిన నాయకుని మఱచినదట. ఈశ్వరుని చెంతకు వెళ్లి తన కెందు కీ గతి పట్టినదో కనుగొమ్మని ప్రాధేయ పడినాడు. దేవాలయములలో, ధర్మసత్రాలలో తనకు ప్రవేశార్హత లేకపోవుటను దుఃఖముతో విన్నవించి నాడు. 'పిడుగుల్ వడ్డఁ బ్రవేశ యోగ్యతలు పాసి న్నాకు లే వచ్చుటన్.' ఈ రీతిగా అగ్రవర్ణముల వారు తమ జాతిపట్ల చూపు క్రౌర్యమును కవి నాయకుని ద్వారా హృదయ విదారకముగా ప్రదర్శించినాడు.

జాషువా విమర్శించిన దురాచారములలో మూఢభక్తి యొకటి. భక్తి గొప్పదే. ఆ భక్తి మూఢ భక్తి కానంతవరకు. భక్తి మానసిక చర్య. దాని ని ఆచార రూపమునకు మతస్థులు దిగ జార్చినారు. రాను రాను మూఢాచారములు నెలకొన్నవి. భగవంతుని పూజించుట మాని దొంగభక్తుల పూజించుట, అర్థము పర్థము లేని ఆచారముల ననుసరించుట యభ్యాసమైనది. కాషాయవస్త్రాలు ధరించి తిరుగు గంజాయి భాయీలు, గోసాయీలు హిందువుల దృష్టిలో భక్తా గ్రేసరులు. భిక్షాటనము ఈ సన్యాసుల ప్రధాన వృత్తి యైనది. జాతికి దౌర్భాగ్యస్థితి దాపురించినది.

'ఎన్ని సుక్షేత్రములు సొర మిగిరిపోయి
ముండ్లతుప్పల బంజరుభూము లయ్యె
దృఢ తరంబై యెంతెంత దేహశక్తి
భిక్షుకులవేన జీర్ణించి పృథివి గలిసె'

అని ఈ కావ్యనాయకుడు గబ్బిలముతో చెప్పి విచారపడి నాడు. పాపములు చేసి ఆ పాపములను పోగొట్టుకొను టకు భగవంతునకు లంచము లిచ్చు వింత భక్తులను విమర్శించినాడు.

దురాచార విమర్శనముతోపాటు దేశారాధనము గూడ ఈ రచయిత ప్రధానోద్దేశము. గబ్బిలమునకు కైలాస మార్గమును నిర్దేశించు సమయమున యావ ద్భారతములోని ప్రధాన ప్రదేశముల నన్నిటిని ఈ కవీంద్రుడు తనివిదీర వర్ణించినాడు.

విజయనగర సామ్రాజ్య మాంధ్రదేశము నొక్కె చ్ఛత్రము నీడకు తెచ్చుటకు ప్రయత్నించినది. కాల పురుషుని క్రూరవీక్షణముల కాగలేక విధ్వంస మ యినది విజయనగరము. తళ్లికోట యుద్ధానంతరము హంపిలో మిగిలినవి శిథిలములు మాత్రమే. ఆ శిథిల ములను స్మరించి హరిజన నాయకుడు పొందిన ఆవేద నను గమనింపుడు.

'హంపీక్షేత్రముఁ జూచి పోవలయు
నచ్చొ మ్మతెల్గు రాజ్యంపు నై
లింపశిల కొకా నొకప్పు డది
కేళీ రంగమే తద్దమా
శంపావల్లరు లా తిపోయిన
ప్రదేశంబందు నీ బందుగుల్
కొంపల్గట్టి నివాస ముండెదరు
నీకుం గూర్చు రానందమున్.'

గబ్బిలమునకు తన బంధువులను చూచిన సంతోషము గలుగవచ్చును. కాని తెల్గు రాజ్యపు నైలింపశిలకు కేళీ రంగమైన ప్రదేశము గబ్బిలపు సందోహముల కాశ్రయ మగుట ఆంధ్ర రక్తము ప్రవ హించుచున్న వ్యక్తులకు విచారకరము.

ఈ కవి వర్ణించిన ప్రదేశములలో రాజ మహేంద్రవర మొకటి. ఆంధ్ర సాహిత్య ప్రారంభ మీ పట్టణమునసే జరిగినది. నన్నయభట్టారకునిచే పంచమ వేదమైన భారతము నాంధ్రీకరింప జేసిన రాజరాజనరేంద్రుని గూర్చి యొక కథ ఆంధ్రమున వ్యాపించినది. ఆ కథ వాస్తవము కాదని చరిత్ర వేనోళ్ల నుద్ఘోషించు చున్నది. కాని జాషువా ఈ జనశ్రుతిని విశ్వసించినట్లే పద్యమును బట్టి తెలియుచున్నది.

'తొలి సారంగధరుండు వట్టి
యపవాదు న్నెత్తిపై దాల్చి క
త్తుల పాలైన విషాద గాథ వినలేదో
నీవు చిత్రాంగి మే
డలలో మూలుగుచున్న యిప్పటికి
గూడన్ బావురాల్ నీతికిన్
బలియై పోయిన రాజనందనుని
దౌర్భాగ్యంబు నూహింపుచున్.'

ఇట్లెన్నియో ఆంధ్ర పట్టణముల నీ కవి స్తుతించెను. ఆంధ్రదేశమునందలి పట్టణములనే గాక

నలందా పాటలీ పుత్రములు, వారణాసి, ఢిల్లీ, ఆగ్రా, కురుక్షేత్రము, లుంబినీవనము, త్రివిష్టపము మున్నగు ఆంధ్రేతర ప్రదేశములను గూడ ఈ కవి వర్ణించినాడు. కైలాస ప్రయాణమున తప్పదు గదా! ఇట్లు జాషువా కవీంద్రుడు దురాచార నివారణోద్దేశముతో పాటు తన దేశారాధన తత్పరతనుగూడ ఈ సందేశ కావ్యము ద్వారా నిరూపించుకొన్నాడు.

### మే ఘ దూ త ము

సరస్వతీ పుత్రుని మేఘదూతమున గూడ కాళిదాసుని మేఘదూతమున వలె రాయబారి మేఘుడే. రాయబారమున పంపునదిగూడ ప్రేయసికి దూరమైన ప్రియుడే. కాని నాయకుడు నాయికకు దూరమైన కారణము వేరు. నాయకుడు మేఘునకు నిర్దేశించిన మార్గము వేరు. ధనవంతుల దౌర్జన్యమునకు లోనై శ్రీకాకుళ వాసియైన పేదనాయకుడు దక్షిణప్రాంతమున నొక చెఱసాలలో బంధింప బడినాడు. అతడు తన వనితకు మేఘము ద్వారా సందేశము నంపుటయే యిందలి కథావస్తువు. పేదసాదుల బాధాగాథలను విన్పించుచు ఆంధ్రదేశమును స్తుతించుటయే ఈ కవీంద్రుని ఆశయము. గబ్బిలమున యావద్భారతము నందలి ప్రదేశములు వర్ణింపబడగా ఈ గ్రంథమున ఆంధ్రప్రదేశమునందలి స్థలములకే ప్రాధాన్యమీయ బడినది. గబ్బిలమునలేని తెలంగాణాప్రాంత వర్ణన ఇందధికముగా గలదు.

ఈ నాయకుడు కారాగారమునబడుట ప్రథమ ఖండమున వర్ణింప బడినది. ధనవంతుల దౌష్ట్యము గాంచి అన్యాయమనుటయే అతడు గావించిన దోషము.

'అఱజాతి మనుజులకు
నధికారములు జూచి
అధికారమున దళిత
మైన యొదలను జూచి—
ధనిక రావణులచే
తలఁజూచి—వారి భో
గేచ్ఛకై యేర్పడిన
గీడు లోకము జూచి
అన్యాయ మన్యాయ
మన్యాయ మన్నాడు
వాడు మానవుడూ?'

అన్యాయ మనుటయే అన్యాయమని హృదయము లేని శాసన మాతనిని కుటిల కారాగార కఠిన దంష్ట్రకనచటళితుని గావించినది. అకటా, విరహముతో బాధ నొందుచున్న అతనికి మేఘము కన్పించినది. ఆ మేఘమున కతడు గావించిన విన్నపము కరుణ శృంగారముల సుఖ సమ్మేళనము. జలదమునకు మార్గ నిర్దేశము గావించుచు రెండవ గేయములోనే

నిండు టాకలి దూాయ
మండు టెండలు గాయ
నడపీనుగులవోలె నిలచీ—శిరసుపై
గడుధూళియును దుమ్ము చెరసీ—కనపడెడు
హరిజనులపై నుంత యాదరము నీవైన
పరిపరా వారి నోదార్చువారే లేరు'

అని హరిజనుల నోదార్చుమని కోరినాడు. రాళ్లు మోయుచున్నవారి, కంకర కొట్టుచున్నవారి, కట్టుబట్టకు నోచుకోనివారి కష్టజీవితమును, పేదల పంటతో సంచులు నింపుకొను ధనవంతుల దుర్మార్గమును విచారముతో వివరించెను. పడ్డికాసుల కాశించి పేదల కొంప లార్చు ధనవంతుల ముఖము చూడ వద్దని ఈ కావ్యనాయకుడు మేఘుని హెచ్చరించుట గూడ జరిగినది. ఈ క్రింది గేయములో పుట్టపర్తి వారు పొట్టకోసము పాటుపడు పేదల కష్టములను కన్నులకు కట్టునట్లు వర్ణించి నారు. పేదసాదులపై ఈ కవీశ్వరునకున్న సానుభూతి కీ గేయములు చక్కని యుదాహరణములు.

"వాఁడె గమ్మరి చూడు!
దౌర్భాగ్యముల గూడు!
కొలిమినూదుచునున్న వాఁడూ!— తనపొట్ట
కోసమై నవయు చున్నాడూ!— అల్లంత
దూరాన నదె వాని తొయ్యలిని గనుగొమ్ము
జీఁడి చనులతో — చీరనోచని చాన
తెలినవ్వులందముల
జిలికింప మొగముపై
పాలకై యేడ్చుచున్నాడూ—బుడుతండు
పటు దలకెత్తి కొన్నాడూ—ఆ తల్లి

చనుబాల నిచ్చునో! దన యురము చీల్చి ర
క్తంబులే ద్రాపునో! ధనికులే మెఱుగుదురు?'

ఇట్లీ కవీంద్రుడు దరిద్రుల తరపున వకాల్తా పుచ్చుకొన్న వకీలువలె గోచరించినను ఈ గ్రంథమున శృంగారపు పాలు హెచ్చని చెప్పక తప్పదు. మేఘమునకు గావించు మార్గనిర్దేశము శృంగారముతోనే ప్రారంభమైనది

'జలదమా! వినవోయి!
పలికెను నీ తెరువు
లిటనుండి మెలమెల్ల సాగ—పర్వతపు
కటకములను నుయ్యాల లూగి—చెంచితల
దర నక్షత్రగుచ్ఛ పరిణతాంకములందు
సరిగాగ— నమృత సేచన చేసి—పోవోయి'

ఈ గ్రంథమునందలి 290 మార్గనిర్దేశ గేయములలో పీడిత తాడిత జనుల బాధలను వర్ణించు గేయములు అర్ధశతముగూడ నుండవు. తక్కిన గేయములన్నియు శృంగారమునో, దేశచరిత్రనో ప్రధానముగా గలవి. నాయకుడు కడుపేదవాడు. వాని ప్రేయసి సౌందర్యము ప్రబంధ నాయికల సౌందర్యమునకు సమానమైనదని యిందలి వర్ణన.

'నిడుద గన్నుల దాని
నిండుఁ జెక్కుల దాని
నడుము వడకెడు దాని
నగవు చిత్తడి దాని
వెడఁగు నడకల దాని
పేర్మి పొడవగు దాని
దానిమ్మ పూవంటి
తళుకుఁ బెదవుల దాని
తన్వంగిఁ దలపోసి
తలపోసి—నిట్టూర్చు
వాడు మానవుడా!'

గబ్బిలమున హరిజనుల కష్టములు ప్రధానము. కాని వారి కష్టములు వివరింపబడిన పద్యముల సంఖ్య స్వల్పము. మేఘదూతమున కష్టజీవుల దీనగాథా వివరణ ముఖ్యము. కాని వారి హైన్యజీవితమును వివరించు గేయముల సంఖ్య స్వల్పము. గబ్బిలమున దేశారాధన, మేఘదూతమున శృంగార వర్ణన—అప్రధానమైనవి ప్రధానముగా సాగినవి. నాయిక చూపులను తోకచుక్కలతో, ఆకాశమున పయనించు మేఘమును సంస్కారపంతమైన సత్కవిత్వములో, మంచు గప్పిన గోల్కొండను మేలిముసుగు దాల్చిన బీబీతో రమణీయముగా పోల్చి సత్కవిశ్రేణిలో చేరిన నారాయణాచార్యులు గారు శృంగారపు పాలు తగ్గించి, కరుణ కధిక ప్రాధాన్యము నొసగినచో సమంజసముగా నుండెడిది.

ఈ నాలుగు గ్రంథములే గాక సందేశ కావ్యములింకను కొన్ని యుండవచ్చును. కాని అపారాంధ్ర కావ్య ప్రపంచమున ఈ సందేశ కావ్యములు ఎడారిలో ఒయాసిస్సులు. సందేశ కావ్యము లధిక సంఖ్యలో వెలసినచో అనుకరణ తప్పని సరియగునని, స్వాతంత్ర్యము లోపించునని ఆంధ్ర కవీంద్రు లభిప్రాయపడుట ఈ స్వల్పసంఖ్యకు కారణమేమో! ఆంధ్రదేశమున ప్రతిభ గల కవీంద్రులనేకు లున్నారు. అనుకరణములుకాని గ్రంథములు తలపెకొన్నచో వారు వ్రాయలేకపోరు. మును ముందాంధ్ర సాహిత్య కేదారమున సందేశ కావ్యాల పంట యధికము కాగలదని అస్మదాదుల ఆశయము.



# లామూలో శిథిలావస్థలో నున్న భవనాలు— సాటిలేని వాటి అందం, కట్టడాల రీతులు

శ్రీ పాల్ టౌల్ మిన్—రోథే

[కీన్యాకు అనతిదూరంలో లామూ అనే ద్వీపం ఉంది. ఆఫ్రికా తూర్పుకోస్తా అంతటా ఒకప్పుడు ప్రసిద్ధి గాంచిన స్థానిక వాస్తు శిల్పరీతుల అవశేషాలూ, శిథిలావస్థలోనున్న ఇక్కడి భవనాలూ కానవస్తాయ్.

ఈ భవనాలు కాలగర్భంలో లీనంకాకుండా ఆ నాటి నాగరికతా సంస్కృతీ చిహ్నాలుగా కాపాడే ప్రయత్నాలను 'ఫోరమ్ వరల్డ్ ఫీచర్స్' విలేఖరి శ్రీ పాల్ టౌల్ మిన్—రోథే ఈ వ్యాసంలో వివరించారు.]

హిందూమహాసముద్రంలో సుందరమైన ఉత్తర కీన్యా తీరానికి ఎదురుగా ఉన్న ప్రశాంతమైన చిన్నద్వీపం 'లామూ' గురించి ఇటీవలి వరకూ తూర్పుఆఫ్రికావాసులకు తప్ప మరెవ్వరికీ తెలియదు. నేటి స్థితి వేఱు. ఆ ద్వీపాన్ని గురించిన వార్తలు ఎక్కువగా వినవస్తున్నవి.

సెలవు రోజుల్లో కొత్త కొత్త ప్రదేశాలు చూడ్డానికి వెళ్లే సామాన్యయాత్రికులను, పూర్వం ఏ కొద్దిమంది ఔత్సాహికులకో తెలిసిన ప్రత్యేకమైన దాని అందచందాలూ ప్రత్యేకంగా జెట్ విమానాలలో యాత్రలు చేసే భాగ్యవంతులను — ఇప్పుడిప్పుడే ఆకర్షిస్తున్నాయ్. కొన్ని సంవత్సరాల క్రితం లామూను 'కనిపెట్టినవారు', ఇంతవరకూ 'సహజత్వంతో కూడిన తమ ద్వీప సౌందర్యం' — ఇందుమూలంగా దెబ్బతింటుందేమోనని సహజంగా బాధపడుతున్నారు.



[లామూలో ప్లాస్టర్‌తో చెక్కబడిన శిలా ఖండాలతో నిర్మింపబడిన ప్రాచీన భవనాల శిథిలాల్లో ఒక భాగం]

అయినా, యాత్రికుల రాక, అందుతోబాటు—క్రొత్తగా వృద్ధిచెందుతూన్న వ్యాపారాభివృద్ధి—లామూలోని కీన్యా జాతియుల అమూల్య పురాతన సంస్కృతీ నాగరికతలను కాపాడి భావి తరాలవారికి అందించగలవు.

నేడు అవి ఇతర పురాతన తీరస్థ నగరాలవలె శిథిలమై నశించే ప్రమాదంలో ఉన్నాయి. ఈ హిందూ మహాసముద్రతీర ప్రాంతం అనాదిగా విశేషమైన వాణిజ్య వ్యాపారాలతో కళకళలాడుతూ, అక్కడి ప్రజలు లాభాలు సంపాదించి భాగ్యభోగ్యాలతో తులతూగినట్లు— పురావస్తు పరిశోధకులు, చరిత్రకారులు, విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పి ఉన్నారు. ఈ శిథిలాలు ప్రాచీన ఈజిప్టు రాణి హాట్—షెప్—సట్ కాలాని వనటానికి దాఖలాలు కనిపిస్తున్నాయి. ఇట్టి నాగరికతా శిథిలాల్లో— ఇటీవల పునరుద్ధరింపబడిన పట్టణం 'మండా' అనే పట్టణం. లామూకు పక్కనే అదే

పేరుగల దీవిలో ఈ పట్టణం వుంది. 'పర్షియా సింధు శాఖ ప్రాంతపు వ్యాపారులు ఇక్కడ క్రీ. శ. 9—వ శతాబ్దం ఆ ప్రాంతంలో, బహుశా క్రీ. శ. 800 నుండి, స్థిరనివాసం ఏర్పరచుకున్నటు కనిపిస్తున్న' దని తూర్పు ఆఫ్రికాలో బ్రిటీష్ చారిత్రక, పురాతత్వ సంస్థ డైరెక్టర్ నెవిల్లీచిట్టిక్ వ్రాతలను బట్టి తెలియవస్తూంది.

13 వ శతాబ్దంలోనే ప్రాధాన్యతలోకి వచ్చిన లామూ తర్వాత దాని ప్రాధాన్యతను కోల్పోయింది తిరిగి 18 వ శతాబ్దపు ఉత్తరార్థంలో అది మళ్లీ ప్రసిద్ధి గాంచింది. ఆ విధంగా ఎగుమతి దిగుమతులు, వస్తు సేకరణ పంపిణీల వ్యాపారంలో ప్రసిద్ధిగాంచిన తీర నగరాలలో చివరిదిగా లామూను పేర్కొనచ్చు. చివరికి తూర్పు ఆఫ్రికాలో వలసలు ఏర్పడిన తర్వాత దీని ప్రాశస్త్యం శాశ్వతంగా నశించింది.

కిల్వా, మొంబాసా, మాలింది—వంటి నగరాలు వాటి ప్రాశస్త్యం కోల్పోయిన తర్వాత చాలాకాలం వరకు, లామూ, భాగ్యవంతమైన సుందర నగరంగా రాణ కెక్కింది. తర్వాతి కాలంలో ఈ గొప్పతనం మెల్లమెల్లగా తగ్గుతూ 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో మరుగున పడిపోయింది. ఇతర అతిప్రాచీన నగరాల్లోని భవనాలవంటి గొప్పభవనాలలో 'లామూ' ప్రజలు సుఖసౌఖ్యాలలో జీవించారు. లామూ ఔన్నత్యం తగ్గి శతాబ్దకాలంగూడ గడవనందున, అక్కడి—ఇళ్లు—ఇళ్లు కాదు భవనాలనటమే సబబు — ఇప్పటికీ నిలిచి ఉన్నాయి. వాటిలో ఇంకా ప్రజలు నివసిస్తున్నారు.

అయినా ఆ భవనాలు మంచి స్థితిలో ఉన్నా యనలేము. అందంలోనూ, నిర్మాణ చాతుర్యంలోనూ, రూపకల్పన లోనూ సాటిలేని ఈ నిర్మాణాలు చాలా క్షీణదశలో ఉన్నాయి. ఆ నిర్మాణాల పై కప్పులు పాడైపోయి, అలంకారప్రాయమైన భాగాలు పడిపో తున్నాయి. ఇది చాలా విచారాన్ని కలిగిస్తూంది :

## ఇంతకూ మించిపోయిందేం లేదు

అయినా కాలం మించిపోలేదు. ఈ తీరపు 'స్వాహిలీ' నాగరికతపై పెరుగుతున్న ఔత్సుక్యం కారణంగా — ఈ భవనాల్లో కొన్ని తిరిగి వాటి పూర్వ సహజ సౌందర్యాన్ని సంపాదించుకుంటున్నాయి. పూర్వం ఈ నిర్మాణాలూ ఎలా జరిగాయో తెలిసినవారు, తిరిగి వాటిని పునరుద్ధరించ గలవారు ఇక్కడింకా కనిపిస్తున్నారు. కొత్త ఇళ్లకై పాతవాటిని తొలగించే బదులు, అందమైన పాత భవనాలను పునరుద్ధరించి స్థానికాధికారుల నివాసాల కుపయోగించేందుకు ప్రభుత్వ శాఖలు ఆలోచిస్తున్నాయి.

లామూ భవనాలలో ప్రత్యేక ఆకర్షణ ఏమిటి? వాటి ప్రత్యేక లక్షణాలు చాలా ఉన్నాయి. కాని రెండు విషయాలు అందులో ప్రధానమైనవి. అందులో ఆ నిర్మాణాల అలంకారాలు మొదట పేర్కొనదగ్గవి. అవి ప్లాస్టరులో చెక్కబడిన అలంకారాలు. ఉష్ణ మండల ప్రాంతంలోని జనబాహుళ్యానికి వసతికి తగినట్లుగా ఆ కట్టడాలు నిర్మించటంలో నిర్మాతలు ప్రదర్శించిన ఊహాపోహాలు రెండవ ప్రధాన విషయం—ఇంతకుమించిన పరిష్కారం మరెవరికీ బహుశా తట్టి ఉండదు.

లామూ ప్రజలు శాంతంగా, భాగ్యభోగ్యాలతో, గొప్పనాగరిక జీవితం గడిపిన వారు. ఇప్పుడు మిగిలిందల్లా వారి గృహాలు—అవి ఇప్పుడు తొందర తొందరగా శిథిలావస్థను చేరుకుంటున్నాయి.

కాని, వాటిని రక్షించవచ్చు; రక్షించాలి. వాటిలో కొన్నింటిని భాగ్యవంతులైన కీన్యా జాతీయులే కొని, పునరుద్ధరించి, తమ నివాస గృహాలుగా ఉపయోగించుకుంటారు. జాతీయ సంస్కృతీ పరిరక్షణ శాఖ కొన్నింటిని ప్రభుత్వమే పునరుద్ధరిస్తుంది. యాత్రలను ప్రోత్సహించి సంపాదించే లాభాలతో పునరుద్ధరించి, యాత్రికులకు చూపించటానికి, భావి తరాల కీన్యా జాతీయులకు గర్వకారణంగా తమ పూర్వౌన్నత్యాన్ని గుర్తించటానికి కాపాడబడగలవు.

(ఫోరం వరల్డ్ ఫీచర్స్ సౌజన్యంతో)

కలగూరగంప :

# ఆధునిక యుగము - గాంధీ సాహిత్యము

ఆర్యా,

ఆంధ్ర సాహిత్యంతో పరిచయం గలవారికి శ్రీ నిడదవోలు వేంకటరావుగారు చిరపరిచితులు. వారి అవిరళమైన కృషి అపారమైన సారస్వత పరిచయము తెలుగువా రెరిగినవే. సాహిత్యరంగంలో నిష్ణాతులైన వీరు ఫిబ్రవరినెల భారతిలో వ్రాసిన 'ఆధునిక యుగము—గాంధీ సాహిత్యము' అను శీర్షికగల వ్యాసం వారి పట్లగల గౌరవాన్ని కొంచెపరచేదిగా ఉందనడానికి సాహసిస్తున్నాను.

తొలుతగా వారి శీర్షికను పరామర్శిస్తాను. ఇందులో వీరు చెప్పిన 'ఆధునిక యుగము' అనేది ఏదో తెలియదు. '1919 అక్టోబరు తే 2 దిని గాంధీ మహాత్ముని ఏబదవ జన్మ దినమున పద్యములను వ్రాసి 'గాంధీ సాహిత్యము'నకు శ్రీకారము చుట్టితిని' అని వ్రాయడాన్నిబట్టి ఈ 'గాంధీ సాహిత్యము'వారు వ్రాసిన ఏదో గ్రంథానికి పేరుగా భావించాను. కాని మళ్లీ వారే 'భారత స్వాతంత్ర్య కాలమున—క్రీ॥ శ॥ 1920 నుండి ఆంధ్రదేశమున వ్యాప్తమైన సాహిత్యమునకు, గాంధీ సాహిత్యము అని పేరు. ఇది పూర్తిగా ప్రజానీకమునకు సంబంధించినది' అని వ్రాశారు. ఈ రెండూ చదివేక వారు చెప్పిన 'గాంధీ సాహిత్యం' ప్రారంభమైనది 1919 లోనా? లేక 1920 లోనా అన్న ధర్మ సందేహం కల్గింది.

అది అలా వుంచి 1920 నుండి వ్యాపించిన సాహిత్యానికి గాంధీ సాహిత్యమని పేరు అంటే, ఆ మాట ఎవరన్నారు? బహుశా వేంకటరావుగారే ఆ పేరు పెడుతున్నారేమో, కాని ఇదివరకు వాఙ్మయ చరిత్రకారు లెవరూ ఈ పేరు పెట్టలేదు. వారు చెప్పినదాన్నిబట్టి 1920 నుండి వ్యాపించిన సాహిత్యమేదైనా, అంటే భావకవుల ప్రణయగీతాలనుండీ, అభ్యుదయ కవుల వచన పద్యాల వరకూ అన్నీ గాంధీ సాహిత్యమేనేమో (ఆయన ఉద్దేశంలో) అని అనుమానం కలిగింది. అయితే యిది పూర్తిగా ప్రజానీకమునకు సంబంధించినది అనడంచేత ఇందులో ఎంకి పాటల్ని, బసవరాజువారి గేయాల్నీ, శ్రీ శ్రీ మహాప్రస్థానాన్నీ, ఆరుద్ర త్వమేవాహాన్నీ చేర్చవచ్చునీ ప్రజానీకంతో సంబంధం లేనివి గాంధీ సాహిత్యం కాదనీ అనుకున్నాను. ఈ విధంగా ఆలోచిస్తే గాంధీ సాహిత్యానికి ప్రజానీకంతో సంబంధమే ముఖ్యలక్షణమేమో అనిపించింది.

అందుకు తగ్గట్టుగా 'ఆంధ్ర వాఙ్మయమున ప్రజలను ప్రబోధించిన సాహిత్యములు రెండు. మొదటిది పండ్రెండవ శతాబ్దిని శైవసాహిత్యము. రెండవది ఇరువదవ శతాబ్దమున గాంధీ సాహిత్యము' అని వీరు వ్రాశారు. ఇలా వ్రాస్తూ వారు పూర్వకవులైన శివకవులు, వేములవాడ భీమకవి మొదలైనవారిని గూర్చి వ్రాశారు. 'తెలుగున స్వాతంత్ర్య పథకమును తొలుత ప్రవర్తింపజేసినవారు కవులు. కావున వారి చరిత్ర గాంధీ సాహిత్యమున తొలి ఘట్టము...రాజప్రశంస నాందిగాగల నన్నయ భారత మవతరించిన మరి నూతేండ్లకే—కవితా స్వాతంత్ర్యము వ్యక్తిస్వాతంత్ర్యము ప్రదర్శించిన కవులుండుట గమనార్హము. వారే శివకవులు' అని వ్రాశారు. అంటే స్వాతంత్ర్య పథకాన్ని తొలుత ప్రవర్తింపజేసిన కవుల చరిత్ర గాంధీ సాహిత్యంలో తొలిఘట్టం కాబట్టి, శివకవులతోనే గాంధీ సాహిత్యం ప్రారంభమైందని వారి భావమా? ఇంత దూరం పోయాక 'ఆధునిక యుగము' అనే మాటకు కూడా 'కాలవాచకంగా' కాక 'ఆధునిక భావ చేతన' అని అర్థం చెప్పుకోవాలేమో? ఇలా వారి వ్యాస శీర్షిక అస్తవ్యస్తమైన ఊహలు కలిగిస్తోంది.

'కవులు—స్వాతంత్ర్య పథకము' అని వ్రాస్తూ వారు వివిధ కవుల స్వతంత్ర బుద్ధిని రాజులకు లొంగి వుండని స్వేచ్ఛ ధైర్యము ప్రశంసించారు. సీటిలో మొదట వేములవాడ భీమకవినిగూర్చి 'ఇది కట్టుకథ కాదు. తిట్టుకథకాదు. కవి గట్టిదనము నుట్టంకించు కథ' అని వ్రాశారు. నిజానికిది వట్టి కట్టుకథ. కాకపోతే యిందులో కవి గట్టిదనంకంటే 'దబాయింపు' కనబడుతుంది. బిచ్చగాడు పెట్టని వారిని తిట్టినట్టుగా తిట్టిన భీమకవిలో గట్టిదనం ఏముంది? ఇంతకీ ఆయన రాజును తిట్టినది ప్రజానీకానికి సంబంధించి కాదు. తనకి కావాల్సిన వేవో సమకూర్చలేదని. ఇదిగాక ఇందులో కవుల స్వతంత్ర బుద్ధినిగూర్చి చెప్పినవన్నీ చారిత్రకంగా ఋజువైనవి కావు. పోతనగారి 'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి......' అనే పద్యాన్ని రాయల్ అండ్ కోవారు ప్రకటించిన భాగవతం యొక్క పరిష్కర్తలు ప్రక్షిప్తంగా భావిస్తున్నారు. సంకుసాల నృసింహకవి, అల్లసాని పెద్దన ఒక కాలం వారని నిర్ధారితం కాలేదు.

భీమకవేగాక మిగిలిన కవులుకూడా రాజులను తిరస్కరించినా, వారిని తూర్పారబట్టినా, ధిక్కరించినా అది ప్రజానీకానికి సంబంధించింది కాదు. పోతన 'ఇమ్మనుజేశ్వరాధముల...' కివ్వననడంలో ఆధ్యాత్మిక చింతన, పాపభీతి కారణం అని పద్యంలోనే వుంది. (ఒకవేళ ఈ పద్యాన్నే ప్రమాణంగా గ్రహిస్తే) అందుచేత పోతన కృతిని రామాంకితంచెయ్యడంలో సెంటిమెంటేగాని స్వతంత్రేచ్ఛ, ప్రజా కవిత్వం, అభ్యుదయం ఇలాంటి ఉన్నతాశయా లేవీ లేవని నిస్సంశయంగా చెప్పొచ్చు. కూచిమంచిజగ్గకవి తన కృతిని గ్రహించని కారణంగా ఆగ్రహించి బూతులు తిట్టాడు కాని ప్రజల కేదో అన్యాయం జరిగిందని ఆక్రోశించలేదు. విక్కిరాల రంగాచార్య కవి శిస్తు బకాయికి మాన్యాలు స్వాధీనం చేసుకోగా, దారిద్ర్యం భరించలేక రాజును నిందించాడు. ఆయన కోపమంతా 'జగతీ సురోత్తముల భూముల్ రాజగోపాలుండు చొక్కం డుర్విధవుండు బల్మి గొని గర్వ్యద్రిక్కుడై యున్నవా'డని. మిగిలిన ప్రజానీకాన్ని గూర్చిన చింత లేదు. యాదృచ్ఛికంగా రాజు పులివాత పడడాన్ని మన ఛందశ్శాస్త్రజ్ఞులు చెప్పిన విషయాలన్నీ సత్యమే అని సమర్థింపజూడడం ఏమంత సమంజసం? కాళహస్తీశ్వర శతకంలో గాని, రామలింగేశ్వర శతకంలో గాని తత్కర్తలు చేసిన దూషణ పరోక్షమైంది. అందులో దుర్మార్గులైన రాజుల్ని దూషిస్తే వారి ప్రభువులకు కోపం ఎలా వస్తుంది? వాళ్లు తమను మంచివాళ్లుగానే గ్రహిస్తారు. ధూర్జటి రాజదూషణ వైరాగ్యంతో కూడినది. నూరకవి రాజనింద మాన్యా లిచ్చేవారు లేరనీ, చెడిన ఊళ్ల గోడు వినలేదనీ, మొదలైన లౌకిక చింతతో కూడినది. కాకుంటే ఇతడు కొంత పేద సాదల్ని గురించి తలంచడంతో ఈ శతకం 'ప్రజానీకానికి సంబంధించింది'గా భావించారేమో. వీరికి స్వాతంత్ర్య పథకమూ లేదు. స్వతంత్ర పథమూ తెలియదు.

కాగా పై కవులందరూ రాజుల్ని స్వప్రయోజనాలనాశించి దూషించారే గాని, స్వతంత్రత కోసం కాదు. రాజకీయంగా పలుకుబడిగల కవులు రాజుల్ని రాకొట్టినా, చీకొట్టినా, తిరస్కరించినా చెల్లుబాటు కల్గింది. పలుకుబడి లేక నిరాశతో తిట్టినవారికి కష్టాలలా కలిగాయి. 'ద్రాక్షారామ పురీవిహార వరగంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ కుంభి కుంభములపై' వాసింపజేయడానికి 'కస్తూరికా భిక్షాదానముం జేయరా' అని దబాయించి పుచ్చుకున్న శ్రీనాథుడికే అవసానకాలంలో రాజకీయమైన పలుకుబడి తగ్గి కష్టాల తప్పాయి కావని చెప్తున్నారు.

'ఆధునిక యుగమున నాంగ్లపాలనలో 'స్వాతంత్ర్య పథ ప్రథమ ప్రవర్తకుడు కొక్కొండ వేంకట రత్నము పంతులు' అని వ్రాశారు. ఈ మాటలు వారికి కొక్కొండ వారిపైగల ప్రగాఢాభిమానం తెలియజేస్తున్నాయి. అతని స్వాతంత్ర్య పథకం రాజకీయ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం, భాషా స్వాతంత్ర్యం అనే భాగాలుగా విభజించారు.

రాజకీయ స్వాతంత్ర్యంలో భాగంగా అతడు

గణకుడుగాను, గుమాస్తాగను పనిచేసినకాలంలో అధికారులని 'Your honour' అని సంబోధించ లేదంటున్నారు. తన వృత్తి 'శ్వవృత్తి'గా భావించారట. ఈ రెండగా వ్యక్తిగతమైన విషయాలు. ఈనాడు కూడా మన ప్రభుత్వంలో పనిచేసేవాళ్లు కొందరు ఈలాటి భావాలు కలిగివుంటారు. అది వారి వైయక్తిక ఆత్మాభిమానం. తమ వృత్తిలో వారికి గలిగిన అసంతృప్తి. కాని అదిరాజకీయ స్వాతంత్ర్యంగా భావించలేం. 'ఇంగ్లీషు భాష'కు పర్యాయపదంగా 'హూణభాష అనేది ఆయన వ్యాప్తికి తెచ్చేరని అదొక గొప్పవిషయంగా చెప్పారు. తెచ్చినా లేకపోయినా 'ఇంగ్లీషు భాష' అన్నపదానికి 'హూణ భాష' అని ప్రయోగించడం భాషా ఛాందసమే కారణంగాని స్వాతంత్ర్యం కారణం కాదు. 'ఇంగ్లీషు భాష' అనే వ్రాయాలని ప్రభుత్వం అదేశించనూ లేదు. కొక్కొండ తెల్లవారు, శ్వేతముఖులు, అర్జునాస్యులు, హూణులు, మ్లేచ్ఛులు అనే పదాలు వాడడం స్వాతంత్ర్యానికి నిదర్శనంగా భావించడం సమంజసమా? 'తదర్జునాస్య నృప మాన్య సమాగమ సచ్చరిత్రమున్' అనే దాన్లో ప్రభుత్వానికి విధేయత ఉట్టిపడుతున్నాదే 'నిప్ప్రభురాజ్య'మని వ్రాయడంలో 'కవి కల్పద్రుములైన సత్ప్రభువులు' లేరనే బాధ వ్యక్తమవుతున్నాది. దీనిమీద రాజకీయ విచారణ జరిగితే వ్యక్తిగతమైన కారణాలుగా భావింపవలసి ఉంది.

వీరేశలింగంగూర్చి 'ఆతడాంగ్లేయాధికారుల యను యాయియై వారి ప్రాపకము వలన—విద్యాశాఖలో విశ్వవిద్యాలయములో పలుకుబడి సంపాదించి తుదకు రావు బహద్దరు బిరుదము నందినాడు. ఇంత పారతంత్ర్య భావనగల వీరేశలింగము మనకు స్వాతంత్ర్యము రాగానే నవ్యయుగ పురుషుడైనాడు. ఆతని చరిత్ర ఖండాంతరముల కెక్కినది' అని వ్రాయడం పక్షపాతంతో కూడినదిగా వుంది. వీరేశలింగం తన సంఘ సంస్కరణలో ఎందరిని ఎదిరించాడో, ఎంతమంది పండితులతోనూ పూర్వాచార పరాయణులతోనూ తీవ్రంగా వాదించి నిల్రదొక్కుకున్నాడో ఆలోచిస్తే అతనికి స్వాతంత్ర్య భావన ఎక్కువో, పారతంత్ర్య భావన ఎక్కువో తెలుస్తుంది; ఆయన భాషకు సంఘానికి చేసిన సేవ అద్వితీయమైనది. అతన్ని అందుకే నవ్యయుగపురుషుడుగా భావించారు. ఆతని సంస్కారవంతమైన భావాలు, ఆంగ్లేయుల భావాలతో ఏకీభవించడంవల్ల ఆంగ్లేయుల్లో అతనికి పలుకుబడి, ప్రతిష్ఠ పెరిగినంత మాత్రాన స్వాతంత్ర్యానికి వీరేశలింగం వ్యతిరేకుడని అనగలమా? ఇంకా విచిత్రం ఏమిటంటే వీరేశలింగాన్ని గూర్చి యింతవరకు వెలువడిన ఏ చరిత్రలో గాని, విమర్శనాల్లో గాని కొక్కొండవారి ప్రసక్తి కానరాలేదని వేంకటరావుగారు వాపోతున్నారు. ఇదేం న్యాయం? వీరేశలింగంగారిని గూర్చి వ్రాసినదాన్లో తప్పక కొక్కొండవారిని గూర్చి వ్రాయాలా? వీరేశలింగంగారు కావ్యపాఠాలు చెప్పలేక పోవడానికీ ఆయన భాషాసేవకీ సంబంధం లేదు. ఈ విధంగా వ్యక్తిగత విషయాలలో వీరిని పోల్చడం అనవసరమూ, అనుచితమూ. దీనివల్ల సాహిత్యకులకు ప్రయోజనం ఉండబోదు.

ఇంతవరకూ గాంధీ సాహిత్యమన్న పదం గాంధేయ సిద్ధాంతాల్ని అనుసరిస్తూ గాని, ప్రచారం చేస్తూ గాని వ్రాసిన వాటినే గాంధీ సాహిత్యమని వాడటం జరిగింది. వీరు ఈ గాంధీ సాహిత్యం పేరుతో ఇంకా ఏమేం వ్రాస్తారో చూడవలసి ఉంది. ఇప్పటి వీరి వ్యాసానికి విషయైక్యత లేదు. దీన్ని రెండు వ్యాసాలుగా పేర్కొనొచ్చు. 1. కొందరు ప్రాచీన కవుల రాజదూషణ 2. కొక్కొండ వేంకటరత్నం పంతులు ప్రశంస.

శ్రీ టి. జి. కృష్ణారావు

## వచనపద్యం : ఒక పరిశీలన

పద్యం అనగానే దానికి పాదబద్ధత ఉండాలి అన్నది మొదటి నియమం.

పద్యంయొక్క పాద నిర్మాణానికి 'ఛందోబద్ధమైన పద్ధతి'కూడా ఒకటి ఉండి తీరాలి అన్నది

రెండో నియమం. దీన్నే 'పాదంయొక్క అంతర్ని ర్మాణం' అనవచ్చు.

ఒక గతి ననుసరించి మాత్రల పరిమితి గాని, గురులఘువుల నిర్దిష్ట వ్యవస్థగానీ, గణపద్ధతిగానీ ఏదైనాసరే ఒక పద్ధతి ననుసరించి— అదీ ఛంద శ్శాస్త్రరీత్యా చెప్పబడ్డ పద్ధతే అయ్యుండాలి—పాదం యొక్క అంతర్నిర్మాణం— ఏర్పడుతుంది.

(1) పాదానికి మొత్తం ఇన్నిమాత్రలుండాలి. ఫలాని చోట్ల గురువులు లేక లఘువులు ఉండరాదు. (లేక) ఉండవచ్చు. (లేవా) ఉండవలె అన్నవిధి నిషేధాలు ఒక పద్ధతి అంతర్నిర్మాణం.

(2) పాదానికి మొత్తం ఇన్నిమాత్రలు; లయానుసారంగా, గతిభేదాన్నిబట్టి ఇన్నేసి మాత్రలకు విరుగుతూ, సమగతి విషమగతుల ననుసరించిన గురు లఘువుల విధి నిషేధాలతో గణవిభాగం చెప్పడం ఇంకొక పద్ధతి అంతర్నిర్మాణం. ఇది పరిభాషా బద్ధమైన శాస్త్రీయ పద్ధతి.

(3) పాదానికి ఇరవై అక్షరాలు ఉండాలి. 1, 4, 6, 10, 13, 16, 18, 20 సంఖ్య గల అక్షరాలు గురువులుగాను; తక్కినవి లఘువులు గాను ఉండాలి. ఇది ఉత్పలమాలా వృత్తం—ఇత్యాదిగా చెప్పడం ఒక అంతర్నిర్మాణ పద్ధతి.

(4) ఉత్పలమాలకు భ, ర, న, భ, భ, ర, వ —అనే గణాలు వరసగా ఉండాలి అనేది పరిభాషా బద్ధమైన గణపద్ధతి ననుసరించిన అంతర్నిర్మాణం. ఈ పద్ధతుల్లో అంతర్నిర్మాణం గూర్చి 'చెప్పడం' లోనే 'తేడా' లున్నవి గాని వస్తుస్థితిమాత్రం ఒకటే. పాదం అంతా ఒకటే యూనిట్‌గా తీసుకొని అంతర్ని ర్మాణం గూర్చి వివరణ యిచ్చినా; గణం యూనిట్‌గా తీసుకొని వివరించినా రెండూ ఒకటే. కాకపోతే మొదటి పద్ధతి ప్రాచీనమైతే దానికి బోలెడు వివరణ కావాలి; రెండో పద్ధతి సులభమైన అర్వాచీన శాస్త్రీయ పద్ధతి అంటే పరిభాషా క్లేశమూ, గణ సాంకర్యంవంటి మినహాయింపుల బెడదా పడాలి. కాని రెండూ చెప్పేది ఒకటే సంగతి. పాదానికి ఒక ఛందో బద్ధమైన అంతర్నిర్మాణ పద్ధతి ఉన్నది, ఉండాలి.

ఛందః పద్ధతిలో — అక్షరాల దగ్గర్నుంచి మాత్రలు, గురు లఘువులు, గణాలు, పాదాలు, పద్యం అనే పద్ధతిలో నిర్మాణం జరుగుతుంది. పద్యం దగ్గ ర్నుంచి పాదాలు, గణాలు, గురులఘువులు, మాత్రలు అనే విధంగా అక్షరాల కాడికి విభజన అవుతుంది. మధ్యలో గుణవిభాగం ఉండాలన్నా, అక్కరలేదు గురు లఘు నిర్దేశం చాలునన్నా వస్తుస్థితిమాత్రం ఒకటే.

కాని, అక్షరాల దగ్గర్నుంచి పదాలు, భావాం శాలు, భావాలు లేక భావగణాలు, పాదాలు, వచన పద్యం అనే రీతి నిర్మాణం ఛందోబద్ధమైన పద్ధతి కాదు. పదాలనుంచి భావాంశాలు, భావాలు వాటివల్ల భావగణాలు, భావగణాలనుబట్టి భావ లయ—ఇటి అంతర్నిర్మాణంతో ఏర్పడిన పాదబద్ధత వచన పద్యానికి చెప్పడం ఛందశ్శాస్త్రానుసారం మాత్రం కాదు. అది వేరే పద్ధతి కల్పన. అందువల్ల వచన పద్యాన్ని 'ఛంద స్సు'గా గ్రహించడానికి వీల్లేదు.

ఈ సందర్భంగా, అలౌకిక వైదిక వాఙ్మయ సంబంధి అయిన ఒకానొక మారుమూల సూత్రాన్ని ఆశ్రయించి ఋక్పాద వ్యవస్థ ('పఠనంలోనా? లేఖనంలోనా?) అర్థవశంగా ఉంటున్నది, వచన పద్య పాదవ్యవస్థ భావపరంగా ఉంటుంది కాబట్టి యిది గూడా ఛందశ్శాస్త్ర మర్యాదానుసారమే అని ఆధునిక లౌకిక సారస్వత సంబంధి అయిన వచన పద్యానికి ముడివెయ్యడం పద్ధతిగా లేదు. ఛందఃకారులెవరూ అర్థభావ వశంగా పాదవ్యవస్థను నిర్ణయించింది లేదు. ఇట్లాంటిదే విషమ వృత్తాల ప్రస్తావన కూడాను. అలాంటప్పుడు ఇక ఛందస్సు కాని దేముంటుంది?

ఒక శుద్ధ వచన భాగాన్ని — వ్యాసంగానీ, వ్యాపార ప్రకటనగానీ—భావగణాల పద్ధతి ననుసరించి పాదబద్ధత పాటించి రాస్తే లేదా అచ్చువేస్తే అది వచన పద్యమే అయ్యేటట్లయితే; వచనానికీ వచన

కిం మాలతి! మ్లాయసి మాం విహాయ
చుచుంబ తుంబీ కుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భిశ్చరణైః పశుస్స్యాత్
సషడ్భి రత్యర్థ పశు ర్న కింస్యాత్?

అయితే కంబం చెఱువుగట్టుపైగల ఒకానొక రాతిస్తంభంపై చెక్కబడిన 'తుక్షాపంచకమ్'లో ఇదొక శ్లోకంగా కన్పిస్తున్నదనీ, ప్రథమ పాదం 'కిం మాలతీం పాస్మసి మాం విహాయ' అనే చిన్న మార్పుతో నున్నదనీ, పైగా నీ తుక్షాపంచకములోని ఒక శ్లోకం క్రీ. శ. 1400 కు పూర్వమువాడైన వల్లభదేవుని సుభాషితరత్నావళిలోనూ, క్రీ. శ. 900 పూర్వమువాడైన ముకుళభట్టు విరచితమైన అభిదావృత్తిలోనూ కలదని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారన్నట్లుగా తిరుపతి దేవస్థానంవారి రిపోరులో కలదని, ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారి పరిశోధిత వ్యాసమైన 'ఆంధ్ర ప్రబంధము—అవతరణ వికాసములు' అనే గ్రంథంవలన తెలుస్తోంది. ఆ 'ఒక' శ్లోకం యీ 'కిం మాలతి' అనేదా మరొకటా అనే విషయం తేల్చుకోవలసి ఉన్నది గదా! కనుక ఆయా గ్రంథాల్ని పరిశీలించి 'కిం మాలతి' అను శ్లోకం యొక్క కర్తృత్వమును డా॥ మహీధర నళినీమోహన్ గారు నిర్ణయింపగలరని కోరుచున్నాను.

శ్రీ హెచ్. ఎ. ఆర్. సూర్యనారాయణ.

## శిల — శిల్పి — శిల్పము

**1973** మార్చి భారతి పత్రికలో శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు రచించిన 'శిలా శిల్పకళ విశిష్టత'ను చదివిన తదుపరి శిలాశిల్పిగా, స్థపతిగా నాకు తెలిసిన విషయములను కొన్నిటిని వ్రాయకుతూహలము గలిగినది.

శ్రీ నోరి నరసింహశాస్త్రి గారు శిల్పులుగా కున్నను కవితా శిల్పులు. శిల్పముపైగల మక్కువతో తాము సేకరించిన విషయముల నాధారము జేసికొని శిలాశిల్పికిగల విశిష్టతను చక్కగా వివరించిరి.

వారి వ్యాసమందు శిల్పియొక్క కార్యము శిలయందు అంతకు క్రితమే దాగియున్న రూపమును వెలికి తీసికొని వచ్చుటయును, దానికి అతని హృదయమే ఆ శిల్పమందు నిక్షిప్తముచేసి శిలాబంధమును తొలగించి, ఆత్మజ్ఞానమును కలిగించు సద్గురుస్వామి వంటివాడని పేర్కొనిరి.

శిల్పి చంద్రకాంత శిలలో స్వయంభువుగా నిక్షిప్తమైయున్న శిలామూర్తిని దర్శించు ననియు, అటుపిదప దానిచుట్టూ నిలిచి బంధించి మరుగు పరచిన రాతిని తీసివేయుట శిల్పపనియైనట్లు వారు వ్రాసియున్నారు. చక్కని చమత్కారము.

ఇందు కొన్ని విషయములను గమనింపవలసి యున్నది. ఏ శిలయును ఒక రూపమునకని నిర్దేశింపబడియుండదు. ఇది శిల్పి గానున్న యే వ్యక్తికైనను స్వానుభవమే. అది ఎట్లనగా కర్మాగారములో తయారగుచున్న కాగితములలో కొన్ని ముందే పలాని కవిగారిచే వ్రాయబడబోవు మహోత్తర గ్రంథమున కని ప్రత్యేకింపబడనట్లు. మనము శిల్పివద్దకువెళ్లి యే రూపమునైనను ఈ కొలతలకు కావలయునని తెలిపినచో అతడు దానికి సరిపడు శిలను తీసికొని మలచుట కారంభించును. ఇందు శిల్పికిగల శాస్త్ర పరిజ్ఞానము, కల్పనాశక్తి, పటిమ అనుభవము అను వానిని ఆధారము చేసికొని ఆ రాతిలో రూపకల్పన జరుగును.

ఒకే రకపు శిలలను అనేక శిల్పుల కిచ్చినచో ఆయా శిల్పుల సామర్థ్యముమీద ఆ శిలలలో ఆయా రూపము లావిర్భవించునే గాని ఆ రూపము లంతకు క్రితమే యందిమిడియుండి మాత్రముగాదు.

కాగా శ్రీ శాస్త్రిగారి వ్యాసమంతయు 'పరస్థలములను దీయుట' యను శిల్ప పరిభాషపై నాధారపడినారు. వారు పేర్కొనినట్లు శిల్పులు 'పరస్థలములను దీయుట' యను పదమును వాడుచున్నను కేవలము ఆ యర్థముతో మాత్రము వాడుట లేదు. శిలయందు ప్రతిమా రూపమును కల్పించునపుడు చేతులమధ్య, భుజమునకు నడుమునకు మధ్య, సంధుల

మధ్య గల రాతిని తొలగించి సంపూర్ణ స్వరూపమును కలిగించు కష్టమైన కార్యమును గుణించియే ఆ పట మును వాడుట మా శిల్పులయం దాచారమై యున్నది.

ఏదేని ఒక శిలలో ఒక రూపము ముందే దాగి యుండు విషయము సత్యమనుకొనినచో క్రొత్తగా నేర్చుకొను శిల్పి కొన్ని శిలలలో రూపమును సంత రింప సంకట్టి భగ్నమయినప్పుడు అట్టి రూప మట్టి దశయందు అందు ముందే యుండియుండునని ఊహింప సరిగా నుండదు కదా.

పై విషయ వివరణమంతయు శిల్పి తానొక రాతిని మలచవలయునని సంకల్పించినపుడు శిలా సంగ్రహణ మెట్లు చేయునో శాస్త్రమందు తెలిపియున్నది. 'శిలా సంగ్రహణము' అనునది శిల్పులకు చెప్పు ప్రథమ పాఠము, ముఖ్యమైనది. దీనిని గుణించి మరొక సందర్భమున వివరించుకొనవచ్చును. ప్రకృతము శిలకు, శిల్పికి, శిల్ప శాస్త్రమునకు గల సంబంధమును గూర్చి పరిశీలింతము.

శిల్ప శాస్త్రములో 'శిల్పి మాతా శిలా పుత్రో శాస్త్రం పితృరూపకే' అని ఒక సందర్భమున తెలియ జేయబడియున్నది. దీనిని కొంత శ్రద్ధతో పరిశీలించి నచో పూర్వులు, శిల్పులు, ఎంత అనుభవముతో ఈ విషయమును తెలియజేసియున్నదీ తెలుసుకొన వీలగును.

శిలకు, శిల్పికి, శాస్త్రమునకును అవినాభావ సంబంధము మిక్కిలి ముఖ్యమై యున్నది. కుటుం బమునందు తండ్రి పెద్ద, పోషకుడు, కర్త. అట్లే శాస్త్రమును, కుటుంబములో తల్లి యెట్లు తన భర్త కనుకూలముగ, భర్తయొక్క అభిప్రాయములకు తగి నట్లుగ వర్తించునో అట్లే శిల్పి శాస్త్రమునకు విధే యుడై శాస్త్రమందు పేర్కొనబడినట్లుగా నడచు కొనును. లేకున్న ఆ ప్రతిమ శాస్త్ర విరుద్ధమగును. పూజానర్హ మగును. భార్యాభర్తల దంపత్య భావ మెట్టిదో అట్టిదే శిల్పికి శాస్త్రమునకును గల సంబం ధము. వారి అవినాభావ సంబంధము, మేలు కలయిక, ఆదర్శ నిధానముల పుణ్య ఫలితమే పుత్రుడు—శిల. (శిలయందు మలచబడిన ప్రతిమ). ఇచ్చట శిల అనగా తయారైన ప్రతిమ, లేక మాతాపితలు తలంచినట్లు నిర్ణయించుకొనినట్లు, మలచగలచుకొనినట్లురూపము సంతరించుకొనినది. కనుక శిల్పి శిలకు సేవకుడు గాడు, అస్వతంత్రుడు గాడు. శాస్త్రము నిర్దేశించి నట్లు శాస్త్రపరిధులలో, తన కల్పనాశక్తికి అనుభవ మును జోడించి, మేళవించి, మేటి గండశిలలయం దెట్టి వాని యందైనను ఎట్టిరూపములనైనను మనోహరముగ, చక్కగ సంతరింపజేయగల సమర్థుడు, స్వతంత్రుడు. అదియే శిలాశిల్పియొక్క విశిష్టత, మహత్వము.

శ్రీ మే. పం. సుబ్రహ్మణ్యం.

## కిష్కింధానగర మెచ్చట ఉన్నది

వాల్మీకి రామాయణము ప్రాచీన మహాకావ్యమేకాక చారిత్రక కావ్యంకూడ. అనేక చారిత్రకాంశ ములు ఇందు పొందుపరచుటయే ప్రధాన కారణము. ఇంకను రామాయణమువలన నాటి భౌగోళిక విషయ ములుకూడ తెలియుచున్నవి. కాని కొన్నిచోట్ల అవి పరస్పర విరుద్ధముగా కూడ కన్పించుచున్నవి. అట్టి వాటిలో కిష్కింధానగరము ఒకటి.

ఇది పంపా సరస్సునకు సమీపమున నున్నది. సుగ్రీవాధిష్ఠితమైన ఋష్యమూక పర్వతముకూడ పంపాసర స్తీరమున నున్నట్లు రామాయణము తెలుపు చున్నది.

'ఋష్యమూకస్తు పంపాయాః
పురస్తాత్ పుష్పితద్రుమః'

వాల్మీకి రామాయణము, అరణ్య 67–31.

సీతా రామలక్ష్మణులు అగస్త్యుని ఆజ్ఞపై గోదావరీ సమీపమందలి పంచవటిలో నివసించు చుండగా సీతాపహరణము జరిగినట్లు సీతను వెదకుచు దక్షిణ దిశకుపోగా పంపా సరస్సు ఋష్యమూక పర్వ తము కన్పించినట్లు రామాయణమువలన తెలియు చున్నది. ఈ ఋష్యమూక పర్వతము పంపాసరస్సు కిష్కింధానగరము నేటి మైసూరు రాష్ట్రములోని

బళ్ళారి జిల్లాలోగః హోస్పేట ప్రాంతముననున్నట్లు చెప్పకొనుచున్నాము.

కాని వాల్మీకి వర్ణనలు కొద్ది జాగ్రత్తగా పరిశీలించినచో ఇచ్చట సందేహ మేర్పడకపోదు.

సుగ్రీవుడు సీతాన్వేషణకై వానరులను నాల్గు దిక్కులకు పంపు సందర్భమున దక్షిణ దిశకేగు అంగద జాంబవతి ప్రముఖులతో

'సహస్ర శిరసం విన్ధ్యం
నానాద్రుమ లతాయుతం
నర్మదాంచ నదీం రమ్యాం
మహోరగ నిషేవితాం
........ ...............
అన్వీక్ష్య దండకారణ్యం
సపర్వత నదీ గహాం
నదీం గోదావరీం చైవ
సర్వమేవాను పశ్యత
తధైవాం ధ్రాంశ్చ పుండ్రాంశ్చ
చోళాన్ పాండ్యాంశ్చ కేరలాన్.'

కిష్కింధ—41 సర్గ.

విన్ధ్య నర్మద దండకారణ్యము, గోదావరీనది, ఆంధ్ర, పుండ్ర, చోళ పాండ్య, కేరళ దేశములను వెదుకుడని చెప్పెను.

పై శ్లోకములవలన కిష్కింధకు దక్షిణ భాగముననే విన్ధ్యపర్వతము నర్మదానది దండకారణ్యము గోదావరి మొదలగునవి ఉన్నవని తెలియుచున్నది.

అట్లే ఉత్తర దిక్కునకు వెళ్ళు శతబలి మొదలగు వారికిట్లు చెప్పెను.

'తత్రమ్లేచ్ఛాన్ పులిందాంశ్చ
శూరసేనాం స్తధైవచ
ప్రస్థలాన్ భరతాంశ్చైవ
కురూంశ్చ సహమద్రకైః
కాంభోజ యవనాంశ్చైవ
శకానాం పత్తనానిచ
అన్వీక్ష్య దరదాంశ్చైవ
హిమవంతం విచిన్వథ.'

కిష్కింధ—43 సర్గ.

పై శ్లోకములలో మ్లేచ్ఛ పుంళింద శూరసేనాది దేశములు తెలుపబడినవే కాని నేటి హంపీ క్షేత్రమున కుత్తరమున గల కృష్ణవేణీ, గోదావరి విన్ధ్యపర్వతములు ప్రస్తావించ బడలేదు.

పోనీ 'సుగ్రీవునిది శ్రుత పాండిత్యము. అందు వలన పొరపాటు జరిగినది' అని అనుటకు వీలు పడదు.

ఎందుకన సీతాన్వేషణ తత్పరులైన అంగదాదులతోనున్న ఆంజనేయుడు.

'సహ తారాంగదా భ్యాంతు
సంగమ్య హనుమాన్ కపిః
విచినోతిచ వింధ్యస్య
గుహాశ్చ గహనానిచ
............................
ఆసేదుస్తస్య శైలస్య
కోటి—దక్షిణ పశ్చిమాం.'

కిష్కింధ—50 సర్గ.

విన్ధ్య పర్వత గుహల నన్నిటిని వెతికినట్లున్నది. మరి వీరు బయలుదేరినది ఉత్తరమునకా? దక్షిణమునకా? పైగా వీరు చేరినది విన్ధ్య పర్వతము యొక్క నైఋతి భాగము. అంటే దక్షిణపు త్రోవ లోనే ఉన్నారన్నమాట. అందువలన కిష్కింధ విన్ధ్య పర్వతమునకు ఉత్తరాన ఎక్కడో ఉండియుండాలి.

ఇంకను స్వయంప్రభా గుహలో ప్రవేశించిన వానరులకు బయటకువచ్చు మార్గము తెలియనందు వలన స్వయంప్రభ అందరను బయటకు రప్పించి

'బిలమా వానరు లందరున్ వెడల
సంప్రీతిన్ నిజాక్షుల్ గరం
బుల గానంబడకుండ మూసికొన
వా పుణ్యాత్మ యోగాంచితో
జ్జ్వల శక్తిన్ నిముషంబులోనన
గుహాద్వారంబు దాటించి వా

రల కీ శైలము వింధ్యమంచు
ముదవారం జెప్పి దీవింపుచున్.'

భాస్కర రామాయణము—కిష్కింధ 434.

వింధ్య పర్వతమును చూపి వెళ్లినట్లు తెలుప బడినది. ఇది కూడ వాల్మీకి రామాయణమున గలదు.

అంగదుడు సంపాతికి జటాయు మరణ వృత్తాంతము తెలిపి జటాయువు జ్యేష్ఠ భ్రాతవగు నీకు రావణుని ఉనికి తెలిసినచో చెప్పుమనగా 'సంపాతి' రామ! రామ! లక్ష్మణా! యని ఏడ్చుచు భూషణ ములను పారవేయుచు రావణునిచే ఎత్తుకొని పోబడిన స్త్రీని వింధ్య పర్వతముననున్న తాను చూచినట్లు చెప్పెను.

అయినచో సీతను ఎత్తుకొనిపోయిన రావణుడు కూడ వింధ్యపర్వతమును దాటివెళ్లినాడు.

హనుమంతుడు లంకానగరమునకు వెళ్లుటకు మహేంద్రగిరి నెక్కి లంఘించెను. ఈ మహేంద్రగిరి వింధ్య పర్వతమునకు ఆగ్నేయ దిశలో నేటి 'ఒరిస్సా' రాష్ట్రములో నున్నది.

అందువలన వానరులు వింధ్యకు ఉత్తర భాగ మున నున్న కిష్కింధనుండి దక్షిణమునకు బయలుదేరి వింధ్యపర్వతముయొక్క నైఋతి భాగమును చేరి అచట స్వయంప్రభా గుహను ప్రవేశించి స్వయంప్రభాశక్తి వలన వింధ్యకు తూర్పు భాగమునకు చేరినట్లు తెలియుచున్నది. అచటినుండి దక్షిణమునకు బయలు దేరిన వానరులకు మహేంద్రపర్వతము ఆ పైన సము ద్రము (బంగాళా ఖాతము) కన్పడినవి.

కాని రామాయణములో చెప్పబడినట్లు మహేంద్ర గిరి సముద్రతీరమందుకాక సముద్రమునకు ఉత్తర భాగమున నున్నట్లు చారిత్రకులచే గుర్తింపబడినది. రామాయణ కాలమున మహేంద్రగిరివరకు సముద్ర ముండి యుండవచ్చు.

అందువలన కిష్కింధ, హంపీక్షేత్రము నేడు మనమనుకొనుచున్న స్థలములు కాజాలవు.

కాని సీతారామలక్ష్మణులు గోదావరీనదిని దాటి పంచవటీ ప్రాంతమున నివసించినట్లు జనస్థాన ములో ఖరాదులను సంహరించిపంప, కిష్కింధలకు వెళ్ళినట్లు రామాయణమే తెలుపుచున్నది.

అయినచో వింధ్య పర్వతమునకు ఉత్తరమున ఉండవలసిన పంప కిష్కింధలు గోదావరికి చిక్కిలి దక్షిణమున ఎందులకు ఉన్నట్లు?

శ్రీ ఎన్. ఎల్. నరసింహాచార్య.



# గ్రంథవిమర్శలు

## దశరథ రాజనందన చరిత్ర

(నిరోష్ఠ్య రామాయణము)

(మరింగంటి సింగరాచార్య ప్రణీతము. పరిష్కర్త : శ్రీ రంగాచార్య; ప్రచురణ : ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, కళాభవనం, హైదరాబాదు-4 డెమీ $\frac{1}{8}$ పేజీలు 280. హాఫ్ కాలికోబైండు వెల రు 4/—లు.)

మరింగంటి వారి కుటుంబము పండితులకు కవులకు ప్రసిద్ధి చెందినది. వారిలో ఈ గ్రంథకర్త తాను శతఘంటావధానినని అష్టభాషా విశేషుడనని సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యాది వింశతి ప్రబంధ నిర్మాణ ధురీణుడనని ఈ గ్రంథమున ఆశ్వాసాంత గద్యలలో చెప్పికొనెను ఆయన రచించిన గ్రంథములలో ఇప్పుడు ఇదియు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమును లభించుచున్నవని పరిష్కర్తలు తెలిపినారు. సీతాకల్యాణావతారికలో తాను 'నరనాగాశ్వ నృపాల సభ్య గణితుండన్' అనికూడ చెప్పికొనినాడు. వీరి సోదరులు ఎనిమిదిమంది. అందులో తెలగన్నను యయాతి చరిత్రమును అమీనుఖానుకు కృతి ఇమ్మని కోరిన మరింగంటి అప్పనగారు జ్యేష్ఠుడు, ఈ సింగరాచార్యులు ఆరవవాడు.

పరిష్కర్త శ్రీ రంగాచార్యులు దీనికి విపులమైన 71 పేజీల పీఠిక వ్రాయుటయేగాక, అనుబంధములలో (1) ఈ గ్రంథములో కవి వాడిన వివిధ వృత్తముల సంఖ్య (2) నాగబంధ ఖడ్గబంధ పద్యముల వివరణము (3) సారస్వత సర్వస్వములో పూర్వమీ గ్రంథము ముద్రింపబడిన భాగములోనుండి 48 గద్య పద్యములు (4) ఈ కవి రచించిన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమునుండి కృత్యాది భాగము 58 గద్యపద్యములు, గ్రంథాంత గద్యము (5) ఈ గ్రంథమునందున్న అకారాది గద్యపద్య సూచిక కూడ చేర్చినారు.

పీఠికలో వారు ఈ గ్రంథప్రతులు సేకరించుటకు పడ్డ శ్రమ తెల్పి ఈ గ్రంథమును (1) 1917 లో జగ్గయ్యపేటలో ముద్రితమైన గ్రంథము (2) సారస్వత సర్వస్వము, తణుకు వారు ముద్రించిన భాగము (3) ఒక వ్రాతప్రతి (4) శివయోగిగారు పంపిన రెండు తాళపత్ర ప్రతులు సంప్రదించి పరిష్కరించినట్లు తెలిపిరి. కృతజ్ఞతలలోను పీఠికలోను సాధుపాఠ నిర్ణయములో ఆచార్య శ్రీ బిరుదురాజు రామరాజుగారు అమూల్య సూచనలు చేసిరనియు, గ్రంథగ్రంథులు విడదీయుటలో మిత్రులు డా. సుప్రసన్నగారు, అగ్రజులు శ్రీ లక్ష్మణమూర్తిగారు ఎనలేని చేయూతనొసంగినట్లును తెలిపినారు, పరిష్కర్తలు మహబూబు నగరము జిల్లాలో పాలెము శ్రీ వేంకటేశ్వర భాషా కళాశాలలో ఉపన్యాసకులు.

పీఠికలో మరింగంటివారి వంశములో ప్రసిద్ధ కవి పండితులను గూర్చియు, నిరోష్ఠ్య రచన చేసిన సంస్కృతాంధ్ర కవులను గూర్చియు విపులముగా వివరము లిచ్చుటయే కాక పీఠికాంతమందు ఈ కవి కొన్ని పదములు నిరోష్ఠ్యములుగా మార్చిన విధము, (10 పదములకు), లోక వ్యవహారములో రూఢియైన పదముల మార్పు మొదలగునవి చక్కగా ఎన్నిటికో ఇచ్చి సహృదయులైన పాఠకులకు తోడ్పడిరి.

గ్రంథకర్తయందు పరిష్కర్త ఎంతో భక్తిప్రపత్తులు ప్రదర్శించినను లభ్యమైన సింగరాచార్యుల రెండు గ్రంథముల గూర్చి 'అవియును నియమమునకు లొంగి కవి ప్రతిభను తెల్పుచున్నవే గాని కవితా కళను వ్యక్తపరచునట్లుగా లేవు' (పే. 61) అని వ్రాసిన దానినిబట్టి నిష్పక్షపాత హృదయులనియు తోచును.

కాని ఒక్కవిషయములో మాత్రము పరిష్కర్త ఈ గ్రంథమునకు కవియైన సింగరాచార్యులకు

న్యాయము చేయలేదని స్థూలదృష్టికితోచి, నిశితముగా పరిశోధింపగా ఆ భావము ధ్రువపడినది. అది ఇందులో కవి పాటించిన నిరోష్ఠ్య నియమమునకు సంబంధించిన దగుటచే ప్రధానమైనది పీఠిక పే. 36—59 వరకు నిరోష్ఠ్య నియమ విశేషములనే ప్రస్తావించిరి. ఇంతవిస్తరించినను గ్రంథములో కవి పాటించిన నిరోష్ఠ్య నియమ స్వరూపమును గ్రహించుటకు సుష్ఠుగా ప్రయత్నింపక పోవుటేకాక, కంఠోక్తిగా దానిని (పే. 39) తప్పగా తెలుపుట క్షంతవ్యము కాదు. అందువలన వారి పరిష్కరణమంతయు పెడదారి పట్టినది. చిత్రకవిత్వ రీతులలో నొకటైన నిరోష్ఠ్య రచన ఈ గ్రంథమునకు ప్రాణపదమగుటచే పరిష్కర్త గ్రంథకర్తకు చేసిన అన్యాయమును కొంత విస్తరింతుము.

నిరోష్ఠ్య రచనలో ఓష్ఠ్యవర్ణము లుండ రాదనుట స్పష్టమేయైనను ఎట్టి ఓష్ఠ్యములు ఉండరాదను విషయములో మతభేదము లున్నవి. సంస్కృత వైయాకరణుల ప్రకారము,

1. ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ, ఉపధ్మానీయము—ఇవి ఓష్ఠ్యములు.

2. ఓ, ఔ— కంఠౌష్ఠ్యములు;

3. వ—దంతోష్ఠ్యము.

వర్ణోచ్చారణము ముఖములో ఏ భాగమునుండి పుట్టునో దేని సహాయముతో జరుగునో దానినిబట్టి ఈ భేదములు కలిగినవి. సంస్కృతములో లేని హ్రస్వమైన 'ఒ' కూడ కంఠౌష్ఠ్యముగానే తెలుగులో పరిగణింప వలెను.

నిరోష్ఠ్య నియమము శుద్ధమైన ఓష్ఠ్య వర్ణములకే వర్తించునా, స్థానాంతర సంపర్కమున్న వానికికూడ వర్తించునా? ఇంతేకాదు. న్యాయముగా ఈ నిషేధము పైని మొదటి వర్గములోని అన్ని వర్ణములకు వర్తింపవలెను గాని కొందరి మతములో నిషేధము వ్యంజనాపేక్షక మగుటచేత అచ్చులకుగాని ఓష్ఠ్యేచ్చులతో గూడిన ఓష్ఠ్యేతర హల్లులకు గాని వర్తింపదను మతమును కలదు. అందువల్ల ముఖ్యముగా మూడు మతము లేర్పడినవి. ఈ మతభేదములను, కొంత అస్పష్టముగానైనను, పరిష్కర్తలే పీఠికలో ఇచ్చినారు.

1. ఓష్ఠ్యములనగా 'ఉ ఊ ఒ ఓ ఔ ప ఫ బ భ మ వ'లే కాక 'ఉ ఊ ఒ ఓ ఔ' లతో గూడిన సమస్త హల్లులు. వీని నన్నిటిని విసర్జించుట దండాచార్యులు పాటించిన మతము. ఈ మతమునే నాచన సోమనాథుడు పద్యములో అనుసరించెనని తెల్పిరి, పరిష్కర్తలు.

2. 'పాఫా బాభా మావా లు' రానీయకుండుట అప్పకవి మతము. ఓష్ఠ్యములందును ఓష్ఠ సంబంధమున్న వానియందును హల్లులకు మాత్రమే అప్పకవి నియమము వర్తింపజేసినాడు. ఆయన వ్యంజనాపేక్షముగానే నియమము విధించినాడు.

3 విన్నకోట పెద్దన పంచమ వర్గాక్షరములు మాత్రమే నిషేధించినాడు. ఇతడు శుద్ధోష్ఠ్యములైన హల్లులకుమాత్రమే నిషేధము ననువర్తింప జేసినాడు. 'వ' దంతౌష్ఠ్యము కనుక దానిని నిషేధింపలేదు. అచ్చులను వదలివేసినాడు.

పరిష్కర్తలు పెద్దన అప్పకవుల నియములను సరిగానే ఉదాహరించినను 'వ్యంజనాపేక్షక' మనే మతభేద మున్నదని వారి దృష్టికి రాకపోవుటచే 2, 3 మతముల స్వరూపము వారు సరిగా గుర్తించ లేదు. పైగా అప్పకవినిగూర్చి

'అప్పకవి లక్షణములందు అచ్చులగూర్చి లేదు. ఇతనికిముందు లక్ష్యలక్షణములు గలవు గదా! వానిని చూచెనో! లేదో? రుతులను అప్పకవి నిరోష్ఠ్యములుగా వ్రాసెను—ఇవి ఓష్ఠ్యములు గదా! ఈ లక్షణము సంశయాస్పదమే యనిపించుచున్నది.' అని వ్రాసిరి. ఈ కాలములో అప్పకవిమీద దండయాత్రలు చేయుట పరిపాటియైనది. అప్పకవికంటె ఒక మెట్టు పైకి పోయి ఓష్ఠ్యాచ్చులు వానితోగూడిన సర్వహల్లులు మాత్రమేకాక 'వ'నుగూడ నిరోష్ఠ్యముగా గ్రహించిన

విన్నకోట పెద్దనమీద ఒక్కవంక పెట్టలేదు. పైగా దశరథరాజనందన చరిత్రలో విన్నకోట పెద్దన నియమమునే కవి పాటించెనని—తప్పుగానే ఐనను-వంక పెట్టక పేర్కొనిరి. ఇది ఎంతో చిత్రము!

పరిష్కర్తలు సింగరాచార్యులు ఈ గ్రంథములో కృత్యాదియందును ఆశ్వాసాద్యంత పద్యములందును నిరోష్ఠ్య నియమము పాటించలేదని తెలిపిరి. అంతవరకు సత్యమే కాని తక్కిన గ్రంథములో కవి పాటించిన నిరోష్ఠ్య నియమమును సరిగా పరిశీలింపక దానిని గూర్చి పీఠికలో నిట్లు వ్రాసిరి.

'ఓష్ఠ్యవర్ణములైన ప—ఫ—బ—భ—మ—యను నక్షరములను కవి కథాభాగములో నెచ్చటను ఉపయోగింప లేదు. దండిమతప్రకారముగా వర్గ వ్యతిరిక్తములైన వర్గాక్షరములకు ఉఊ ఓఔలతో కూడిన హల్లులు నిరోష్ఠ్యములయందు చేరవు. తెను గున విన్నకోట పెద్దన ప్రకారముగా నవి నిరోష్ఠ్యములు. సింగరాచార్యులు పెద్దన నియమానుసారముగా నా వర్ణముల ధారాళముగా వాడియున్నాడు. 'ఐనను మానహీనుడగు నట్టిడు—' (1—56) ఇత్యాది పద్యమునందు పై వర్ణములు హెచ్చుగా నున్నవి. కావున సింగరాచార్యుల పద్ధతి పెద్దన లాక్షణికత్వముతో (లక్షణముతో అనుట యుక్తము) సరియగును.' స్థూలముగా చూచువారికి పై వాక్యములు సత్యములే యను భ్రాంతి కల్పించును. కాని వారు ఉదాహరించిన పద్యము (1—56) ఎవరో ముద్రాపకులు పూరించినది కాని సింగరాచార్యులు వ్రాసినది కాదు పే. 12 అథస్సూచికలో, '55 నెం పద్యము నుండి 75 పద్యమువరకు 'ము' (అనగా ముద్రిత ప్రతి)లో కుండలీకరణముంచి యథస్సూచిక నిట్లు వ్రాసిరి. '[ ] ఈ గుఱుతుల మధ్యమున్న పద్యము లక్కడ కథ శిథిలమైపోవుటచే దిరుగ వ్రాయంబడియె నిందలి తప్పు వొప్పులు పరిగ్రహింప వేడెద—ఇట్లు లేఖనకర్త.' అని కలదు.

పై విషయము పరిష్కర్తలు పీఠికలో గూడ (పే. 31) 'ఆ ప్రథమాశ్వాసము (1—56)' 'ఐనను మానహీను...' అను పద్యము తరువాత నుండి కుండలీకరణ చిహ్న ముంచి 75 నెం. వచనముతో పూర్తి చేసినాడు. ఈ మధ్యభాగము పూరింప బడినదట.' (నెం. 75 పద్యమేకాని వచనము కాదు.)

ముద్రాపకు లెవరో పూరించిన భాగము ప్రమాణముగా గ్రహించి పరిష్కర్త సింగరాచార్యుల నియమమును నిర్ధారించుట శోచనీయము. ఆ ముద్రాపకుడు పూరించిన భాగము శ్రద్ధగా పరిశీలించినచో నాతడు నిరోష్ఠ్య నియమమును అప్రకటియము చూచి పాటించి నట్లు స్పష్టపడును. అందులో పా ఫా బా భా మావాలు వదలివేయబడినవి.

ఇట్లు ఇతరులు పూరించినవియు అవతారిక ఆశ్వాసాద్యంత పద్యములు వదలి వేసినచో సింగరాచార్యులు తన గ్రంథమునం దంతటను అచార్యదండి పాటించిన నియమము పూర్తిగా పాటించినట్లు స్పష్టపడును. ఇందులకు అపవాదములుగా ప్రస్తుత ముద్రిత ప్రతిలోనున్న పద్యములయు అక్షరములయు సంఖ్యను చూచినచో నవి ప్రస్తుత పరిష్కర్తల అశ్రద్ధవలననే దొరలినవని స్పష్టపడును. కొన్ని లేఖకులవియు అతిస్వల్ప సంఖ్యవి కవి ప్రమాదములును కావచ్చును. ఈ ముద్రిత ప్రతినిబట్టి వాటిసంఖ్య ఇట్లున్నది.

| ఆశ్వాసం | మొత్తం పద్య సంఖ్య | పూర్తినియమము న్నపద్యములు | భంగం కనిపించునది | భంగమున్న అక్షరములు |
|---|---|---|---|---|
| 1 | 56 | 36 | 20 | 22 |
| 2 | 158 | 136 | 22 | 27 |
| 3 | 152 | 112 | 40 | 41 |
| 4 | 173 | 152 | 20 | 24 |

షరా: 4—97 లో 'చరణసుకట' అన్నది 'చరణ కటక' అనుటకు అచ్చుతప్పగా తోచినందున అది రెండింటిలోను చేర్చలేదు.

| | | | | |
|---|---|---|---|---|
| 5 | 303 | 276 | 27 | 37 |
| మొత్తము | 842 | 712 | 129 | 151 |

పై నిచ్చిన సంఖ్యలలో ఏమైనా కొద్ది అక్షరములు కన్నుచెదిరి తప్పియుండవచ్చునుగాని రెండు

మూడుసారులు పరీక్షించి తయారుచేసిన పట్టిక. దండి నియమము పాటించిన పద్య సంఖ్య 712 దండి నియమమునకు విరుద్ధముగా ఉన్న అక్షరములు మొత్తము 151. అందులో 'ఇట్లు' అనున వెన్నో కలవు. అవి ఇతర భాగములలో ఉన్నట్లు 'ఇట్లు' అని మార్చినచో బాధ తొలగును. వచనములలోను జాత్యుపజాతులలోను బహువచనము 'లు' వర్ణాంత పదములు 'ల్' అని హలాన్తముగా మార్చినచో సరి పోవును. అట్లు చేసిన తావులు ఎన్నో ఇందే కలవు. ఉదా: 4—153 వచనము. 'కిరీటాద్యలంక్రియలు... నిశాటికలు ... కంకాణస్ఫటల్ ... చరరేఖల్...నిశాట సేనల్' అని ఉన్నది. మొదటి రెండును 'అలం క్రియల్—నిశాటికల్' అని అంటే బాధ ఉండదు. అట్లే ఎన్నో 'కనుక' లున్నవి. అవి 'కనిక' అని కాని 'కన్క' అని గాని సవరించిన సరిపోవును, కవియే కొన్ని తావులలో 'కనక' అని ప్రయోగించినాడు. ఈ విధముగా ఎన్నో అక్షరములు తగ్గిపోవును. ఈ విధ ముగా చాలా భాగము తగ్గిపోయినను కొద్ది మార్పుతో సవరింప వీలుకాని యక్షరములును కలవు. అట్టి వానిలో ఉకారమధ్యములైన సంస్కృత పదములు ఎక్కువ భాగము. ఏమైనను అట్టివాని సంఖ్య అత్య ల్పము. అవి కవి యవధాన లోపము వల్లనో, రచనా ధారకు భంగము కాకుండ ముందువ్రాసి తర్వాత సవ రించుకొనవచ్చునను ఆశయముతో విడుచుటవల్లనో చేరి యుండును. అట్టివానిని పరిష్కర్తలు దిద్ద సాహసింపక మార్పులు సూచించి యుండవలసినది.

ముఖ్యముగా ఆశ్వాసాద్యంత పద్యములు పరీక్షించి నచో కట్టతెగిన జలప్రవాహమువలె ఓష్ఠ్యవర్ణములు గుంపులు కట్టినట్లు చూడవచ్చును.

అనుబంధములో తణుకు సారస్వత సర్వస్వ ములో ముద్రించిన 48 గద్యపద్యములున్నవి. వానిలో 32 టిలో దండి నియమము పాటింపబడినది. 16 పద్యములలో 18 అక్షరములలో పాటింపబడలేదు. ఆ 18 లో 4 'వ' లు ఒక 'మ' ఉన్నవి కనుక ఏ నియమమును లేదు. ఒకటి 'వ' కనుక అప్పకవి నియమమును తప్పినది. తక్కిన 12 మాత్రమే ఉకారయుక్తములైన ఓష్ఠ్యేతర హల్లులు.

అదియును గాక ఈ కవి పాటించిన నిరోష్ఠ్య నియమము ఇందులో అనుబంధముగా ముద్రించిన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము అవతారికలో స్పష్టముగా ఉండనే ఉన్నది. పే. 183.

'అరయ క గ చ జ ట డ తదనాయల సహ
ర ద్వయమె కాని యొండక్షరములు చొఱవు
మఱియు నౌత్వోత్వములు కొమ్ము వూముడియును
వలవ దావిూద సురభాష నిలువరాదు.'

పై దానిలో ఔష్ఠ్యములు ఓష్ఠ్య సహాయ ముండు సర్వవర్ణములతోపాటు శుద్ధాంధ్రములో నుండని వర్ణములును పరిహరింపబడినవి. కవి అందలి నిరోష్ఠ్య నియమమునే ఈ గ్రంథ మందును పాటించెను.

పీఠికాంతమందు పరిష్కర్తలే నిరోష్ఠ్యము లుగా మార్పబడిన పదముల మార్పు రెండు జాబితా లలో ఇచ్చినవి మొత్తము 22 పదములు కలవు. అవి పరీక్షించినను ఇందలి నిరోష్ఠ్య నియమము స్పష్ట పడును. గ్రంథాంతమందు అనుబంధములో అకారాది గద్యపద్య సూచిక ఇచ్చినారు. అందులో 'ఉ ఊ ఒ ఓ ఔ వ' లతో ప్రారంభమైన పద్యములు కథా భాగములో లేవు. 'ఊ'తో ప్రారంభమైన పద్య మొకటి అవతారికలోనిది. 'వ' వర్ణముతో ప్రారంభించు 7 పద్యములును ఆశ్వాసాద్యంతముల లోనివి. 5—32 లో 'విశల్య కరణి'ని 'వి' వదలుటకై శల్యకరణిగా మార్చినాడు కవి సాహసించి.

ఈ గ్రంథమును కవి 19 సం.ల వయస్సులో వ్రాసినట్లు పరిష్కర్తలు ఊహ చేసినారు. ఏమైనను కవి మంచి లక్షణవేత్తగా కనిపించుట లేదు. కొన్ని ఉదాహరణములు :

1. సంతస సంగతి (5—265, 285)
2. ఇతర యహిశ్రేణి (5—280)
3. దశరథ యుగ్గతనయ (5—157)

4. కాంక్షలే యే యేగతి (5—258)
5. తత్క్రియల్ యిక్కడన్ (5—241)
6. అని యనేక చెలగె (5—216)
7. జ (చ)ండిన యట్టి యా శక్రకులీల (5-192)

యతికొరకు 'చెండిన' 'చండిన' ఐనది.

ఈ గ్రంథ ప్రచురణకు ప్రధానాధారమైన ముద్రిత ప్రతినిగూర్చి పీఠిక పే. 29 లో 'వారు వ్రాసినట్లు ముద్రిత ప్రతియందు దోషములు హెచ్చుగా కలవు. అచ్చు పొరపాట్లు కోకొల్లలు. అర్ధానుస్వారములు శకటరేఫలు స్వైరవిహారము చేసినవి. సంధి, విసంధి యనునవి గూడా లేవు.' అని వ్రాసిరి. ఈ మాటలు సాహిత్య అకాడెమీ వక్ష మున ముద్రింపబడిన ఈ గ్రంథమునకు గూడా అన్వయించు ననుటకు గ్రంథ మంతయు ప్రత్యక్ష సాక్ష్యము. పైగా వానికి తోడు దుస్సంధులు, యతి భంగములు, గణభంగములు సంయుక్త తకారము టకారమగుట కూడా చేరినవి. కొన్ని ఉదాహరింతుము.

1. శశి గ్రహాళికి నది చక్కి నెగసినట్లు (5—298 - తేటగీతి పాదము—యతిభంగము.)

2. కాంచన రత్న సంఘటిత రచనల చేత (5—228 సీసపాద ప్రథమార్థము - గణభంగము.)

3. తేరిలం ద్రెళ్లనేయ దద్దర్లి తరల (4—150 తేటగీతి పాదము—యతిభంగము.)

4. ళ్లినవానికి గలిగి దశకం (4—116— కందము 3 వ పాదము. గణభంగము.)

5. యల్క సింహిక జలరాంతస్థ్సలి నిలి (3—133 సీసము ప్రథమార్థము గణభంగము.) అఖండయతులు కోకొల్లలు. ఉదా: 'నింగికిఁ జక్కగ నెగిరి నిశ్చలతలం' (3—133 సీసపాదము ప్రథమార్ధము.)

దండాచార్యుల నిరోష్ఠ్య నియమమును గూర్చి ఒకటి స్పష్టపరచవలసి ఉన్నది. కావ్యాదర్శములో చిత్ర రచనలలో 'స్థాననియమే చతుఃస్థాన స్యోదాహరణమ్' అని నిరోష్ఠ్య శ్లోక మిచ్చినాడు కాని దానిని నిరోష్ఠ్యమని పేర్కొనలేదు. కాని ఆయన దశకుమార చరిత్ర సప్తమోచ్ఛ్వాసమంతయు (చివరి 7 పంక్తులు తప్ప) నిరోష్ఠ్యముగా రచించి దానికి షష్ఠోచ్ఛ్వాసాంతములో మనోజ్ఞమైన కారణము కల్పించినాడు. రాజవాహనునికి మంత్రగుప్తుడు తన కథను చెప్ప సాగెననుచు నతడు 'లలిత వల్లభా రభస దత్త దన్త క్షతవ్యసన విహ్వలా ధర మణి ర్నిరోష్ఠ్యవర్ణ మాత్మ చరిత మాచచక్షే' అని కథనంతయు (వావిళ్లవారి తెలుగు అచ్చులో 238 పంక్తులు—పది పేజీల చిల్లర) నిరోష్ఠ్యముగా చెప్పించినాడు.

ఆ కథను కేతన దశకుమార చరిత్ర ఏకాదశాశ్వాసములో 3—72 వరకు 70 గద్యపద్యములలో చెప్పినాడు. కేతన నిరోష్ఠ్య నియమము పాటింపకుండుటచే దానికి కారణమును గూడ వదలినాడు. ఈ గ్రంథ పరిష్కర్తలు పీఠిక పే. 56 లో మూలములోని నిరోష్ఠ్య రచనను కేతన అనుసరింపలేదని తెలిపినంతవరకు బాగున్నది కాని ఇతరాంధ్ర కర్తలను పేర్కొని వారు కూడ నిరోష్ఠ్య రచన చేయలేదనుటయు కొంత యుక్తమే. ఆ పైన సాహిత్య అకాడెమీవారి దశకుమార చరిత్రపై భారతిలో వచ్చిన 3 విమర్శలలో ఈ విషయము లేదని చెప్పవచ్చు, అసలు దాని పీఠికాకర్తలు ప్రస్తావింపలేదను విషయము పేర్కొనలేదు. కారణము అతివిచిత్రముగా ఉన్నది.

దాని పీఠికాకర్తలైన శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రిగారు పీఠికలో కేతన ఆంధ్రీకరణ విధానమును ఉదాహరణములతో వివరించుటే కాక, నిరోష్ఠ్య రచన మున్న మంత్రగుప్తుని కథకు ముఖ్యస్థానమైన ఆంధ్ర నగరమునకు రాజయిన జయసింహుని గూర్చి పేజీ పైచిలుకు చారిత్రక విషయాలు ప్రస్తావించినారు (46–48). ఐనా నిరోష్ఠ్య రచన వదలిన సంగతి వారు గమనించినట్లు లేదు. పొరపాటు ముఖ్యముగా చేసినది ఆ గ్రంథ సంపాదకులు. ఆ విషయము వదలి సమీక్షకులను తప్పు పట్టుట చిత్రము. ఏమైనను ఆంధ్ర విమర్శకులకు సర్వసామాన్యముగా తెలియని ఈ విషయమును ప్రకటించినందులకు పరిష్కర్తలను అభినందించు చున్నాము.

శుద్ధాంధ్ర రచనకు ఆద్యుడు యయాతి చరిత్ర రచించిన తెలగన్నయని భావించుచుండుట పరి పాటి అతనికి సమకాలికుడు ఈ సింగరాచార్యులు. కావున ఎవరి రచనముందు అను సందేహమును పీఠికలో లేవదీసినారు. ఐదారుచోట్ల ఆ ప్రశంస కలదు. కొన్నిచోట్ల సందేహమనుచు, కొన్నిచోట్ల సింగరాచార్యులే ప్రథముడైనట్లు నిర్ధారణ చేయుట స్వవచన వ్యాఘాతమనక తప్పదు. అంతటితో ఊరు కొనక తెలగన్న కృతిని అమీనుఖానుకు అంకితము చేయుటచే దానికి రాజకీయమువలన ప్రఖ్యాతి వచ్చిన దనియు, మారుమూలపల్లెలోఉన్న సింగరాచార్యులకు రావలసిన ప్రథమత్వ గౌరవము రాలేదనియు, విచారము తెలుపుట సరికాదు. సింగరాచార్యులు 'నరనాగాశ్వ నృపాల సభ్యగణితు'డని వారే ప్రస్తావించినారు. అంతే కాదు. యయాతి చరిత్ర కృతిపతియైన అమీను ఖాను కుమారులలో నొకరగు అబ్దుల్ కరీము కచేరీని వర్ణించుచు సింగరాచార్యులు ఉత్పలమాల రచించెననియు ప్రస్తావించినారు. అదియే తెలగన్న కంటె సింగరాచార్యులు చిన్నవాడని సందేహింప జేయును. పీఠికలో కవి వయస్సు రచనల కాలము వెనుకకు లాగుటకు ఎన్నో అంకెల గారడీలు చేసినారు. ఇదంతయు పరిష్కర్తల దురభిమాన మనక తప్పదు.

ఎవరికో 'బాధాకరముగా మాత్రముండును' అన్నారు 50 వ పేజీలో. ఎవరికి? తెలగన్న విమర్శకులకు ఆత్మబంధువా, ఒక శాఖవాడా? 'ఎవరి అచ్చతెనుగు కావ్యము ముందు' అని ఇకముందు తెలగన్న సింగరా చార్యుల మధ్య విమర్శకులు వాదోపవాదములు చేయు టకు అవకాశ మిచ్చినందులకు అభినందించు చున్నాము.

పరిష్కర్తలు అనుబంధములో (పే. 166) కవి వాడిన వివిధవృత్తముల సంఖ్య నిచ్చుట ప్రమోదా వహము. కాని 4 వ ఆశ్వాసములోని సంఖ్యలను లెక్కింపగా సరిపోలేదు. సీసములు 15 అనిరి. 16 ఉన్నవి. తేటగీతములు 12 అనిరి 18 ఉన్నవి. ఆట వెలదులు 9 అనిరి. 12 ఉన్నవి. కందములు 67 అనిరి. 66 ఉన్నవి. ఏవో గీతములు 10 ఉన్నవనిరి కాని అవి ఏవో అచ్చులో కనబడలేదు. అచ్చులో 'తే' అని గుర్తింపబడిన వాటిలో రెండు (1138 168) ఆటవెలదులు. తక్కిన ఆశ్వాసములలో సంఖ్య సరి చూడలేదు. ఇటువంటి అశ్రద్ధ చూపుటకంటె ఊర కున్న బాగుండెడిది.

మరింగంటి వారి కుటుంబములో ఎందరో కవులు పండితులు జన్మించిరని చెప్పుట బాగున్నది. కాని కవి పూర్వుడైన సింగరాచార్యులకు సరస్వతీదేవి స్వప్నములో కనబడి ఆమె కొన్ని తరములపాటు మరింగంటివారి ఇంట 'దాస్యము చేయుదు'నని చెప్పి నట్లు కలదని ఐతిహ్యము ప్రస్తావించుట సరసముగా లేదు. పరదేవతను కలలోనైనను దాసిగా భావించుట ఏ మాత్రము గౌరవాస్పదము కాదు. పినవీరభద్రదన 'వాణి నా రాణి' అన్నాడనే కథకంటె న్యూనమైనది. అక్కడ 'రాణి' అంటే 'ప్రభ్వీణి' అనిచెప్పి సాధింప వచ్చును. కాని ఈ కథకు ఆధారముగా ఉదాహరించిన సింగరాచార్యుల పద్యములో మాత్రము అనౌచిత్యము లేదు. అందులో, భాషా దోషము లుండుగాక!

'కొడుకక దెబ్బ మెచ్చి యటు
కూర్మిని యిచ్చిన మాట దప్పకన్
విడితముగా నహర్నిశము వేడ్కతొ
మద్గృహ సీమ నుండుతన్.'

మరింగంటి వారి కులగురునికి పరదేవతాపరాధమును అంటగట్టు కథను ప్రస్తావింపకుండ పరిష్కర్తలు నిగ్రహము చూపి ఉండవలసినది.

ఈ నిగ్రహ రాహిత్యము పీఠికలో నంతట కాన వచ్చుచున్నది. నిగ్రహముతోపాటు విచక్షణయు లోపించినది. పీఠిక అనవసరముగా 71 పేజీలకు పెరిగినది. పే. 39–59 లు సంస్కృతాంధ్రములలో నిరోష్ఠ్య రచన చేసినవారి రచనలు ఉదాహరించుచు పోయినారు కాని ఎవరు ఏ నియమము పాటించిరో ప్రదర్శింప బూనుకొనలేదు. మచ్చ వెంకటకవి (1856—1903) శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర (1876 ము.)ను పేర్కొని, ఒక్క పంక్తి కూడా అందులోనుండి ఉదహరింపక దానిమీద వచ్చిన పండిత ప్రశంసలు పైచిలుకు ఉదహరించినారు.

ప్రాంతీయ దురభిమానాలు ద్వేషాలు సారస్వత రంగానికైనా రాకుండా చూచుట సారస్వతాభిమానుల విధి. 'పూర్వ మెవరో ఒక ప్రబుద్ధుడు 'నిజాం రాష్ట్రమున ఆంధ్ర కవులు—పండితులు శూన్యము' అని వ్రాసినారట. దానికి జవాబుగా స్వర్గీయ ప్రతాపరెడ్డిగారు గోల్కొండ సంచికను ప్రచురించుట సబబే. అది 1943 నాటి మాట దాని నిందులో ప్రస్తావించుట అప్రస్తుతము. పైగా ఆ సంచికలో నల్లగొండ కవుల సంఖ్య 57 మాత్రమే కలదనియు 'వదలిపెట్టబడిన కవులే యీ జిల్లాలో షుమారు 60 మంది కలరు' అనియు బాధ వెలువరించిరి. కవులు వారి పట్టణములకు మండలములకు ప్రాంతములకు భాషలకు మాత్రమే పరిమితులు కారాదు. వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు, హోమరు, వర్జిలు, దాంతే, షేక్స్పియరు, మోలియరు, గెతే, రవీంద్రుడు— మొదలగువారు విశ్వకవులు. ఆ స్థాయికి చేరుకొనుటకు ఆంధ్ర కవులు చేరుకొనవలసిన ఈ కాలములో, ప్రాంతీయ దురభిమానములు వదలవలసిన అవసరమెంతో ఉన్నది.

మన ఈ సింగరాచార్యుల గ్రంథములలో దశరథరాజనందన చరిత్రను ప్రప్రథమముగా (1917 లో) ముద్రించినది. కృష్ణాజిల్లా జగయ్యపేటలోని ఆంధ్ర సారస్వత గ్రంథమాలవారు. ముద్రాపకులు బెజవాడ వాణీ ముద్రాక్షరశాల వారు. ఆ సంవత్సరమే ఇందులో కొంత భాగము గోదావరిజిల్లా తణుకు సాంస్కృత సర్వస్వములో ప్రచురించిరి. మరియొకటైన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమును ప్రబంధకల్పవల్లియను పత్రికలో ప్రచురించి 1910 లో గుంటుపల్లి సోమయ్యగారు గుంటూరులో గ్రంథ రూపమున ముద్రించిరి. వారికి ప్రాంతీయ దురభిమాన ముండెనా?

మరింగంటివారు కొందరు 'విశాఖపట్నము జిల్లాయందలి భీమునిపట్నము కృష్ణామండలములోని మొఖాసా కలువపూడియందును గలరు' అని పరిష్కర్తలు పీఠికలో (పే 6) పేర్కొనిరి.

ఈ గ్రంథకర్త పైగా 'నరనాగాశ్వ నృపాల సభ్యగణితుండ'నని నరపతుల అశ్వపతుల గజపతుల (విజయనగరము, గోల్కొండ, కటకము) కొల్వులలో పూజింపబడితినని చెప్పుకొన్నాడు. 'అతడు' అనుటకు అతగాడు ఆతగాడు' అని వాడుట గోదావరినుంచి తూర్పు మండలాలలోనే గాని కానరాదు. ఈ కవి రెండు గ్రంథములలోను 'ఆతగానికి' అని తరుచుగా ప్రయోగించుట చూడగా మాకాశ్చర్యమైనది. ఆ శబ్దము ప్రౌఢ్యము, శబ్దరత్నాకరాదులలోని కెక్కినది. కాని నన్నయ, నన్నెచోడ, తిక్కన, శ్రీనాథ పదప్రయోగ కోశములలో కానరాదు. కాబట్టి గజపతుల కొలువుకు వెళ్లుచు బహుకాల మీ కవి ఆ ప్రాంతములలో ఉండెనేమో యని సందేహము కలిగినది.

చిత్ర కవిత్వమునకు మచ్చుగా ఈ గ్రంథ ప్రచురణమునకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవారు పూనుకొనుట సర్వవిధముల సంభావ్యమే. కాని సాహిత్య అకాడెమీవారు తమ పైన పెట్టిన భారమును పరిష్కర్తలు శ్రీ రంగాచార్యులుగారు తృప్తికరముగా నిర్వహింపలేదని చెప్పక తప్పలేదు. వారి ఉత్సాహము ఆవేశమును కలిగించి శ్రద్ధను నిగ్రహమును పోనాడ జేసినది. పైగా విశేషానుభవమును

విజ్ఞతయు గల డా. బి. రామరాజు, సుప్రసన్న గారల సహాయముకూడా సరిగా ఉపయోగించుకొనలేక పోవుట మరింత విచారకరము.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవారు మరింగంటి సింగరాచార్యుల శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమును గూడ అచిరకాలములో ప్రచురించుటకు పూనుకొని పరిష్కరణమునకు సంపాదకత్వము వహించుటకు ఉత్సాహముతోపాటు శ్రద్ధయు సమర్థతయు కలవారిని ఎన్నుకొందురు గాక!

శ్రీ నోరి నరసింహశాస్త్రి.

## ఏది నిజం?

(రచయిత: శ్రీ ఎక్కిరాల—భరద్వాజ, ఎం. ఏ., హెడ్ ఆఫ్ ది ఇంగ్లీష్ డిపార్టుమెంట్, ఎస్. బి. కె. ఆర్. సైన్సు అండ్ ఆర్ట్సు కాలేజి, విద్యానగర్, నెల్లూరు జిల్లా. క్రౌను సైజు 66 పుటలు. వెల రూ. 1-25.)

'ఈనాడు సృష్టిగురించి, మానవుని గురించి, జీవిత లక్ష్యాన్ని గురించి, వానిని సాధించే మార్గాలను గురించి 'ఇది నిజం' అంటే 'అది నిజం' అనే విభిన్న దృక్పథా లున్నాయి. వాస్తవానికి మానవుని చరిత్ర అంతా ఈ ప్రశ్నలకు సమాధానము కోసము అన్వేషించడమే మానవుని నాగరికత.' అని రచయిత గ్రంథ ప్రారంభంలోనే తెలుపుతూ, ఆ 'నిజం'యొక్క స్వరూపాన్ని గురించి ఈ చిన్న పుస్తకంలో ఆరు వ్యాసాలలో సంగ్రహంగా చర్చించి తమ అభిప్రాయాలను వెల్లడించారు.

ఈ విషయాలను గురించి చర్చించేవారిలో రెండు తెగలు ఉన్నవి. కొందరు తాము చదివిన వాటి నుంచీ, విన్నవాటినుంచీ ఒక దృక్పథాన్ని ఏర్పరచుకుని వాటినే విశ్వసిస్తారు. చిన్నప్పటినుండీ జరిగిన శిక్షణకూ, పరిసరాలకూ, అనుకరణలకూ లొంగిపోవడం దీనికి కారణం. ఈ పద్ధతికి చెందినవారే ఎక్కువ మంది. మరో కోవకు చెందినవారు పుస్తకాల జోలికి పోకుండా, స్వయంగా తీవ్రంగా ఆలోచించి, ఒక నిశ్చయానికి వస్తారు. వారి నిర్ణయాలు—ఆ తర్వాత గ్రంథాలను పరిశీలిస్తే విరుద్ధంగా (సాధారణంగా) కనబడవు. ఆ పద్ధతికి చెందినవారే ఈ రచయిత. వీరు మొదట్లో తీవ్రంగా ఆలోచించి కొన్ని నిర్ణయాలకు వచ్చాక-గ్రంథాలను చూస్తే వాటిలోనూ ఆ నిర్ణయాలే కానవచ్చేవి. ఈ విషయాన్ని గ్రంథకర్త తొలి వ్యాసంలో వివరించారు. 'తీవ్రంగా కృషిచేసి, మన మనస్సును తగిన స్థాయికి తీసుకొనివస్తే, గొప్ప మేధావంతులకు స్ఫురించిన సత్యాలు సామాన్యమైన మన మనస్సుకుకూడ తట్టుతాయి' అని ఆయన అనుభవ పూర్వకంగా ఇందులో తెలిపారు.

'నిజం అన్నదాంట్లో వివిధ తెగల నిజం వుంటుంది. ఒకే ఒక్క వస్తువు లేక విషయము గురించి మామూలుగా స్థూలమైన అనుభవం ఒకటుంటుంది. నిశితంగా చూస్తే ఆ మొదటి దానికాధారమై, సామాన్యంగా దానికి విరుద్ధంగాను, వ్యతిరేకంగాను మరొక నిజం వుంటుంది' అని రెండో వ్యాసంలో చెప్తూ దిక్కులాది విభాగాన్ని రచయిత ఉదాహరణంగా చూపారు. భూమి గోళంగా ఉన్నదని గుర్తుంచుకుంటే తూర్పు, పడమర అంటూ ఏవీ లేవని తెలుస్తుందని వివరించారు.

'దైవం, లోకాలు, ఆత్మ మొదలైనవన్నీ కల్పితాలా? వాస్తవాలా? అనే విషయాన్ని గురించిన చర్చ మూడవ వ్యాసంలో ఉన్నది. ఇందులో అనంతమైన శక్తిని గురించిన విషయంలో ప్రోటానులు, ఎలక్ట్రానులు, ఎక్స్‌రే మున్నగువాటి ప్రస్తావనా ఉన్నవి.

పదార్థమనేది ఎక్కడ ఉన్నా, అందులో మూల శక్తి, ఆ శక్తియొక్క చైతన్యధర్మము ఉంటాయనీ, సృష్టిలోని వస్తువులన్నీ చైతన్య శక్తియొక్క రూపాంతరాలనీ, జడం అనబడే పదార్థంలో చైతన్యం ఉనదనీ తర్వాతి వ్యాసంలో కొన్ని సంఘాల ఉదాహరణతో కూడా తెలుపబడింది.

'బ్రహ్మ సత్యం—జగన్మిథ్యా' అనే దాని నిరూపణ అయిదవ వ్యాసంలో ఉన్నది. ఇందలి చర్చ ఆధు

నిక విజ్ఞానశాస్త్ర పద్ధతి ననుసరించి జరిగింది. 'దేముడు లేడు' అనేవా రంతా సృష్టిని కేవలం స్థూలము వ్యావహారికమూ అయిన పద్ధతిలో మాత్రం చూచి, 'వాస్తవము' మాత్రమే అయిన 'భగవంతుని ఉనికిని అర్థం చేసుకోరు'అని ఇందలి సారాంశం తెలుప బడింది.

'ఆదిచైతన్యమే భగవంతుడు – త్రిమూర్తి స్వరూపుడు–(బ్రహ్మ=అంతటా నిండి ఉన్నట్టివాడు; విష్ణువు=వ్యాపకుడు; శివుడు=పరిపూర్ణుడు)...సంకుచి తత్వం, అజ్ఞానం అన్న అంధకారంవైపు గాక, నిజం అన్న వెలుగువైపునకే మా మనస్సులను తీసుకొని పోవుగాక! 'అన్నదే చరమ ప్రార్థన' అంటూ గ్రంథం ముగించ బడింది.

'ఏది సత్యం?' అనే విషయాన్ని గురించి వివిధ దృక్కోణాలలో 10-12 ఏండ్లు అన్వేషణచేసి, ఆధు నిక విజ్ఞానశాస్త్ర పరిశీలనతో—సమన్వయంతో సహా 'నిజం' యొక్క స్వరూపాన్ని నిరూపించి, తమ ఉన్నతాభిప్రాయాలను శ్రీ భరద్వాజగారు వెల్లడించి నందుకు ఆయనను అభినందించవలసి ఉన్నది.

'ఆంగీరస'.

## వసుచరిత్ర వైశిష్ట్యము

[రచయిత: శ్రీ వింజమూరి రంగాచార్యులు, ఎమ్. ఏ., బి. ఎల్; డబుల్ క్రౌను – 32 పుటలు. వెల రూ. 1–00, ప్రకాశకురాలు: వింజమూరి జ్యోతిర్మయి, ఎమ్. ఏ., 29 ఫస్టు మెయిన్‌రోడ్డు, గాంధీనగర్, మద్రాసు–20.]

సంస్కృతాంధ్ర సాహిత్యములలో విఖ్యాతు డును ప్రతిభావంతులలో శిరోమణియునైన రామరాజ భూషణుని రచన సారస్వత కల్పక రాజఫలతుల్యము. దానిని మించిన కావ్యము ప్రపంచ సారస్వతమందు లేదనుట అతిశయోక్తి కానేరదు.

ఇందలి కథావస్తు విస్తరణము, పాత్ర సృష్టి సామంజస్యము, ధ్వని విశేషములు, శ్లేష – చమత్కార ములు, అంతరార్థములు మున్నగు సూక్ష్మాతి సూక్ష్మ విషయములను పి. హెచ్‌డి. పట్టమునకు పరిశోధనచేయు— జ్యోతిర్మయిగారి ఉపయోగార్థము తాతగారగు రంగాచార్యులవారిచే వివరింపబడినవి.

మూలభారతమందు విస్తృత సమగ్ర కథా వస్తువు సుమారు ఎనుబది శ్లోకములలో నుండగా— అందే మరియొకచోట ఐదు శ్లోకములలో నిమిడి యున్న గిరికావసురాజుల వివాహ వృత్తాంతమును మాత్రమే కవి గ్రహించి వ్రాసెననియు, అందులకు కారణము వేదాంతమును ఇముడ్చుటయే యనియు, ఇందులకు తార్కాణగా విశిష్టాద్వైత త్రివృత్కరణ పరముగాను రామాయణపరముగాను, జీవాత్మ పర మాత్మల సంబంధ పరముగాను ధ్వని విశేషములు కన బడుటయే యనియు, వివాహ నక్షత్రము కూడ సీతా రామ, పద్మావతీ శ్రీనివాసుల వివాహము నాటిదేయని, సూచన కలదనియు చర్చించి నారు. పైగా కవి మొదటి పద్యమందే నాటక నాందీ పద్యములవలె ఈ అంత రార్థముల నన్నిటిని స్ఫురింప జేసెననికూడ వివ రించినారు.

మహాకవుల రచనలలోని యొక సుగుణ మేమనగా, ఎవరెన్ని విధముల, చదివి చదివి, తరచి తరచి ఆశ్చర్యకరమైన నూతనాంశములు చూపినను సమంజ సముగానే కనబడును ఇంకను క్రొత్తవి ఎత్తిచూప వలయుననియే తోచుచుండును. ఒక్కొక్కప్పుడు కవి యుద్దేశింపని ఊహాతీతములైన విషయములు కూడ వ్యాఖ్యాతలకు కనబడుచుండుట అసహజము కాదు. వ్యాఖ్యాతయే ప్రతిభావంతుడని కూడ తోచును.

కానీ విశ్వవిద్యాలయముల పెద్ద పెద్ద పట్టము లకు వ్రాయువారికి వేదాంతాది విషయ పరిశోధన కన్నను భాషా వాఙ్మయ విషయములను గూర్చి, వాని పరిణామము, వ్యాకరణ విశేషములు, శబ్దప్రయోగ వైచిత్రి, ప్రబంధ నిర్మాణము, కావ్యమార్గము మున్నగు విషయముల గూర్చి, విశేషాంశములను పరిశో ధించి చూపుట (Original literary research) ప్రధాన మేమో!

—వేదం రామశాస్త్రి

# గ్రంథ స్వీకారము

## బుద్ధ గీత

సద్యకావ్యము

(రచన : శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మ మూల్యము : ఒక్క రూపాయి (పుటలు 132) ప్రతులకు : శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మ, శ్రీ వాణీ నిలయము, టౌనుహాలు వెనుక వీధి, తణుకు-ప గో. జిల్లా.)

ఈ బుద్ధగీతలోని గీతలన్నీ మధురాతి మధుర ములే. ప్రతివారూ పఠింపతగినది.

## శ్రీ మద్రాజరాజేశ్వరీ శతకము

(రచన : శ్రీ పొ. సత్యనారాయణ వెల : 0-25 పై. (పుటలు 32) ప్రతులకు: శ్రీ ఎమ్. జి. పీతాంబర్‌ధర్, పటేల్ నగర్, బళ్లారి.)

## గీతా పరామర్శ

(ప్రథమ భాగము)

(1, 2 భాగములు) (పుటలు 60)

(గ్రంథకర్త : శ్రీ కురుమోజు పార్వతీశ్వరా చార్యులు వెల : 2-00 రూపాయలు ప్రతులకు : శ్రీ కె. పార్వతీశ్వరాచార్యులు బక్షీపల్లి, గొళాబంద పోస్టు, వయా గోపాలపురం, గంజాంజిల్లా, (ఒరిస్సా)

## మహారథికర్ణ

(నాటకము)

(రచన: శ్రీ టి. ఎస్. మాధవరావు, మూల్యము: 3 రూపాయలు (పుటలు 114) ప్రతులకు: శ్రీ టి. ఎస్. మాధవరావు, లెక్చరర్, ప్రభుత్వ జూని యర్ కాలేజి, కానూరు పోస్ట్, రేపల్లె తాలూకా, గుంటూరు జిల్లా)

## క్రాంతిపూలు

(పిల్లల గేయాలు)

(రచన : సమరారావు వెల : 1 రూపాయి (పుటలు 60) ప్రాప్తిస్థానం: ఉపాధ్యాయ ప్రచుర ణలు, చెట్ల బజారు, విజయవాడ-2.)

## కథాకావ్యమణి మంజూష

(పద్యకావ్యము)

(కర్త : శ్రీ మోచెర్ల రామకృష్ణ కవి వెల: రెండున్నర రూపాయలు (పుటలు 55) ప్రతులకు : శ్రీ మోచెర్ల రామకృష్ణయ్య (అధివక్త) 'కవితా నికేత నము' అత్తితోట అగ్రహారము, నెల్లూరు)

## ముక్త గీతికలు

(ప్రసిద్ధులైన ఉర్దూ కవుల గజల్లకు తెనుగు సేత : శ్రీ నల్లపురెడ్డి బుచ్చారెడ్డి. మూల్యము: అయిదు రూపాయలు (పుటలు 97) ప్రాప్తిస్థానాలు: (1) భానూదయ ప్రచురణలు 161/S R T, సైదా బాద్ కాలనీ, సైదాబాద్, హైదరాబాద్-36 (2) వాణీ బుక్ సెంటర్, బస్సుస్టాండ్ రోడ్, మహ బూబ్ నగర్ (ఆం. ప్ర.)

## శ్రీ శ్రీ శ్రీ చిదానంద భారతీ స్వాములవారి జీవిత చరిత్రము

[మహిమ్న స్తోత్రముల శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ కృత ఆంధ్రానువాద సహితము; అమూల్యము; పుటలు 103; ప్రతులకు: అన్నపూర్ణా పీఠము, విశ్వేశ్వరాశ్రమము, రామాయంపేట, మెదకు జిల్లా, ఆం. ప్ర.]

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna,